

*Fyodor Dostoyevsky*

# POOR FOLK

**Visalaandhra Publishing House**

**VIJAYAWADA.**

2

ఫైడర్ డోస్టోవస్కీ

# పేదల బ్రతుకులు



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

3

# రచయిత జీవిత సంగ్రహం

ఫ్యోడోర్ మిఖైలోవిచ్ డోస్టోవస్కీ (1821-81) మాస్కోలో జన్మించారు. ఆయన తండ్రి ధర్మాసుపత్రిలో వైద్యులు. డోస్టోవస్కీ 1843 లో సెంట్ పీటర్స్‌బర్గులోని సైనిక ఇంజనీరింగ్ కళాశాలలో పట్టభద్రులయ్యారు. వెంటనే ఇంజనీరింగ్ మంత్రిత్వశాఖ డిజైనింగ్ కార్యాలయ ఉద్యోగిగా చేరారు. ఆ ఉద్యోగంతో అసంతృప్తి చెంది, 1844 లో రాజీనామా పెట్టారు. అటుపిమ్మట రచనా వ్యాసంగం చేపట్టారు.

డోస్టోవస్కీ రచించిన మొట్టమొదటి నవల "పేదల బ్రతుకులు".

అణగారిన ప్రజల బాధలనూ, గాథలనూ డోస్టోవస్కీ "పేదల బ్రతుకు"లో సానుభూతితో చిత్రించారు. ఇందులోని కథానాయకుడు - మకార్ అలెక్జెవిచ్ దెవుష్కిన్ - నికృష్ట జీవితం గడిపే గుమాస్తా. అంతా అతనిని అవహేళన చేస్తారు; ఈసడిస్తారు. కష్టాల కట్టల బరువుతో, బాధల ఊబిలో కూరుకుపోయిన దెవుష్కిన్ తన జీవితం దుర్భరంగా వుందనికూడా నోరువిప్పి చెప్పుకో లేనంత దుస్థితికి దిగజారిపోతాడు.

గొగోల్, బెలిన్‌స్కీ అనుచరవర్గంలో డోస్టోవస్కీ ఒకరు. అభ్యుదయ రాజకీయ వర్గంతో సంబంధాలుగలవని నేరం ఆరోపించిన అధికారులు డోస్టోవస్కీకి మరణశిక్ష విధించారు. ఆశిక్షను తరువాత యావజ్జీవ కారాగారవాసంగా మార్చి, సైబీరియాకు ప్రవాసం పంపించారు.

పదేళ్ళపాటు ప్రవాస జీవితం గడిపిన తర్వాత డోస్టోవస్కీ మాస్కోకు తిరిగి వచ్చారు. అయితే "మానవునిలో విశ్వాసాన్ని" ఆయన పూర్తిగా కోల్పోయారు. తర్వాత మూఢ మత విశ్వాసాలను ఆయన ప్రచారం చేశారు.

"పేదల బ్రతుకులు" రచించినవ్యక్తి చివరకు నిష్కామ క్రైస్తవప్రేమ ఆరాధకుడుగా తయారయ్యారు." నిష్కామ ప్రేమ బలీయమైనదే కావచ్చు; ఆ ప్రేమ దుఃఖిస్తుంది; గొంతెత్తి నిరసిస్తుంది; కన్నీరు తుడుస్తుంది— కాని, అది చేతులు ముడుచుకొని, చూస్తూ కూర్చొంటుంది. దానితో వచ్చిన చిక్కల్లా అదే" అన్నాడు ఎ. ఐ. హెర్జెన్.

## ఇది హృదయాన్ని కదిలిస్తుంది!

"నవ్విస్తుంది. పాఠకుని హృదయాన్ని కదిలిస్తుంది. కన్నీరు మున్నీరు గావిస్తూ, నవ్విస్తుంది. ఎంతటి ప్రతిభ, ఎంతటి ఉపజ్ఞత."

—వి. బెలిన్‌స్కీ.

ఈ కథకులు పాడుగాను! ఇంతకన్నా ప్రయోజనకరమూ, వినోదదాయకమూ, ఆహ్లాదకరమూ అయిన కథలు వ్రాయ లేరా? అది వారి చేతకాదు. ఉన్న పుస్తకనంతా పెళ్లగిస్తారు. అందులోనే వారికి ఆనందం. అసలు ఇలాంటి వాళ్లు రచనలు సాగించకూడదని నిషేధిస్తే ఎంత బాగుండును? విధి నిషేధాలవల్ల ప్రయోజనం పూజ్యం. వాళ్లు వ్రాస్తారు. వాళ్లు వ్రాసింది మీరు చదువుతారు; చదివిన తర్వాత అయినా మీరు కాస్త ఆగి ఆలోచించనన్నా ఆలోచించరు. అన్నిరకాలైన పాడు ఆలోచనలతో మీ బుర్రలు నిండిపోతాయి. అందుకే ఈ కథల రచనలను నిషేధించాలంటాను.

—— రాకుమార వి. ఎఫ్. ఒదొయొవస్కీ.



ఏప్రిల్, 8

ప్రియమైన వర్వారా అలెగ్జియేనా,

నిజంగా గడచిన రాత్రి నా జన్మానికి శివరాత్రి. అబ్బ, ఎంత ఆనందం, ఎంత సంతోషం పొందానో చెప్పలేను. ఇన్నాళ్లకు నీవు నా మాటను ఖాతకు చేశావు. అంతేచాలు. నాకదే పదివేలు. రాత్రి ఎనిమిదయింది. మామూలు ప్రకారం ఆఫీసునుంచి గదికొచ్చి, కాసేపు కునుకుతీసి, నిద్ర లేచేసరికి ఎనిమిదయింది. కొవ్వొత్తి వెలిగించాను. కాగితాలు

ముందేసుకొని కలంతో గిలుకుతూ, తలెత్తి కిటికీలోనుంచి చూస్తినిగదా - ఏమని చెప్పను? లేడివలె, లేగదూడవలె నా హృదయం చెంగుచెంగున గంతులేసిందంటే నమ్ము. ఇన్నాళ్లకు నా మనస్సులోని మమతను గ్రహించి అనుగ్రహించావు. నీ గదిలోని తెరను, సరిగా నేను చెప్పినట్టే అమర్చావు.

చంద్రబింబాన్ని పోలిన నీ చిన్నారిమోము మణివలె తళుక్కున మెరిసింది. నీవు కిటికీలోనుంచి తొంగి చూస్తున్నట్టూ, నన్ను గురించే తలపోస్తున్నట్టూ నా కనిపించింది. ఏమైనా నేను దురదృష్టవంతుణ్ణి. అవును. ముద్దులొలికే, మురిపాలుచిలికే నీ చిన్నారి ముఖారవిందాన్ని తనివితీరా తిలకించే అదృష్టం నాకు లేకపోయింది. ఏమి చేస్తాను? చూపు తగ్గిపోయింది. వయసు మీగుతోందికదూ. వయసు మీరటం ఎవరికీ వాంఛనీయంకాదు. ప్రతిదీ మసకమసకగా కన్పిస్తోంది. మసకపడిన తర్వాత, దీపందగ్గర కూర్చుని ఏదైనా రాయాలని ప్రయత్నించానా, కళ్లు నీరుకమ్ముతాయి; కలకపెట్టాయి. ఉదయాన లేవగానే కను కొలకలు కన్నీటి కొలనులుగా తయారవుతాయి. కన్నీటి ధారలు జాలువారతాయి. ఇతరులెవరైనాచూస్తే, వారు ఏమైనా అనుకోవచ్చు; సిగ్గేస్తుంది. సరే ఈ గొడవకేమి వచ్చెగాని...

మసక చీకటి, కారుచీకటి కమ్మిన నా మనస్సులో నీ చిన్నారి చిరునవ్వు విద్యుత్తేజమై వెలుగు వెదజల్లింది. నీవు నా నరహాల మాలవి; ముద్దుల మూనవి; మురిపాల వానవి. నీ చిరుపెదవులు చిలికించిన చిరునవ్వులు తిలకిస్తూ,

అంతు లేని ఆనందమే పొందాను. నీకు గుర్తున్నదా? ఆనాడు నిన్ను నేను ముద్దెట్టుకొన్నప్పటి దృశ్యం. జీవితంలో మరువ లేని మధురానుభూతిని ఆనాడు అనుభవించాను. మళ్ళీ గత రాత్రి అలాంటి మహదానందమే నాకు లభించిందంటే నమ్ము. "తప్పు, తప్పు" అంటూ నీ చిట్టివేలుతో ఆనాడు నన్ను మందలించావు. జ్ఞాపకం వుందా? రేపు రాసే జాబులో గత స్మృతుల విశేషాలను వివరంగా రాయాలిసుమా!

ఇంతకీ చెప్పవచ్చిన అసలు విషయం ఏమిటంటే: నీ గదిలో తెర వుంది చూచావు, దాని విషయంలో మనిద్దరం కలిసి చేసిన కిటుకు చాలా గొప్పది. అమోఘమైనది. అమూల్యమైనది. అవునంటావా? కాదంటావా? పని చేస్తున్నా, ప్రక్కపై మేను వాల్చినా, అటుయిటూ తిరుగు తున్నా నీ వెప్పుడూ, అహర్నిశలు నన్ను గురించే యోచిస్తుం టావని నమ్ముతున్నాను. ఎప్పుడూ నేను నీ కళ్ళల్లోనే మెదుల్తుంటానుకదూ? నీవు సుఖంగా హాయిగా జీవించటం కన్నా నాకు కావలసిందింకేమివుంది? నీ గదిలో తెర క్రిందకు వాలితే, "సెలవు మకార్ అలెగ్జెవిచ్" అనీ, అది పైకి లేస్తే "శుభోదయం మకార్ అలెగ్జెవిచ్, రాత్రి నీకు హాయిగా నిద్రపట్టిందిగదా" అనీ, లేదా "మకార్ అలెగ్జెవిచ్, కులాసా యేనా, నా మట్టుకు నేను భగవంతుని దయవల్ల క్షేమంగానే వున్నాను" అనీ అర్థం చేసుకొంటాను. మనిద్దరం చేసుకొన్న ఈ ఏర్పాటు ఎంత అర్థవంతంగా వుందో చూశావా? మనిద్దరం ఇక ఉత్తర ప్రత్యుత్తరాలు రాసుకోటంకూడా శుద్ధ దండుగే అనిపిస్తోంది. నిజంగా మన తెలివితేటలు ఎంత గొప్పవి!

ఇలాంటి విషయాలలో నాతో సాటిరాగలచేటి మరొక డున్నాడా అని అప్పుడప్పుడు అనుకొంటుంటాను.

నా చిన్నారి వయ్యారీ, ఇంకొక విశేషం చెప్ప మంటావా? ఎందుచేతనో కాని, ఎప్పుడూ లేనిది, రాత్రి మాత్రం కంటినిండా నిద్రపట్టింది. తనివితీరా నిద్రపోయాను. అసలే ఇది కొత్తచోటు. అందులోనూ ఎన్నడూ కంటినిండా కునుకుపట్టని నాకు ఇలా జరగటం మరి విశేషమేకదూ? కొత్తచోట నిద్రాభంగం కలగటానికి ఏవో సవాలక్ష కారణాలు వుంటూనే వుంటాయి. అయినా రాత్రి మాత్రం అవేవీ నాపైన పనిచేయనేలేదు.

ఈ ఉదయాన నిద్రలేచేసరికి, మనస్సు ఎంతో ప్రశాంతంగా, మరెంతో హాయిగా, హుషారుగా వుంది. కిటికీ బారలా తెరచివుందేమో, ఉదయభానుని లేత కిరణాలు గదిలో పారాడుతున్నాయి; పిట్టలు పాడుతున్నాయి. కాలంకాని కాలంలో వసంతం వచ్చి పడినట్టున్నది. వసంత సౌరభం శోభిల్లుతోంది. సౌందర్యం విరిసిన ప్రకృతి వయ్యారంగా నర్తిస్తోంది. అంతా లయబద్ధంగా, రాగయుక్తంగా, అపశృతులనేవి లేకుండా సాగిపోతున్నట్టుంది. ప్రతిదీ వసంతాగమనాన్నే సూచిస్తోంది. ఏమిటో, ఈవేళ నా ఊహాలు పరిపరివిధాల పరుగులెత్తు తున్నాయి; ఆకాశమార్గాన పయనించే మేఘాలవలె పరిభ్రమిస్తున్నాయి. నా ఊహాల ఉయ్యాలలో ఊగుతున్నదీ, తూగుతున్నదీ నీవే. గగన వీధుల్లో విహరించే పతంగంవలే నీవు నాకు కన్పిస్తున్నావు. మానవ మనోనేత్రానికి ఊరట కల్గించి, నేత్రానందం చిలి

కించే నిమిత్తం సృష్టికర్త సృజించిన ప్రకృతి సౌందర్యమంతా నీలోనే మూర్తీభవించిందా అనిపిస్తోంది. వరెంకా, నేనిలా ఊహించల అంబరాన్ని చుంబిస్తుంటే, నాలో ఎలాంటి భావాలు పుట్టాయో, తట్టాయో చెప్పమంటావా? అవస్థల మధ్య, అడ్డుగోడల మధ్య, వ్యధలమధ్య జీవిస్తున్న మనకీ, చీకూ చింతా లేక, ఆకాశ వీధుల్లో హాయిగా విహరించే ఆ పక్షులకూ పోలికెక్కడ! వాటి జీవిత మెంతో మధురాతి మధురం. వాటిని చూసి మనం అసూయ చెందాలి. అంతేగా. అంతకన్నా మనం చేయగల్గిందీ, మనకు చేత నైనదీ ఇంకేముంది?

నా దగ్గర ఓ పుస్తకం వుంది. అందులో ఇలాంటి విష యాలన్నీ పూస గుచ్చినట్లు రాసివున్నాయి. స్వాప్నిక జగత్తు నా మనస్సులో మెరుస్తోంది; మెదుల్తోంది; కదు ల్తోంది. ఆ సుందర స్వప్నాలను నీకు నివేదించకుండా వుండటం నాకు సాధ్యమా? చెప్పు. వసంతం వస్తోందా, అందాలు వెదజల్లుతూ మరీ వస్తోందా, సౌందర్యం సింగారించుకొన్న ప్రకృతి కళ్ళముందు వయ్యారంగా నర్తిస్తోందా, అందుకే నేనిలా వ్రాస్తున్నాను నిజం చెప్పాలంటే, ఇదంతా నా గొప్పతనం కాదు. ఈ సంగతులన్నీ పైన చెప్పిన పుస్తకం లోనివే. నాలాగానే, ఆ రచయితా, ఎలా ఆవేదన చెందు తున్నాడో చూడు. అతని ఆవేదనంతా పద్యాలలోనే పెల్లుబుకింది:

*నేనే ఒక విహంగమై*
*గగన వీధుల విహరిస్తే!*

ఇదీ ధోరణి. ఇందులో ఇంకా అనేకానేక మధుర భావాలు కూడా లేకపోలేదు. సరేగాని, పొద్దున్నే నీవు వెళ్ళిందెక్కడికో చెప్పు. చక్కగా ముస్తాబై, సంతోషాతిశయంతో చిందులేస్తూ గదిలోంచి బయటకొస్తున్న నీవు నా కంటపడ్డావు. ఆఫీసుకెళ్ళటానికి అప్పటికి నేనింకా సిద్ధం కాలేదు. అదేమిటోగాని నిన్నెంతసేపు చూసినా తనివి తీరదు. అవును, వరెంకా. దుఃఖించకమ్మా, దుఃఖించకు. కన్నీటి ధారలు కష్టాలను కరిగించనూ లేవు; తరిగించనూ లేవు. నా మాటనమ్ము. జీవితానుభవంలో నేను నేర్చుకొన్న కఠోరసత్యం యిది. అయినా నీ జీవితం యిప్పుడు కాస్త కుదుటపడిందాయె. ఆరోగ్యం కూడా బాగుపడింది. అన్నట్టు ఫెదోరా కులాసాయేనా? ఆమె చాలా మంచిది. ఇంతకీ మీరిద్దరూ కీచులాడుకోకుండా కాలక్షేపం చేస్తున్నారా? ఏ విషయమూ తిరుగు జాబులో తెలియజేయి. ఫెదోరా కాస్త గొణిగినా పట్టించుకోకు. ఆమె ఎంతో మంచిది. దేవుని దయవల్ల పదికాలాలపాటు ఆమె బ్రతకాలి.

థెరెస్సా గురించి ఇంతకుముందే రాశాను కదూ? ఆమెకూడా సుగుణశీలి. నిజాయితీపరురాలు. మనిద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపుకోటం ఎలాగా అని మొదట్లో నేనుపడ్డ బాధ ఇంతా అంతా కాదు. మన అదృష్టం కొద్దీ థెరెస్సా దొరికింది. వెన్నపూస వంటిమనసు; ఎంతో అణకువ. చెప్పినట్లల్లా చేసే మనిషి. మొహమాటం ఇంతాఅంతా కాదు. అయితేనేం? మాయింటి యజమానురాలు కర్కోటకురాలు. థెరెస్సాను ముప్పొద్దులా కొరుక్కుతింటున్నది.

వరెంకా, నేను ఉంటున్న కొంపసంగతి ఏమని చెప్పను? వచ్చి వచ్చి మురికికూపంలో పడ్డాను. దీని కన్నా నరకకూపమే నయం. గదులు ఎలాంటివని చెప్పేది! నే నింతకుముందున్న ఇల్లు ఋష్యాశ్రమం వంటిది. ప్రశాంతతకు పెట్టింది పేరు. చీమ చిటుక్కుమన్నా విన్పించేటంత ప్రశాంతత. అది నీకూ తెలుసుగా. ఇక ఇక్కడంటావా? ఒకటే రొద; తెరిపిలేని అరుపులు; రేయింబవళ్ళు రణగొణ ధ్వని. ఇంతకీ ఈ కొంప రూపురేఖలు ఎలాంటివో నీకు చెప్పనేలేదు. పొడుగాంటి వరండా. కారుచీకటి దుప్పటి కప్పుకొన్న గుహను పోలివుంటుంది. అంతా కచాడీ. అలాంటి వరండా కుడివైపున మొండిగోడ. ఎడమవైపున జైలుకొట్టుల్లాగా, వరుసగా గదులు. వాటిని చూస్తుంటే హోటల్ గదులు గుర్తుకొస్తాయి.

ఒక్కొక్కగదిలో ఇద్దరేసి, ముగ్గురేసి మకాం. అంతా ఒక సంత. అయితే, ఈ కొంపలో నివసిస్తున్న వారంతా బుద్ధిమంతుల్లాగానే కన్పిస్తున్నారు: ఒకతను గుమ్మస్తా. ఈయనొక సాహిత్యప్రియుడు. చాలాచాలా పుస్తకాలు చదివినట్టున్నాడు. హోమర్‌ను గురించికూడా తెలుసునల్లే వుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, అసలు ఈయనకు తెలియని విషయం అంటూ ఒకటి వుందా అనిపిస్తుంది. మొత్తానికి తెలివైనవాడనే చెప్పాలి. పోతే, మరిద్దరు సైనికోద్యోగు లున్నారు. వీ రిద్దరికీ ముప్పొద్దులా పేకాట రంధి తప్పితే మరొకటి లేదు. ఈ ముగ్గురూకాక, మరొక నౌకా ఉద్యోగి, ఆంగ్ల భాషాధ్యాపకుడు, వెరసి అయిదు

గురు ప్రస్తుతం ఈ కొంపలో అద్దెకుంటున్నారు. ఈ వ్యక్తుల మనస్తత్వాలు చిత్రాతివిచిత్రాలు. వీరిని గురించి మరొక లేఖలో విచిత్రంగా చిత్రిస్తాలే. అప్పటిదాకా నీవు ఓపిక పట్టాలి.

మా యింటి యజమానురాలు కాస్తపొట్టిది. ముగ్గుబుట్టవంటితల. అయినా సింగారించుకోనిదే, కాళ్ళకు స్లిప్పర్స్ లేనిదే బయటకురాదు. చీటికిమాటికి ఘరెస్సాను కసురుకొంటూ, చుసరుసలాడుతూ వుంటుంది. పోతే, నా నివాసం వంటింట్లో. అదెట్లాంటిదో చెప్పమంటావా? వంటింట్లోనే మరొక చిన్నగది ఏర్పాటు చేశారు. వంటిల్లు కాస్తపెద్దది. చాలా మంచిది. గాలి, వెలుతురు పుష్కలం. శుభ్రంగా కూడా వుంటుంది. వంటింటికి మూడు కిటికీలు వున్నాయి. వంటింట్లోనే మధ్య ఒక తెర అడ్డంపెట్టి, గదిని ఏర్పాటు చేశారు. ఈ గదిలోనే నా నివాసం. ఈ గది ఏమంత పెద్దది కాదనుకో. అయినా యిల్లు యిరకాటం, ఆలి మరకాటం అని పెద్దలు వూరికే అన్నారా? ఏమైనా ఒక వ్యక్తి హాయిగా నివసించటానికి తగినంత విశాలమైనదనే చెప్పొచ్చు. ఒక కిటికీకూడా వుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, అన్ని సదుపాయాలు అమరిన, అనువైన గది నాకు అద్దెకు దొరికింది. కొంపతీసి, ఇందులో ఏదో గూఢార్థం యిమిడుందనుకొని, పెడర్థంమాత్రం తీయకేం? ఈ గదిలో నాకు కావలసినంత మరుగువుంది. ప్రశాంతంగా, ఏకాంతంగా జీవించగల్గుతున్నాను. ఇక గదిలో సామానుల సంగతా? నుంచి మంచం ఒకటివుంది. బల్లవుంది. ఒక డ్రాయర్ వుంది.

రెండుకుర్చీ లున్నాయి. దైవప్రార్థనకు పూజామందిరం కూడా ఏర్పాటు చేసుకున్నాను. ఇంకా ఏం కావాలి చెప్పు? ముఖ్యంగా కావలసింది సదుపాయంకదా? అన్ని సదుపాయాలు అమరిన గది యిది. ఇందులో ఏదో దుర్బుద్ధివుందని మాత్రం తలంచకు. అలాంటిది నాలో ఏకోశానా లేదు. పైగా నా కిటికీలోనుంచి నీ కిటికీ కన్పిస్తుంటుంది. వాటిమధ్య దూరం కూడా ఆట్టేలేదు. నీవు అటూ ఇటూ పచార్లు చేస్తుంటే, నాకు కన్పిస్తూనే వుంటావు. ఏకాంతజీవికి ఇంతికన్నా ఆహ్లాదకరమైన విషయం ఏముంటుంది? పైగా అద్దె కూడా కారుచౌక. గది అద్దెకు, భోజనానికి నెలకు 24 రూబుళ్ళు చొప్పున చెల్లిస్తున్నాను. ఇంతకుపూర్వం యింటికి 30 రూబుళ్లు చెల్లించుకొనేవాడిని; ఎన్నో యిబ్బందులకు లోనవుతుండే వాణ్ణి. రోజూ టీ త్రాగటానికి డబ్బు మిగిలేదికాదు. కాని ఇప్పుడో? పంచదారకు, టీకి అవసరమైన మొత్తాన్ని ఆదా చేయగల్గుతున్నాను. ఏమిటోఇక్కడ టీ త్రాగకుండా జీవించటమంటే, నలుగురిలో తలవంపులు తెచ్చుకోటమే. గౌరవనీయులమధ్య వున్నప్పుడు గౌరవనీయంగానే బ్రతికాలికదా. ఎంత యిబ్బందోచూడు! అవసరంవున్నా, లేకపోయినా, కలిమిలేములతో నిమిత్తం లేకుండా, అంతా టీత్రాగవలసిందేగదా. నలుగురితోపాటు నారాయణ అనకపోతే నామోషి. కనీసం ఇరుగుపొరుగువారికోసమైనా, టికాణా లేకపోయినా ఘరానాగా బ్రతకాలి. కనీసం ఘరానాగా బ్రతుకుతున్నట్టు నటించాలి. అందుకే టీ త్రాగితీరాలి. టీ లేకపోతే తల నొప్పిపుట్టుకొచ్చే జబ్బు నాకులేదు, నేను

దానికి దాసుణ్ణికాలేదు. అయినా టీ త్రాగక తప్పదు. పోతే, ఉత్తరోత్తరా అనుకోకుండా అకస్మాత్తుగా వచ్చిపడే అర్థాంతరపు ఖర్చులకు ఎంతో కొంత మిగుల్చుకోవాలి; పాదరక్షలకు మరికొంత కేటాయించాలి, ఇవన్నీ పోగా ఇకమిగిలే దేమిటి ? ఈ విధంగా నా జీతమంతా హారతి కర్పూరంలాగా హరించుకు పోతోంది. నే నేదో గుణుస్తున్నా ననీ, గొణుగుతున్నాననీ అనుకోకు. ఇదే జీతంతో ఎంతో కాలంగా జీవితాన్ని దొర్లించు కొస్తున్నాగా. పైగా, అడపా దడపా బోనసులుకూడా వస్తాయాయె.

సెలవు. నా కలలు విరియఃబోసిన కలువలరాణీ, దేవ కన్యా, సెలవు. కొన్ని బహుమతులు నీకు పంపుతున్నాను. వీటితో నీ గదిని ముచ్చటగా అలంకరించు. వీటిధర ఏమంత ఎక్కువ కాదు లే. చౌకగానే దొరికాయి. అన్నట్టు, నన్ను గురించిగానీ, నేను ఇలాంటి గదిని అద్దెకు తీసుకోటం గురించి గానీ, లేనిపోని ఆలోచనలు, అనుమానాలు పెట్టుకోకు. అన్ని సదుపాయాలుగల గది కనుక నే, కేవలం సదుపాయాల దృష్ట్యా మాత్రమే దీనిని నేను అద్దెకు తీసుకొన్నాను. అంతే. కొంత డబ్బుకూడా ఆదా అవుతోంది. భవిష్యత్తును చక్కదిద్దుకొనేందుకు కొంత కుదువబెట్టాలిగదా. పైకి నేను ఎందుకూ పనికిరాని దద్దమ్మ మాదిరిగా కన్పిస్తే కన్పించ వచ్చుగాక. కాని, నిజానికి నేను అలాంటి వాణ్ణికాదు. పురు షునికి వుండవలసిన నిబ్బరం, హృదయ నైర్మల్యం నాలో వున్నాయి. సెలవు, నా చిన్నారి వయ్యారీ, సెలవు. ఇప్ప టికే రెండు నిండుతావులు నింపేశాను. పైగా, ఆఫీసుకు

బయలు దేరవలసిన సమయంకూడా మించి పోతున్నది. చిరు దనం చిందే నీ చిట్టి వేళ్ళను ముద్దెట్టుకుంటూ -

నీ విశ్వాసపాత్రుడైన సేవకుడూ,

నీ ఆప్త మిత్రుడూ,

[సం] మకార్ దేవుష్కిన్.

తాజాకలం: మరొక మనవి. సకల విషయాలు పూసగుచ్చినట్లు, త్వరగా జవాబురాయి. వీశెడు మిఠాయి పంపుతున్నాను. మిఠాయి అంటే నీకు అమితమైన యిష్టం కదూ. దయవుంచి, నన్ను గురించి వ్యధచెందకు ప్రియతమా, సెలవు.

ఏప్రిల్, 8

ప్రియమైన మకార్ అలెగ్జీవిచ్,

ఆశ చూస్తే నీతో పోట్లాట తప్పనట్టేవుంది. నిజమే, నీవు చాలా మంచివాడవు. ముందు వెనుకలు ఆలోచించ

ఉండా నీవు చేస్తున్న పని నాకు బొత్తిగా నచ్చటం లేదు. నీ కడుపు కట్టుకొని, నాకు ముడుపులు పంపిస్తున్నావు. నీ కెన్నిసార్లు చెప్పాను? నాకోసం నీ వేమీ పంపించ నక్కర్లేదని. అయినా నీవు విన్పించుకోవటం లేదు. నీ ఆదరాభిమానాల జడివానలో నన్ను జలకమాడి స్తున్నావు. ఈ ఋణభారాన్ని నేను తీర్చుకోటంఎలా? ఎంతో డబ్బుతగలేసి, బహుమతులను కొనటమేల? వాటిని నాకు పంపటమేల? నా నోటనుంచి మాటజారడమే తడవుగా, నీవు బజారుకు పరుగెత్తికెళ్ళి, వస్తువులు ఖరీదు చేయటమా? నీవు పంపిన పూలకూజా, పుష్పగుచ్ఛాలు ఎంతో విలువైనవై వుంటాయి. ఇవి చూడముచ్చటగా వున్నాయి. నీకు కన్పించటానికి, వీలుగా కిటికీలో వాటిని చక్కగా అమర్చాను. కొంతకాలం ఓపికపట్టు. నేనుకూడా కాస్త స్థితిపరురాల నైనతర్వాత నా గదిని దేవేంద్ర భవనంగా మారుస్తాను. నీవు పంపిన పూలను, పూల కూజాను చూసి ఫెదోరా అదేపనిగా మురిసిపోతోంది. నిజమే. నాగది ఇప్పుడు స్వర్గధామంవలె వుంది; పరిశుభ్రంగా, అందంగా, ప్రకాశవంతంగా.

అది సరేగాని, నీ ఉత్తరాన్నిబట్టి చూస్తే ఎక్కడో, ఏదో లోపం వున్నట్టుంది: అందాలలోకం, ఆనందరాగం, వసంతకాలం, శోభాయమానం, కోకిల గానం – ఇవన్నీ నిన్ను పిచ్చివాణ్ణిగా మార్చివేస్తాయా అని భయమేస్తోంది. కొంపదీసి నీలోనుంచి కవితాధార జలధారై పొంగదుగదా? మకార్ అలెక్సెవిచ్, నిజంగా నీది కవితా హృదయమే.

ఎందుచేతనో కవిత అల్లలేదుగాని, కవికి కావలసిన అన్ని హంగులు నీకూ వున్నాయి: తొణికిసలాడే కరుణాభావాలు, చిత్ర విచిత్రాలను ఊహించగల్గిన భావనాపటిమ, అన్నీ నీలో అణగి మణిగి వున్నాయి.

ఆఁ, నా గదిలో తెర సంగతా? అసలు దానిని గురించి నేను ఎప్పుడూ ఆలోచించనే లేదు. నీకు నచ్చిన విధంగా అది ఎలా అమర్చబడిందో నాకు తెలియదు. అంతే.

మకార్ అలెగ్జెవిచ్, నన్ను నమ్మించటానికి నీవు ఎన్ని చెప్పినా లాభంలేదు. నీ అవసరాలకోసమే నీ జీతపు రాళ్ళన్నీ ఖర్చు అవుతున్నాయంటే నేను నమ్మలేను. నాకన్ను కప్పలేవు. నిజాన్ని దాయలేవు. నా కోసం నీవు కడుపు మాడ్చుకొంటున్నావు. నరకకూపమే నయమనిపించే మురికి కూపంమధ్య నివసిస్తూ "నేను నివసిస్తున్న కొంప ఎంతో హాయిగా" వుందని చెప్పితేమాత్రం నేను నమ్ముతానా? అసంభవం. ఏకాంత, ప్రశాంత జీవితాన్ని కోరుకొనే నీవు, చేపల సంతను మరిపించేచోట జీవించగలవా? నీ కొచ్చే జీతంతో హాయిగా బ్రతకవచ్చునే. ఇంతకుముందు నీ జీవితం మరింత సుఖంగా గడిచేదని ఫెదోరా చెప్పిందికూడా. కష్టాలలో పుట్టి, కష్టాలలో పెరిగి, 'నా' అన్నవాళ్ళు లేక, నలుగురితోనూ నానామాటలుపడుతూ, నికృష్ట జీవితం గడపబట్టేనా నీవు ఏకాంత జీవితాన్ని కోరుకొంటున్నావ్? వేదనచెందే నీ మనస్సుకు ఊరట కల్గించే ఓదార్పు మాటలకు నీ వెన్నడూ నోచుకోలేదు. లోకులంతా కాకులై నిన్ను వేధించివుంటారు. అందుకే అందరికీ దూరంగా ఏదో ఒక మూలజేరి, కాలక్షేపం

చేయటానికి అలవాటు పడివుంటావు. కరుణా హృదయా, స్నేహశీలీ! నీ స్థితి చూస్తుంటే నాకెంతో వేదన కలుగుతోంది. కనీసం సుఖంగా జీవించటానికి యత్నించు. దీపం ముందర కూర్చొని రాస్తుంటే, కళ్ళుకలక పెట్టుతాయని రాశావు. అయినప్పుడు రాత్రిపూట రాయనేల?

మరొకసారి వేడుకొంటున్నాను నా కోసం డబ్బు తగలెయ్యవద్దు. నన్ను నీవు ఎంతగానో ప్రేమిస్తున్నావు. నిజమే. కాని నీవు ధనవంతుడివి కావుకదా. ఈ ఉదయాన లేచేసరికి నాకూ ఎంతో హుషారుగానే వుంగి. ఫెరోడా కష్టపడి పని చేస్తోంది. నాకూ పని నెతికి తెచ్చి పెడుతోంది. హాయిగా కాలక్షేపం చేస్తున్నాం. సిల్కుదారం కొనటానికి ఉదయం బజారు కెళ్ళాను. ఇంటికి తిరిగి వచ్చాక కుట్టుపని ప్రారంభించాను. ఉదయమంతా కులాసాగా, హుషారుగా గడిచిపోయింది. కాని, మళ్ళీ విచారం నా మనస్సును ముప్పిరగొన్నది. హృదయం బరువెక్కింది.

నా గతేమికాను? నా భవిష్యత్తు ఏమిటి? రేపటి మాట ఏమిటో తెలియదు, సందిగ్ధావస్థలో, సందేహాలమధ్య, అనిశ్చితతో ఆందోళనలతో జీవించటం ఎంతకష్టం! గతాన్ని తల్చుకొంటే గుండెలు పగిలిపోతాయి. దుష్టులూ, దౌర్భాగ్యాలూ నాజీవితాన్ని మట్టిపాలుజేశారు. జీవితం పొడుగునా నాకీ దురవస్థలు తప్పనట్టేవుంది. నా జీవితం కేవలం దుఃఖ భాజనం.

చీకటిపడుతోంది. పనిపాటలు చూసుకోవాలి. చాలా చాలా విషయాలు రాయాలని వుంది; కాని, కాలాతీతమైంది.

తక్షణం చేయవలసిన పను లెన్నో వున్నాయి. క్షణం వృథా కావటానికి వీల్లేదు. అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూవుంటే సరదాగానే వుంటుంది. సరేకాని, నీవొకమారు మాయింటికి రాకూడదా? ఏం, మకార్ అలెగ్జివిచ్, తప్పక వస్తావు కదూ? మా యిల్లు యిప్పుడు ఇంతకుపూర్వంలాగా అటే దూరాన కూడా లేదామె. తీరిక చేసుకొని తప్పక వస్తావనే ఆశిస్తాను. నీ థెరెస్సా ఇప్పుడే కన్పించింది. జబ్బుపడి తీసు కుస్న దానిలావుంది. దాన్ని చూస్తే నా కెంతో విచార మేసింది. ఇరవై కోపెక్ లువుంటే యిచ్చాను.

అన్నట్టు మరచిపోయాను: నీ జీవితం ఎలా గడుస్తు న్నదో సవివరంగా రాస్తావా? ఆ కొంపలో నీతోపాటు జీవిస్తున్నవారి మనస్తత్వాలు ఎలాంటివి? వారితో నీవు ఎలా మేగుతున్నావు? మున్నగు విషయాలన్నీ పూసగుచ్చి నట్లు తెలియజేయాలిసుమా! పొద్దుపోకమునుపే, పెంద రాళే నిద్రపో. రాత్రి నీ గదిలో కొవ్వొత్తి అర్థరాత్రిదాకా వెలిగింది. సరే, సెలవు. ముప్పిరిగొన్న విచారం, అలసట, ఏకాంతత-ఇదీ ఇప్పటి నా పరిస్థితి. మనగతి యింతే. సెలవు.

నీ స్నేహితురాలు,

వర్వారా దొబ్రొసెల్లోవా.

ప్రియమైన వర్వారా అలెగ్జీయేనా,

అంతే సఖీ, అంతే. మన గతి యింతే. నన్ను పరిహాసం పట్టించావుగదూ. ఈ అభాగ్యుడితోనా నీ పరిహాసకాలు? నిజమే. అసలు తప్పు నాదే. తప్పంతా నాదే. వయసు మీరిన వ్యక్తి, తల నెరుస్తున్న వ్యక్తి మన్మధులతో సరసాలాడటమా! పిచ్చి కాకపోతే మరి ఏమిటిది? అయినా ఎవరూ కాదనలేని సత్యం ఒకటుంది: విను, సఖీ, విను - కొన్ని సమయాలలో మనిషి చాలా విచిత్రంగా వ్యవహరిస్తాడు. అర్థం పర్థంలేని చెత్త వాగుడే వాగుతాడు. ఈ వాగుడు పర్యవసానం ఏమవుతుందోకూడా ఆలోచించడు. ఏమాత్రం యోచించలేడు. నేను కోపగించుకోవటంలేదు, ప్రియతమా; నీకు వ్రాసిన లేఖలో వ్యక్తమైన నా మూర్ఖత్వాన్ని తలుచుకొని బాధ పడుతున్నాను. అంతే. ఈ రోజున సంతోషంగా రారాజునలె ఆఫీసు కెళ్ళాను. కుసుమించిన పుష్పంవలె నా హృదయం పరిమళించింది. నా హృదయానికి నేడొక సెలవుదినం; పర్వదినం. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆనంద డోలికలమధ్య తూగిపోయాను; తూలిపోయాను. ఆఫీసుకు వెళ్ళగానే, గబగబా కాగితాల కవిలకట్టలు తీశాను. కాని, తీరా వాటిని చూస్తున్నకొలదీ అంతా మామూలుగానే, చికాకుగానే పర్యవసించింది. సిరాబుడ్డీ, టేబుల్, కాగితాల కట్టలు, నేను - అన్నీ నిన్నటివే; మొన్నటివే; పాతవే.

ఎందులోనూ కొత్తదనం లేదు. అయితే ఇంతదనుక నే నెందుకు ఆనంద పర్వత మెక్కి కూర్చున్నట్టు భావించాను ? అందుకు హేతు వేమిటి? ఇవాళ సూర్యుడు కొత్తగా ఉదయించాడనా ? మబ్బులన్నీ మాయమై, ఆకాశం వినిర్మలమైనదనా ? అంతా కేవలం భ్రమ. పిచ్చి పిచ్చి ఆలోచనల పర్యవసానం యిలాగే వుంటుంది. బాధలూ, వ్యధలూ మర్చి పోవటంకోసం ఏవేవో కమ్మని కలలుకంటాం. తాత్కాలి కోపశమనం పొందుతాం. చివరకు మిగిలేది ఆశాభంగమే. ఈవేళ సాయంత్రం కాళ్ళీడ్చుకుంటూ యింటికి తిరిగివచ్చాను. ఎందువల్లనోగాని విపరీతమైన తలనొప్పి పట్టుకొంది. మనలను పట్టి పీడించే నొప్పులన్నింటికీ చెప్పుకోటానికి ఏదోఒక కారణం వుండకపోదు. బహుశా చలిగాలి నరాలను మెలేసివుండవచ్చు. వసంతం వచ్చిందని సంబరపడిన ఈ అవివేకి ఇవాళ ఉన్నిదుస్తులు ధరించకుండానే ఆఫీసుకెళ్ళాడు.

నీవు నన్ను పూర్తిగా అపార్థం చేసుకొన్నావని చెప్పక తప్పదు. నీ వసలు నా ఉద్దేశాలను ఏ మాత్రం గ్రహించ లేదనే చెప్పాలి. ఇది పితృవాత్సల్యం, కేవలం పితృవాత్సల్యం తప్ప మరొకటికాదు; నమ్ము, వర్వారా అలెగ్జెయేనా, నా మాట నమ్ము, తల్లి దండ్రులుగాని, ఆత్మీయులుగాని లేని నీకు నేను తండ్రి నయ్యాను. త్రికరణశుద్ధిగా, ఆత్మీయుడుగా చెప్పుతున్నాను. నన్ను శంకించకు. మనిద్దరికీ బంధుత్వం కలిసిందిగదా; దూరపు బంధుత్వమైతేమాత్రం అది బంధుత్వం కాకుండా పోతుందా ? నే నిప్పుడు నీకు దగ్గర బంధువుని; నీ సంరక్షకుణ్ణి; దీని నెవరు కా దంటారు ? సహాయం, సము

దాయింపుల కోసం ఎదురుచూసిన నీకు ఈ లోకంలో ద్రోహం, అవమానాలు మాత్రమే లభించాయి. పోతే, కవిత్వం సంగతా? ఇన్నేళ్లు వచ్చినతర్వాత నేను కవిత్వం రాయటమేమిటి? వింటే ఎవరైనా నవ్విపోతారు. ఎందుకూ పనికిరాని చెత్తే కవిత్వం. కవితావస్తువు బడిపిల్లల ఆటవస్తువు. కవిత్వం గురించి నా అభిప్రాయం యిదేనమ్మా.

సౌఖ్యం, శాంతి, ఇత్యాదుల ప్రసక్తి ఇప్పుడెందుకు చెప్పు? నా జీవితమంతా గూడుకట్టిన యిక్కట్టుల పుట్ట. ఇంతకు ముందుకన్నా నా జీవితం ఇప్పుడే కాస్త హాయిగా వుంది. అయినా ముసలితనంలో లేనిపోని మురిపాలు, ముచ్చటలు ఎందు కొచ్చినట్టు? కడుపుకి ఇంత తిండిదొరుకుతోంది; వంటినిండా బట్టలు, కాళ్ళకు చెప్పులు తొడుగుతున్నాను. ఇంతకన్నా నాకు యింకా ఏం కావాలి? ఆడంబరాల కోసం, విలాసాల కోసం పరితపించనేల? నే నేమన్నా రాజవంశంలో పుట్టానా? నా తండ్రి కనీసం జమీందారు కూడా కాదు. నేను సంపాదిస్తున్న దానికన్నా తక్కువ మొత్తంతోనే ఆయన కుటుంబాన్ని పోషించాడు. నేను చేతకాని దద్దమ్మనూ కాదు. ఏమాట కామాటే చెప్పాలి; నిజానికి నే నింతకు ముందున్న ఇల్లే బాగుండేదమ్మా. అదేమిటోగాని అక్కడ తృప్తిగా జీవించాను. ఇప్పు డుంటున్న గదికూడా మంచిదే ననుకో. కొన్ని విషయాలలో ఇక్కడే నాకు మరింత ఆహ్లాదం కల్గుతోంది; అయినా పాతగదిమీద యింకా బెంగ తీరలేదు. వయసుమీరిన నా జోటివాళ్ళు కొన్నింటికి దాసుల వ్వైపోవటం సహజం...పాత గది చిన్నదే. నీకు తెలుసుగా.

ఆ గోడలు...ఆ గోడలు మామూలీ గోడలు. గోడల కేమి వచ్చేగాని, పాత స్మృతులు తలుచుకుంటే, చింత కలుగుతుంది. ఇది చాలా విచిత్రం. మధురమైన స్మృతులు తలుపుకొచ్చి, చింతాగ్రస్థుణ్ణి కానటం విచిత్రం కాదూ ? అరుచికరమైన పాత విషయాలు యిప్పుడు రుచికరంగా తోస్తున్నాయి. అక్కడ మే మిద్దరం - నేనూ, ఆ ముసల్దీ - ఎంతో హాయిగా జీవించా మనిపిస్తోంది. ఆ పుణ్యాత్మురాలు చచ్చి యే లోకానవుందో ? ఆమెను గురించి ఆలోచించిన కొలదీ విచారం ఎక్కువవుతుంది. ఆమె యెంతో మంచిది. ఎన్నడూ అద్దె పెంచమని వేధించ లేదు. ఎంతో కలుపుగోట్టుతనం గల మనిషి. ఒకే కుటుంబంలోని వ్యక్తులవలె మసలుకొన్నాం. ఆమె చిట్టి మనుమరాలు - మాషాను ఇంతప్పటినుంచీ నేను యెరుగుదును - ఇప్పటికి పదమూడేళ్ళ పిల్ల అయివుండాలి. మాషా నట్టిగడుగ్గాయి. పొట్ట చెక్కలయ్యేటట్లు మా యిద్దరినీ నవ్వించేది; కవ్వించేది. మేము ముగ్గురం ఆ విధంగా జీవించాం. శీతాకాలంలో మే మిద్దరం కలిసి, ఒకే టేబుల్‌వద్ద కూర్చొని టీ సేవిస్తుండేవాళ్ళం. చిట్టిదాని నోరు కట్టివేసేందుకు, అది అల్లరిచేయకుండా అరికట్టేందుకు ముసల్ది కట్టుకథ లల్లి చెప్పుతుండేది. ఆ కథలు యెలాంటి వనుకొన్నావు ! పిల్లలే కాదు, తల్లులుకూడా చెవు లాలకించి వినేట్టు చేయగల్గినంత శక్తి ఆ కథల్లో వుంది. అవ్వ కథలు చెబుతుంటే, ఆ అల్లరిపిల్ల గులాబీపూవువంటి తన ముఖాన్ని చిన్నారి చిట్టి చేతులపై ఆన్చి, సగం నోరు తెరచి, మైమరచి వింటూ కూర్చొనేది. కథలో భీకరఘట్టాలు, భయోత్పాతక

విషయాలు చెప్పుతున్నప్పుడు ఆ పాప అవ్వను కావిలించుకొనేది. అలాంటి దృశ్యాలు చూసి ఆనందించనివాడుంటాడా? అలా కొవ్వొత్తి కాలిపోతూనే వుండేది. బయట గాలి వీస్తూనే వుండేది; మంచు కురుస్తూనే వుండేది. ఇంట్లో కథాకథనం సాగిపోతూనే వుండేది. అవునమ్మా, ఆ జీవితం యెంతో సంతృప్తికరమైనది. ఆ విధంగా ఇరవై సంవత్సరాలు కలిసిమెలసి జీవించాం. ఏమిటో, అసలు విషయం వదిలేసి, నేను ఎక్కడి కెక్కడికో పోతున్నాను. ఈ గొడవంతా నీకు విసుగు కల్గించవచ్చు. నీ మనస్సుకు విసుగు కలిగితే, నా మనస్సు చివుక్కుమంటుంది. చీకటి పడింది. థెరెస్సా ఒకటి చేయబోయి, మరొకటి చేస్తూ, తప్పటడుగులు వేస్తోంది. నాకు తలనొప్పిగా వుంది. మళ్ళీ యివాళ నన్ను పోటు ప్రారంభమైనది. తీవ్రమైన బాధకు లోనవుతున్నప్పుడు ఆలోచనలు ఆకుకు అందకుండా, పోకకు పొందకుండా, పరిపరి విధాల పరుగెడుతుంటాయి. ఇవాళ నా పరిస్థితి సరిగ్గా అలాగేవుంది.

నీ గదికి ఒకసారి నన్ను రమ్మనికదూ వ్రాశావు; నీ గదికి ఎలారానమ్మా? లోకులు ఏమనుకొని పోతారు? దొడ్డి గుమ్మం దాటి నీగదివైపుఒకడుగు వేస్తేచాలు, ఇకరకరకాలు కట్టుకథలు అల్లి, నీలాపనిందలు వేస్తారు; పాపపుమాటలు ఎన్నో ప్రచారం చేస్తారు. నా చిన్నారి దేవకన్యా, వద్దమ్మావద్దు. నీ గదికి నేను రానూవద్దు; లోకులు నీపై పలునిందలు మోపటానికి అవకాశం యివ్వనూవద్దు. ఆలోచిస్తే, మనిద్దరం వెస్టర్నలో కలుసుకోటమే ఉత్తమంగా తోస్తున్నది. ఇద్దరిక

ప్రమాదం వుండదు. నీకు వీలైతే రేపు అక్కడ మనిద్దరం తప్పకుండా కలుసుకొందాం. ఈ విధంగా ఉత్తరం రాస్తున్నం దుకు క్షమించు. రాసిన లేఖను మళ్లీ తిరిగి చదువుతోంటే, ఇది ఇంత అధ్వాన్నంగా వుందే అనిపిస్తోంది. నేను నిరక్షరాస్యుణ్ణి; ముసలివాణ్ణి, చిన్నప్పుడు కష్టపడి చదువుకోకుండా చెట్టులంటా, పుట్టలంటా తిరిగాను. ఇప్పుడు వగచి మాత్రం ఏమిలాభం? పోనీ, ఇప్పుడు అధ్యయనం ప్రారంభిద్దామన్నా, ఇన్నేళ్ళొచ్చిన ప్రిమ్మట, చదివితే మాత్రం మనస్సు కెక్కుతుందా? పట్టుతుందా? కళ్లకద్దినట్లు విషయాలను చిత్రించటం నాకు చేతకాదు. ఎవ రేమనుకొన్నా ఇది అక్షరాలా నిజం: కాస్త అతిశయోక్తులు జేర్చి చక్కగా రాద్దామని ప్రయత్నించానా, కొండనాలుకకు మందు వేస్తే వున్న నాలుక వూడిపోయిన చందమవుతుంది. ఇందాక కిటికీదగ్గర నిలబడ్డప్పుడు, నిన్ను నేను చూశాను. ఉంటా. సెలవు. భగవంతుడు నీకు మేలుచేయుగాక, సెలవమ్మా.

నీ ఆప్తమిత్రుడు,

మకార్ దెవూష్కిన్.

తాజాకలం: ఇక నేను దేనిని గురించీ, ఎవరిని గురించీ వ్యంగ్యోక్తిలో రాయబోను. నాకు బుద్ధి వచ్చింది. ఎవరు తీసుకున్న గుంటలో వాళ్లే పడతార్న సామెత గుర్తు

కొచ్చింది. ఇతరులను ఎద్దేవా చేయబోయి, నలుగురిలో నవ్వులపాలు కావటం నా కిష్టం లేదు.

ఏప్రిల్, 9

ప్రియమైన మకార్ అలెక్సెవిచ్,

లేనిపోని ఆలోచనలకు, ఆవేదనకూ నీవు లోనుగాకు. ఓ ప్రియమిత్రమా! నా శ్రేయోభిలాషీ! నిజంగా నేను నీ మనస్సుకు కష్టం కల్గించానా? నాకు తెలుసు. నేను వట్టి తెలివి తక్కువదాన్ని. ఆలోచనారహితంగా ఏవేవో రాసేసి వుంటాను. నేను రాసే ప్రతిమాటా ఒక ఈటై నీ మనస్సులో శూలంగా గుచ్చుకొంటుందని కలలోకూడా ఊహించలేదంటే నమ్ము. నిన్నేదో నేను ఎగతాళి పట్టిస్తున్నట్టు నీవు వూహించుకొని బాధపడుతున్నావు. నీ వయస్సును గురించిగానీ, నీ నడవడికను గురించిగానీ అవహేళన చేయాలన్న దృష్టి నాలో ఏకోశానా లేదు. నా మాటనమ్ము. కేవలం అనాలోచితంగా నేనా లేఖను వ్రాయటంవల్లనే ఈ తిప్పలు వచ్చాయి. అదీకాక, సిన్న అసలు నా మనస్సు బొత్తిగా బాగా లేదు. చికాకులో వున్నప్పుడు ఏమైనా చేయవచ్చు.

నిజం చెప్పాలంటే, నీవు నాతో పరిహాసమాడుతున్నట్లు నీ లేఖనుబట్టి వూహించాను. నీవు అంతగా నిరుత్సాహం, నిర్వేదం పొందావని తెలుసుకొని, నే నెంతో బాధపడ్డాను. నీవే నన్ను అనుమానిస్తే, ఇక ఈ ప్రపంచంలో నాకు దిక్కేమిటి చెప్పు? అనుమానించి అన్యాయం చేయకు. నేనంతి హృదయంలేనిదానినా? కృతఘ్నురాలినా? నీవు చేసిన సహాయాన్ని నే నెన్నటికీ మరచిపోను; మరువలేను. శత్రువుల బారినుంచి నన్ను కాపాడావు. ద్వేషబుద్ధితో వాళ్ళంతా నన్ను వెంటాడుతుంటే, నీవు దేవుడులాగా వచ్చి నన్ను రక్షించావు. దైవాన్ని నేను సదా ప్రార్థిస్తుంటాను. అసలు దేవుడనే వాడొకడు వుంటే, వాడు నా ప్రార్థనలు వింటే, నీవు పదికాలాలపాటు హాయిగా జీవించాలని వేడు కొంటున్నాను.

ఈవేళ నా స్థితి బొత్తిగా బాగా లేదు. నా దుస్థితిని చూసి ఫెడోరా ఆందోళన చెందుతోంది. దయచేసి ఒక మారు వచ్చి, చూసి వెళ్ళు. ఇందులో సిగ్గుపడవలసిన విషయం యేముంది, మకార్ అలెగ్జెవిచ్? లోకులు యేమనుకొంటే మన కేం? ఎవరో యేదో అనుకొనిపోతారని మనం దూరమైపోతామా యేమిటి? మనిద్దరం ఆప్తులం కదూ? సరే, సెలవు మకార్ అలెగ్జెవిచ్. నేను చెప్పవలసిందీ, చెప్పదల్చుకొందీ అంతా చెప్పేశాను. సుదీర్ఘమైన లేఖ వ్రాయగలిన ఓపికకూడా లేదు. మళ్ళీ నామీద కారాలు, మిరియాలు నూర కేం?

భవదీయ,

వర్వారా దొబ్రొస్యాలోవా.

ప్రియమైన పర్వారా అలెగ్జెమేనా,

ఏమిటి విషయం? ఎక్కడుందీ లోపం? నీ వెప్పుడూ యేదో ఒక తద్దినం తెచ్చిపెట్టుతూనే వుంటావుగదా! నా హృదయంలో ఆందోళన రేగించేపని యేదో ఒకటి చేస్తూనే వుంటావుగదా! జాగ్రత్తగా వుండమ్మా అని నేను నీకు యెన్నోసార్లు చెప్పాను. ప్రతీ ఉత్తరంలోను వ్రాస్తూనే వున్నాను గదా! బయటకు వెళ్ళితే తలకు గుమాలు చుట్టుకోమనీ, వాతావరణం బాగా లేనప్పుడు బయటకు వెళ్ళొద్దనీ, ప్రతి విషయంలోనూ వివేకంతో వ్యవహరించమనీ చిలుకకు చెప్పినట్లు చెప్పానే? అయినా నీవు నా మాట ఖాతరు చేయలేదు. అల్లరిచేసే ఆకతాయి పిల్లలాగా ప్రవర్తిస్తున్నావు; నాకు తెలుసు. నీ శరీరం గరికపరక కన్నా సున్నితమైనది. కాస్త చలిగాలి సోకితే చాలు, నీకు జలుబు చేస్తుంది. అందుకే నీవు మరింత జాగ్రత్తగా మసులుకోవాలి. ఆరోగ్యం పాడైపోయిన తర్వాత యేమనుకొంటే మాత్రం ఏం లాభం? ఆరోగ్యానికి హానికరమైన పని యేదీ చేయకు. నీ మిత్రులకు లేనిపోని మనోవేదన, హృదయాందోళన తెచ్చిపెట్టకమ్మా!

నా నిత్యజీవితాన్ని గురించీ, ఇనుగుపొరుగులను గురించీ తెలుసుకోవాలని కుతూహలపడుతున్నావా? సరే, ప్రియతమా! మహాసంతోషంతో నీకు అన్నీ తెలియజేస్తాను.

ఇంతకీ మొదట్లో ఏదో ఒకదానినిగురించి మొదలెట్టాలిగదా. మొదట యింటిముందు మేడ మెట్లనుగురించి విన్నవిస్తాను. ఈ మెట్లు చాలా అందంగా, హుందాగా, తేజోవంతంగా, పరిశుభ్రంగా, సువిశాలంగా వుంటాయి. పోతే, ఇంటి వెనుక వైపునగల మేడమెట్ల సంగతి ఇక చెప్పనేఅక్కర్లేదు. వాటిని తలుచుకొంటే వళ్ళు గగుర్పొడుస్తుంటుంది. గుండె దడదడ కొట్టుకొంటుంది. మెట్లెక్కుతూ పొరపాటున చేయి గోడపై పడిందా, చేతికి మట్టి, మురికి అంటుకొని తీరుతుంది. మేడ మెట్ల మలుపుల్లో పనికిరాని పెట్టెలు, విరిగిపోయిన కుర్చీలు, చెత్తా, చెదారం గుట్టలుపడి వుంటాయి. కిటికీలలో చాలా భాగం విరిగిపోయాయి; తలుపులు పగిలిపోయాయి. ఊడ్చిన పాచి, కోడిగుడ్ల డొప్పలు, చేపల వీపులపై రేకులు యిత్యాది సరుకుతో నింపిన తొట్టెలు "ఇందుగల వందు లేదనుచు సందేహం వలదు" అన్నట్లు సర్వత్రా ప్రత్యక్షమవుతాయి. ఇక ఆతొట్టెలలోనుంచి బయలుదేరే కంపు యింపు గురించి వేరే చెప్పాలా? భరింపశక్యంకాని కంపు ......... ఒక్క మాటలో చెప్పాలంటే, ఏమంత ఆనందదాయకమైనది కాదు.

ఇక గదులసంగతంటావా? అవి చక్కగా బారులు తీర్చి వున్నవని లోగడే చెప్పానుగా! సదుపాయాలకు కొదవ లేదు కాని, గాలికీ, వెలుతురికీ ఆ గదుల్లో చోటులేదు. దుర్వాసన అని ఖచ్చితంగా చెప్పటానికి వీల్లేదు కాని, వెగటు కల్గించే అదొకరకమైన వాసన ఘుమాళిస్తుంటుంది. మొదట్లో ఆ వాసనకు తట్టుకోటం కొంచం కష్టమే అనిపించినా, కొద్ది క్షణాలు గడిచిన తర్వాత ఆ వాసనకు నీవు

అలవాటు పడిపోతావు. అప్పుడు అంత యిబ్బందనిపించదు. అసలు యీ కొంపలో ప్రతి వస్తువు సువాసన లీనుతూనే వుంటుంది. చివరకు నా దుస్తులూ, నా శరీరమూ యేదో ఒక వాసన ప్రసరిస్తూనే వుంటాయి. ఈ భవంతిలో గోరెంకలు పట్టుమని పది నిమిషాలుకూడా మనలేవు. ఈ భవనంలోని ఒక గదిలో అద్దెకుంటున్న నాకోద్యోగి ఇప్పటికి ఎట్టా లేదన్నా కనీసం అయిదు గోరెంకలనైనా తెచ్చి, పంజరంలో పెట్టివుంటాడు. అవన్నీకూడా టపటపా రాలి పోయాయి. ఈ ఇంట్లో గాలికి అవి తట్టుకోలేకపోతున్నాయి. ఉదయంపూట యిగిరే చేపలు, మరిగే మాంసం వాసన గుప్పుమంటుంది. ఇక సాయంత్రంపూట సంగతి చెప్పనే అక్కర్లేదు. వంటిల్లు కళాకాంతులతో వెలుగొందుతుంటుంది. నాగదికి ప్రక్కనే మరుగుదొడ్డి వున్నదేమో, ఆ కంపు భరించటం కొంచెం కష్టంగానే వుంటుంది. అయితే కొన్ని రోజులపాటు దానిని భరించుకోగలిగామా, ఇక ప్రమాదం లేదు. దానికి అలవాటుపడిపోవచ్చు. అలవాటు పడక చస్తామా మరి ?

తెల తెలవారుతూనే ఇల్లంతా కోలాహలంతో, రణగొణధ్వనితో మార్మోగుతుంటుంది. తెల్లవారకముందే యింటిల్లపాదీ నిద్రలేస్తారు. హడావిడిగా, చప్పుడు చేసుకుంటూ ఇటూ అటూ తిరుగుతారు. కొందరు పెందరాళే లేచి పనుల్లోకి పోతారు. పనిపాటలు లేనివారుకూడా పెందరాళే లేస్తారు. మేమంతా మొట్టమొదట టీ త్రాగుతాం. అందరికీ సరిపడ్డన్ని పొయ్యిలు లేవుకనుక 'క్యూ'లు తప్పవు. ఒకవేళ

నకడైనా వెనుకవచ్చి, ముందువచ్చినవారికన్నా ముందు టీ కాచుకోవాలని ప్రయత్నించాడా, ఇక ఆవేళ రామ రావణయుద్ధం తప్పదన్నమాటే. మొదట్లో నాకూ ఈ అవ మానం జరిగింది. అయినా అది ఏమంత పెద్ద అవమానం కాదనుకో. ఇక్కడి ఆచారమేమిటో తెలియక, ఆచారాన్ని అతిక్రమించాను. కనుక క్షమించి, నన్ను వదలివేశారు. ఆ ఘర్షణతోనే అందరితోనూ నాకు పరిచయభాగ్యం లభిం చింది. తొలుత నాకోద్యోగితో పరిచయం ఏర్పడింది. ఎందు చేతనోగానే నేనంటే అతనికి పూర్తినమ్మకం కుదిరింది. అతని తండ్రినిగురించీ, తల్లినిగురించీ, చెల్లినిగురించీ (తులా లోని ఒక ఉద్యోగిని ఆమె పెళ్ళాడిందిలే) సకలవిషయాలూ దాపరికంలేకుండా చెప్పేశాడు. క్రోన్‌స్టాక్ పట్టణంగురించి ఎన్నో విశేషాలు ఏకరువు పెట్టాడు. అన్నివిధాలా నన్ను ఆదు కొంటానని హామీ యిచ్చాడు. అక్కడి కక్కడే టీకి రమ్మని నన్ను ఆహ్వానించాడు. తీరా నేను అతని గదికి వెళ్లి చూస్తినిగదా, పేకాట మహాజోరుగా సాగుతోంది. టీ సేవించినపిమ్మట, పేకాటలో చేరమని నన్ను వారు బలవంతం చేశారు. నాపై గౌరవంకొద్దీ అలా అన్నారా? లేక అవ హేళన దృష్టితో నన్ను బలవంతంచేశారా? అన్న విషయం ఇంతవరకూ తేలనేలేదు. రాత్రంతా వారు పేకాటలో మునిగి తేలుతున్నారు. పొద్దుపొడిచిన తర్వాతకూడా ఆటలోనుంచి వారు లేవనేలేదు. పేకముక్కలు కలుపుతున్నారు. గచ్చు నేలపై సుద్దముక్కతో అంకెలు వేస్తున్నారు; చెరిపేస్తున్నారు. ఆ గదంతా పొగాకుకంపు ఆవహించింది. జూదం ఆడటం

నా యింటా వంటా లేదంటే, చాలించవయ్యా వేదాంతం అంటూ వారు ఎక్కిరించారు. ఆ తరువాత ఎవరూ నాతో మాట్లాడనేలేదు. నిజం చెప్పాలంటే, "మీరు మాట్లాడితే ఎంత, మాట్లాడకపోతే ఎంత, కేరే జాట్" అని మనస్సులో అనుకొన్నాను. మళ్ళీ ఆ గది గడప తొక్కరాదని నిశ్చయించుకొన్నాను. జూదరులు. అంతా జూదగాళ్ళే. ఆ రచయిత వున్నాడు చూశావ్, అతనూ తన గదిలో టీ పార్టీలవి ఏర్పాటు చేస్తూవుంటాడు. కాని, అతనుమాత్రం వట్టి అమాయకుడు; గౌరవనీయుడు; కాని సుతిమెత్తని మనస్సు గలవాడు. అందుకే అతని గదిలో జరిగే అల్పాహారవిందులు హుందాగా, ఉన్నతస్థాయిలో వుంటాయి.

ఇంతకీ మాయింటి యజమానురాలిని గురించి చెప్పనే లేదు. వరేంకా, ఏమని చెప్పను? ఆమె కేవలం విషప్పురుగు; రాకాసి. థెరెస్సాను నీవు చూశావుగదా? అది ఎంతగా బక్కచిక్కి పోయింది! థెరెస్సా రక్తమాంసాదులను, మూలిగను మా యింటి యజమానురాలు పీల్చేసిందంటేనమ్ము. ఈ కొంపకంతటికీ ఇద్దరే నౌకర్లు - థెరెస్సా, ఫాల్డోనీ. బహుశా ఫాల్డోనీకి మారుపేరు ఏదోవుందనుకొంటాను. ఏమైనా ఫాల్డోనీ అని పిలిస్తేనే వాడు పలుకుతాడు. అందుకే అంతా వాడిని ఫాల్డోనీ అనే పిలుస్తారు. మోదుగ పువ్వులు కప్పినట్లు వాడిజుట్టు ఎర్రగా వుంటుంది. జుట్టునంతా కలిపికట్టి, వెనక ముడేస్తాడు. చట్టిముక్కు, వాడూను. ఎప్పుడూ థెరస్సాతో పోట్లాడుతూనే వుంటాడు. ముష్టియుద్ధానికి సన్నద్ధమవుతున్నారా అనిపిస్తుంది. మొత్తం

మీాద ఇక్కడి జీవితం ఏమంత ఆహ్లాదకరంగా లేదనే చెప్పాలి. ఇంటిల్లిపాదీ మేనువాల్చి, కన్నుమూాయటమంటూ జరగదు. రేయింబవళ్లు ఎప్పుడు చూసినా ఎవరో ఒకరు మేల్కొనే వుంటారు. ఏదో ఒక పని చేస్తూనే వుంటారు. ముఖ్యంగా రణగొణధ్వని తప్పదు. పేకాటలు అంతూపంతూ లేకుండా సాగుతుంటాయి. ఇంకా అనేక విషయాలు, విశేషాలు వున్నాయి. వాటన్నిటిని గురించి నీకు చెప్పటమంటేనే నాకు సిగ్గేస్తోంది. అయినా అన్నిటికీ అలవాటు పడిపోయానులే. అప్పుడప్పుడు నాకు అనిపిస్తుంటుంది: సంసారులు చేపల సంతనుబోలిన ఈ కొంపలో ఎలా నివసించ గల్గుతున్నారా అని ఆశ్చర్యపోతుంటాను.

హాలుకు ఆవల వైపున, మూలనున్న గదిలో ఒక నిరుపేదకుటుంబం నివసిస్తున్నది. వారు నివసిస్తున్న భాగం ఇతర గదులకు కాస్త పెదగావుంది. ఏ గొడవా లేకుండా గుట్టుగా బ్రతికే కుటుంబం అది. వారు యితరులజోలి పట్టించుకోరు. అసలు ఆ భాగంలో ఒక కుటుంబం నివసిస్తున్నదన్న విషయమే గుర్తు రానంత గుట్టుగా వారు తమ బ్రతుకు తాము బ్రతుకుతున్నారు. భర్త, భార్య, ముగ్గురు పిల్లలు. మెరశీ అయిదుగురు సభ్యులు. భర్తపేరు గోర్ష్కోవ్. ఉద్యోగంనుంచి బర్తరఫ్ చేయబడిన గుమాస్తా. ఉద్యోగం ఊడిపోయి ఏడేళ్ళయింది. జుట్టు నెరసే వయస్సు వచ్చినట్టున్నది. మురికితో చివికి, చినిగిపోయిన దుస్తులు ధరిస్తాడు. అతనిని చూస్తుంటేనే బాధ కలుగుతుంది. అతను తొడుగుతున్న కోటు నా కోటుకన్నా యెన్నో రెట్లు అసహ్యంగా వుంది (అప్పుడప్పుడూ మే మిద్దరం

వరండాలో తటస్థపడుతుంటాం). అతని కాళ్లూ, చేతులూ, చివరకు తలకూడా వణుకుతూ వుంటాయి. ఆ వణుకుడు జబ్బు యెలా దాపురించిందో ఆ భగవంతుడికే తెలియాలి. అతను నట్టి పిరికివంద. చెప్పలేనంత సిగ్గూ, బిడియమూ. అందుకే అందర్నుంచి తప్పించుకు తిరుగుతూ దూరదూరంగా వుంటాడు. అప్పుడప్పుడూ నేనూ సిగ్గుపడుతుంటా ననుకో. అయినా అతనికంటే నేనే కొన్ని వేలరెట్లు మెరుగు. అతనికి ముగ్గురు పిల్లలని చెప్పానుకదూ? పెద్దవాడు తండ్రిలాగానే పొట్టిగా, బక్కపల్చగా, వూసురోమంటూ వుంటాడు. అతని భార్య ఒకప్పుడు మంచి అందగత్తె అనే చెప్పాలి. ఆమెలో అందం యిప్పటికీ పూర్తిగా నశించిపోలేదు. కాని, ఆమె మసిగుడ్డ మెరుగనిపించే చీరెలు కట్టుకొంటుంది; లేదా వంటికి చుట్టుకొంటుంది. పాపం. అభాగ్యురాలు. వాళ్ళు అద్దె బాకీ పడినట్టున్నారు. వాళ్లంటే యింటి యజమానురాలికి యీమాత్రం దయాదాక్షిణ్యాం లేదనే చెప్పొచ్చు, ఏమైనా ఆ కుటుంబాన్ని చూస్తుంటే, నిజంగా యెంతటి కఠినాత్ముని మనస్సయినా కరిగి నీరై పోతుంది. జాలేస్తుంది. వాళ్ళ గదిలో నుంచి చీమ చిటుక్కుమన్నంత చప్పుడుకూడా ఎప్పుడూ విన రాదంటే నమ్ము. అసలు అక్కడ యెవరూ నివసించటంలేదా అన్నంత ప్రశాంతంగా వుంటుంది. చివరకు పిల్లల ఏడుపు కూడా యెప్పుడూ విన్పించదు. వాళ్ళ పిల్లలు మారాం చేయటంగానీ, ఆడుకోటంగానీ నేనెన్నడూ చూడలేదు. ఇది ఏమంత మంచి శకునం కాదు! ఒకనాడు సాయంత్రం ఇంటి కొచ్చేసరికి ఇల్లంతా మాటుమణిగి వుంది. ఏమిటీ వింత

అనుకొన్నాను, గోర్‌కోవ్ గది ప్రక్కగా నడిచి వెళ్ళుతుంటే, గదిలో ఎవరో వెక్కి, వెక్కి ఏడుస్తున్న ధ్వని విన్పించింది. ఎవరో సముదాయిస్తున్నారు. మళ్ళీ వెక్కి, వెక్కి ఏడ్పు విన్పించింది. పాపం, బిగ్గరగా ఏడ్వటానికి కూడా వాళ్ళు నోచుకోలేదు. బిగ్గరగా ఏడ్చే ఓపికకూడా లేదేమో! వాళ్ళ బ్రతుకు ఎంత నికృష్టమైనది! తలుచుకొంటే గుండె జలదరిస్తుంది. ఆ వేళ రాత్రంతా నాకు నిద్ర పట్టనేలేదు. ఆ కుటుంబం దుస్థితినిగురించే అదే పనిగా ఆలోచించాను.

అమూల్యమైన నా చిన్నారి వర్యారీ, మరి ఇక ఈ లేఖ చాలించమంటావా? సెలవు తీసుకోమంటావా? నాకు చాతనయినంత చక్కగా అన్ని విషయాలు వర్ణించాను. రోజల్లా నిన్నుగురించే, కేవలం నిన్నుగురించే ఆలోచిస్తున్నాను. నిజంగా నిన్నుగురించి నేను చెందుతున్న ఆందోళన ఇంతా అంతా కాదు. వసంతాగమనంతోపాటు ఈదురు గాలి, వర్షాలు, మంచు రేణువులు అన్నీ వచ్చి పడుతున్నాయి. ఇవ్వన్నీ కలిసి మన ప్రాణాలు కొరుక్కుతింటున్నాయి. వరెంకా, నీకు ఒక మంచికోటు అవసరమన్న సంగతి గుర్తించాను. ఈ పాడు వాతావరణంనుంచి భగవంతుడు నిన్నూ నన్నూ రక్షించుగాక.

నా హృదయాధిదేవతా, ఈ విధంగా రాస్తున్నందుకు కోపగించకే. నా వ్రాతకు నిర్దిష్టమైన శైలి అంటూ లేదు. ఏమి చేస్తాను? అది నా దౌర్భాగ్యం. శైలి కావాలంటేమాత్రం యిప్పుడొస్తుందా, చెప్పు. నిన్నేదో కాస్త ఉత్సాహపర్చాలని ఉవ్విళ్లూరుతూ, మనస్సుకు తోచిన

మాటలు, మనస్సుకు నచ్చిన రీతిని రాస్తున్నాను. భాగ్య వంతుల బిడ్డల మాదిరిగా నేనూ పెద్ద పెద్ద బళ్లలో చదివి వుంటే, బహు చక్కని విషయాలు బహు రమ్యంగా వ్రాయ గలిగేవాణ్ణే కాని, నేను చదివిన చదువు కేవలం వర్షాకాలపు చదువు. అంతే. దమ్మిడీ విలువకూడా చేయదు.

నీ ఆప్త మిత్రుడు,

మకార్ దెవ్వూష్కిన్.

ఏప్రిల్, 25

ప్రియమైన మకార్ అలెగ్జీవిచ్,

ఈవేళ మా మేనత్త కూతురు షాషా కన్పించింది. దారుణం. ఆమె జీవితం బుగ్గిపాలు కాబోతున్నది. మరి కొన్ని పుకార్లు నా చెవినిపడ్డాయి. అన్నాఫ్యోడొరోవ్నా నన్ను గురించి ఆరాలు తీస్తోందట. ఆటే చూస్తే, ఆ ముసిల్ది చచ్చిన తర్వాతకూడా, దెయ్యమై నన్ను పట్టుకుపీడించేట ట్టుంది. నామానాన నన్ను బ్రతకనివ్వదలుచుకోలే దల్లే వుంది. అది నన్ను క్షమిస్తుందట. జరిగించేదో జరిగిపోయింది,

పాత విషయాలన్నీ మరచిపోయి, మళ్ళీ కలిసిజీవిద్దాం, మా యింటికేరా అని ఆ ముసల్ది నాదగ్గరకొచ్చి ప్రతిపాదిస్తుందట. నీవేమో ఏవిధంగా చూసినా నాకు కావలసినవాడివి కాదట. ఆమేమో నా దగ్గర బంధువట. కనుక మా కుటుంబ వ్యవహారాలలో తలదూర్చే హక్కుగానీ, అధికారంగానీ నీకు లేనే లేదట.

నీవు చేస్తున్న సహాయంపైనా, ఇస్తున్న చేయూతపైనా ఆధారపడి నేను జీవించటం అవమానకర విషయమట. లోగడ ఆమె నన్ను పువ్వుల్లో పెట్టి పెంచి, పోషించి, పెద్ద దానిని చేసిందట. ఆకలిబాధతో అలమటించి చచ్చిపోకుండా నా తల్లినీ, నన్నూ కాపాడిందట. అయినా నేను అదంతా పూర్తిగా మరచిపోయి ప్రవర్తిస్తున్నానట. నా తల్లినీ, నన్నూ రెండున్న రేళ్లు పోషించటానికి ఆమెఎంతో డబ్బు తగలేసిందట. నేను ఆమెకు ఎంతో ఋణపడివున్నప్పటికీ, ఆ ఋణాన్నంతా విస్మరించి, నన్ను మన్నిస్తుందట. ఏ దిక్కూలేని మా అమ్మను ఆ ముసల్ది కరుణించి వదలలేదు. వాళ్లు నా విషయంలో తల పెట్టిన అన్యాయమే మా అమ్మ ఎరిగివుంటే ఎంత బాధపడి వుండేదో కదా! కాని, భగవంతుడు ఇదంతా పైనుంచి పరికిస్తూనే వున్నాడులే. నా జీవితం ఇలా కష్టాలపాలు కావటానికి కారణం నేనేనని అన్నాఫ్యోడొరోవ్నా అంటున్నది. ఆమేమో నాకు బ్రతుకుతెరువు చూపించినా నేనేమో దానిని కాలదన్నానట. అయినా నేను గౌరవం నిలుపుకో లేకపోయానట, అది తన తప్పుకాదట. ఆరి భగవంతుడా, ఇందులో తప్పెవరిదో నీవే తేల్చు. బైకోవ్ సరిగానే

ప్రవర్తించాడట......ఆడదానిని పెళ్లాడటానికి ఏ మగాడూ ఒప్పుకోడని ఆ ముసల్ది ఇప్పటికీ వాదిస్తున్నది. బైకోవ్‌ను సమర్థిస్తున్నది. ఈ గొడవంతా నీకు చెప్పుకోని ఏమి లాభం? మకార్ అలెగ్జెవిచ్, ఇలాంటి ఘోరన్యాయాలను భరించటం, సహించటం, వహించటం చాలా కష్టం. నా గతి ఏమికానున్నదో తెలియదు. నే నిక్కడ కూర్చొని, హడలిపోతూ, కుమిలిపోతూ దుఃఖిస్తున్నాను. ఈ జాబు రాయటానికి రెండు గంటలు పట్టిందంటే నమ్ము. నా విషయంలో తాను చేసిన అన్యాయాన్ని ఆమె గుర్తిస్తుందనీ, కనీసం పశ్చాత్తాప పడుతుందనీ ఇప్పటిదాకా ఆశిస్తూ వచ్చాను. ఇదిగో, ఈ జాబు చదివి, నీవు యిసుమంత ఆందోళన చెందినా, మనోవ్యధ పొందినా నేను సహించలేను, తెలిసిందా. ఈ లోకంలో నా మేలునుకోరే వ్యక్తివి నీ వొక్కడివే. నీ అండదండలతోనే ఈ అభాగ్యజీవి జీవించగల్గుతోంది. ఫెడోరా మాటలు అంతగా పట్టించుకోకు. గోరంతదానిని కొండంత చేసి చెప్పుతుంటుంది. నేను క్షేమంగానే వున్నాను. ఓల్కోవో చర్చికి ప్రార్థన కెళ్ళినప్పుడు కాస్త చల్లగాలి తగిలి, కొద్దిగా జలుబుచేసింది, అంతే. సరేగాని నావెంట ఎందుకు రాలేదో చెప్పు? ఎంతో బ్రతిమాలుకొన్నానే; అయినా విన్నావుకాదు. అమ్మా, సమాధినుంచి నీవు బయటకు రాగల్గితే, వారు నాకు చేసిన ఘోరన్యాయమేమిటో నీవు తెలుసుకోగల్గుతావ్!

—వి. డి.

మే, 20

*వరెంకా, నా చిన్నారి పయ్యారీ,*

నా హృదయాధిదేవతకు నేను ద్రాక్షపళ్ళు పంపుకొంటున్నాను. రోగులకు ద్రాక్ష చాలా మంచిది. దాహం తీర్చుకోటానికి ద్రాక్షపళ్ళు బాగా పనికొస్తాయని డాక్టర్లు కూడా సిఫారసు చేస్తుంటారు. అందుకే వాటిని నీకు పంపించాను; కనీసం దాహమన్నా తీరుతుందేమోనని. నిన్న నీవు కోరినట్లు, ఆల్‌బ్రకా కొని పంపించాను. ఏమమ్మా, నీకు అన్నం సహిస్తోందా? ఆకలి వేస్తోందా? అన్నింటిలోకీ ముఖ్యమైనది ఇదేకదా! దేవుని దయవల్ల గండం గడిచింది. కష్టాల అధ్యాయం ముగియబోతోంది, కనుక భగవంతునికి వేయి నమస్కారాలు పెట్టుకొందాం. ఇక పుస్తకాల సంగతంటావా, నే నింకా వాటిని సంపాదించలేకపోయాను. ఏ షాపులోకి వెళ్ళినా, ఇది చాలా మంచి పుస్తకమండీ, ఈ రచయిత చాలా గొప్పవాడు; చాలా బాగా రాశాడు అంటుంటారు. అంతా అదేమాట. నే నింకా ఆ పుస్తకం చదవలేదు. ఎవరినోట విన్నా ఆ పుస్తకాన్నిగురించిన ప్రశంసలే! చదువుకోటానికి ఒకమారు యిస్తాలే అని నా మిత్రు డొకడు వాగ్దానం చేశాడు. మరి నీవు ఆ పుస్తకం చదువుతావా? ఊహాప్రపంచంలో ఓలలాడించే పుస్తకాలుమాత్రమే నాకు నచ్చుతాయి. ఈ పుస్తకం నీకు బొత్తిగా నచ్చకపోవచ్చు. నీ అభిరుచి ఎలాంటిదో నాకు పూర్తిగా తెలుసు. కవితాఛాయలుగల వచన

రచనలో నీకు నచ్చుతాయి. నిట్టూర్పులూ, ప్రేమ తొణికిస లాడే రచనలే నీకు కావాలి. భయపడకు. తప్పకుండా అలాంటి పుస్తకాలే నీకు పంపిస్తాను.

ఇక నా సంగతా, క్షేమంగానే వున్నాను. దయ యుంచి, నన్ను గురించి ఆందోళన చెందకు. ఫెడోరా చెప్పే మాటలు లక్ష్యపెట్టకు. అది ముసల్ది అవుతున్నకొలదీ ఇక్కడ మాటలు అక్కడకు, అక్కడి విషయాలు ఇక్కడకు చేరవేసే జబ్బు ఎక్కువవుతోంది. ఈ మాట నేను అన్నానని చెప్పు. నేను కొత్తసూటును అమ్మివేయలేదు. అయినా దానిని అమ్ముకోవలసిన అగత్యం నాకేంపట్టింది? దానినెందుకు అమ్ముకోవాలి? ఈ నెలనుంచి నా జీతం పెంచబోతున్నారని తెలిసింది. కనీసం నల్భై రూబుళ్ళయినా అదనంగా చేతికి రావచ్చు. నీకు తెలుసుగా, ఫెడోరా గోరంతను కొండంత చేస్తుందన్న సంగతి. మన భవిష్యత్తు మహోజ్వలంగా వుండ బోతున్నది. ఇంతకీ కావలసింది నీవు త్వరగా కోలుకోవటమే. నేను చిక్కిపోయానని నీకెవరు చెప్పారు? ఇదికూడా గాలి వార్తే. కేవలం నీలాపనింద. నిందాప్రచారం. నేను ఉండ వలసిన, ఉండగల్గినంత ఆరోగ్యంగా వున్నాను. కొంతవరకు లావెక్కానుకూడా. ఊరిపోతున్న నా శరీరాన్ని చూస్తుంటె నాకే సిగ్గేస్తోంది. ఒక్కమాటలో చెప్పాలంటే, నేను మహా రాజాలాగా బ్రతుకుతున్నాను. నీవుకూడా త్వరగా కోలుకో గల్గితే! సరే, ప్రియతమా, సెలవు. నీ చిన్నారి చిట్టి వేళ్లను ఒక దాని తర్వాత మరొక దానిని ముద్దెట్టుకొంటూ.

నీ కలకాల మిత్రుడు,

మకార్ దెవూష్కిన్.

తాజాకలం: అదేమిటి ప్రియా! నీవు అలా రాశావు? మంచీ చెడూ మరచిపోయి వ్రాసేయటమేనా? అన్నప్పుడల్లా నీ గదికి రావటం ఎలా సాధ్యం? అలాంటిపని నే నెలా చేయగలను? చీకట్లో తప్పితే నీ గడపలో కాలు పెట్టలేను. ఆ విషయం నీకు తెలుసు. లోకులు ఏమనుకొంటారోనని నే నెప్పుడూ భయపడుతూనే వుంటాను. జబ్బుపడి, నీవు మంచంలో పడివున్నప్పుడు, ఆ మంచంవదలి బయటకు పోనటం అంటే నా కెంతో బాధగా వుండేది. లోకుల సూటిపోటు మాటలు భరించలేక అక్కడినుంచి వచ్చేయక తప్పేదికాదు. ఇప్పటికే మనలను గురించి లోకులు పలురకాలుగా కథలల్లి చెప్పుకొంటున్నారు. థెరెస్సా అంటే నాకు పూర్తిగా నమ్మకంవుంది. చచ్చినా అది మనలను గురించి ఇతరులముందు నోరువిప్పి చెప్పదు. మన విషయాలన్నీ లోకానికి తెలిస్తే, ఎంత చిత్రంగా. విచిత్రంగా చెప్పుకొంటారో ఎన్నడైనా వూహించావా? కాస్త ఓపికపట్టు. నీవు పూర్తిగా కోలుకొనేదాకా ఓపికపట్టు. అప్పుడు మన జీవితాలను స్వర్గతుల్యంగా మార్చుకొందాం.

ప్రియమైన గౌరవనీయ మకార్ అలెగ్జివిచ్,

నీవు ఒనరించిన సహాయానికీ, నీవు చూపిన అనురాగానికీ ప్రతిఫలంగా నీకు బాగా నచ్చేపని యేదైనా, నీ మనస్సుకు ఆహ్లాదం చేకూర్చేపని యేదైనా చేదామని ఎన్నాళ్ళుగానో అనుకొంటున్నాను. నా పెట్టెలోని పాత కాగితాలన్నీ కలియవెతకగా చివరకు నా ఆత్మకథ బయట పడింది. దానిని నీకు పంపిస్తున్నాను. నేను బాగా బ్రతికిన రోజుల్లో యీ ఆత్మకథ రచనను ప్రారంభించాను. అటు తర్వాత కూడా అడపా తడపా ఆ రచనను కొనసాగించాను. నా గత చరిత్రనూ, నా తల్లి చరిత్రనూ తెలుసుకోవాలని నీవు యెంతో కాలంగా కుతూహలపడుతున్నావు. అది నాకు తెలుసు. పొక్రొవ్‌స్కీని గురించీ, అన్నా ఫ్యోడొరోవ్‌నాతో కలిసివున్నప్పటి నా జీవితం గురించీ తెలుసుకోవాలని నీవు ఆతురత చెందుతున్నావు. అసలు యీ ఆత్మకథను ఎందుకు ప్రారంభించానో ఆ భగవంతునికే తెలియాలి. తీరిక దొరికి నప్పుడల్లా యేదో గిలుకుతుండేదాన్ని. నా గతానికి సంబంధించిన వివిధ దృశ్యాలు ఇందులో వున్నాయి. చదివితే నీకు ఆహ్లాదమే గొల్పవచ్చు. నా మట్టుకు నాకు, దీనిని తిర గేస్తే విచారమే కలుగుతుంది. సెలవు, మకార్ అలెగ్జివిచ్. చాలా అలసిపోయి వున్నాను. అందులో ఏకాంతజీవితం. రాత్రి నిద్రకూడా సరిగా పట్టలేదు. జబ్బుపడిన తర్వాత తిరిగి ఆరోగ్యాన్ని కూడదీసుకొనే కాలంలో ఎంత విసుగు జనిస్తుంది!

— వి. డి.

# 1

మా తండ్రి చనిపోయిననాటికి నాకు పధ్నాలుగేళ్ళ వయస్సు. నా చిన్నతన మంతా హాయిగా, సంతోషంగా, ఎట్టి చీకూ చింతా లేకుండా గడచిపోయింది. గుబర్నియాలోని ఒకానొక రాకుమారుని ఎస్టేటు మానేజరుగా మా నాన్న పని చేస్తుండేవాడు. ఇక్కడకు చాలా చాలా దూరానగల, ఆ రాకుమారునికి చెందిన ఒక కుగ్రామంలో మేము హాయిగా ఏ గొడవ లేకుండా జీవిస్తుండేవాళ్లం. చిన్నప్పటినుంచి నేను వట్టి అల్లరి పిల్లనే. క్షణంసేపు నాకు కాలు నిలిచేదికాదు. మనసు ఉరకలు పెట్టేది. తోటలలోను, పొలాలలోను, పొలాల ప్రక్కనేగల చిట్టడవిలోను పడి ఆకతాయి లాగా తిరుగుతుండేదాన్ని. ఎస్టేట్ వ్యవహారలలోపడి నాన్నగారు మునిగి తేలుతుండేవారు. అమ్మేమో ఇంటి గొడవల్లో పడిపోయి, నా విషయం అసలు పట్టించుకొనేదేకాదు. పట్టించుకొనేందుకు ఆమెకు తీరికా లేదు. నాకు చదువులు నేర్పేందుకు, విద్యాబుద్ధులు గరిపేందుకు ఎవరూ లేకపోయారు. అదీ ఒకందుకు మంచి దే లే అనుకొన్నాను. పగలల్లా ఇష్టమొచ్చినట్లు తిరగటం కన్నా పిల్లలకు కావలసిం దేముంది? ఉదయానే లేచి చెరువు

వద్దకో, తోటకో, పొలాల్లోకో, కల్లాలవద్దకో పరుగెత్తే దాన్ని. ఎండ మండిపోతున్నా లక్ష్యపెట్టేదాన్ని కాను. లేదా ఇంటినుంచి చాలా దూరంగా పరుగెత్తి, చిట్టడవిలో ముళ్ళ పొదలగుండా దూసుకుపోతూంటే మొఖమూ, చేతులూ చీరుకుపోతున్నా, గౌను చిరిగి పోతున్నా నాకు లెక్క వుండేది కాదు. మహా అయితే యింటికెళ్ళిన తర్వాత అమ్మా, నాన్నా నాలుగు కేకలు వేస్తారు. అంతేగా. అదే ధీమాతో వ్యవహరించేదాన్ని.

జీవిత మంతా ఆ వూళ్ళోనే గడిపేస్తే ఎంత బాగుం డును అనుకొనే దాన్ని. కాని, నే నొకటి తలిస్తే దైవం వేరొక విధంగా శాసించాడు. బ్రహ్మరాత తప్పించటం ఎవరి శక్యం: అప్పటి కింకా నేను చిన్న దాన్నే. పన్నెం డేళ్ళయినా నిండాయో లేదో. నేను ఆ వయస్సులో వుండగా మా కుటుంబం పీటర్స్‌బర్గుకు మకాం మార్చవలసి వచ్చింది. పుట్టి పెరిగిన ఊరు వదలిపెట్టి, పరాయి చోటకు వెళ్ళటమంటే ఎంత బాధో నాకు అప్పుడు తెలిసి వచ్చింది. ప్రయాణ సన్నాహాలు పూర్తయ్యాయి. మా నాన్న మెడను కావిలించుకొని వెక్కి వెక్కి దుఃఖించాను. కనీసం మరికొన్ని రోజులపాటైనా ఆవూళ్ళోనే ఉండిపోదా మని పట్టు బట్టాను. మా నాన్నకు కోపం వచ్చింది. నన్ను కసిరాడు. అమ్మ కూడా కంటతడి పెట్టుకొంది. "ఏమి చేస్తాం తల్లీ, నాన్న వ్యవహారాల మూలంగా మనం అక్క డకు వెళ్ళక తప్పదు" అంటూ అమ్మ నాకు నచ్చజెప్పింది. మా నాన్న మానేజరుగా పనిచేస్తున్న ఎస్టేటు యజమాని

చనిపోయాడు. ఆయన వారసులు మా నాన్నను ఆ ఉద్యోగంనుంచి బర్తరఫు చేశారు. అందుకే మాకీ తిప్పలు వచ్చాయి. పీటర్సుబర్గులోని కొందరు వ్యక్తులు చేస్తున్న వ్యాపారంలో మా నాన్నకు వాటాలున్నాయి. పీటర్సుబర్గులో మకాం పెట్టితే ఆర్థిక పరిస్థితులు కొంత చక్కబడవచ్చునన్న ఆశతో ఆ వూరు వదెలి, బయలు దేరాం. ఈ విషయం ఉత్తరోత్తరా అమ్మద్వారా తెలుసుకొన్నాను. పీటర్సుబర్గు వచ్చి, పీటర్సుబర్గు స్టారానాలో వొక అద్దె యింట్లో నివాసం ఏర్పరచుకొన్నాం. మా నాన్న చనిపోయేదాకా ఆ యింట్లోనే వున్నాం.

కొత్తచోట కొత్త జీవితానికి అలవాటు పడటం ఎంత కష్టం! ఆ వసంతకాలంలో ఈ పట్టణంలో మేము అడుగు పెట్టాం. పుట్టి పెరిగిన ఊరును పంటల తరుణంలో వదిలిపెట్టాం. ఆ వూరు వదిలిపెట్టి వచ్చేరోజున వినిర్మలాకాశంలో సూర్యుడు తేజోవంతంగా ప్రకాశిస్తున్నాడు. నూర్పిళ్ళకు కల్లాలు సిద్ధంచేయబడి వున్నాయి. పక్షులు కోలాహలంతో ఆకాశంలో విహరిస్తున్నాయి. ప్రతిదీ నేత్రానందదాయకంగా వుంది. ఉత్సాహం ఊయలలో హృదయాన్ని ఉద్రూతలూగించే దృశ్యాలు......కాని, పట్టణంలో ప్రవేశించేసరికి అంతా తారుమారే. జోరున వానలు, పేగులు మెలివేసే చలి, మేఘావృతమైన ఆకాశం.........ఇవే పట్టణంలో మాకు లభించిన స్వాగతాలు. అంతా కొత్తే, ముక్కూ, మొఖం ఎరుగని కొత్త మొఖాలే అన్నీ; ఆతిథ్యభావం ఏ మొఖంలోనూ కానరాదు. కోరచూపులు, ముసరుసలాడే

మొఖాలు ప్రత్యక్షమయ్యాయి. ఇలాంటి వాతావరణం లోనే ఎట్లకేలకు మేము స్థిరపడి పోయాం. ఇంటి సామాను లవీ సమకూర్చుకోటానికి మేమెన్నో యిబ్బందులు పడవలసి వచ్చింది. పగలల్లా నాన్న అసలు యింటివద్ద వుండేవాడే కాదు. అమ్మ కూడా క్షణం తీరిక లేకుండా, ఏదో పనిలో నిమగ్నమై వుండేది. నన్ను గురించి పట్టించుకొన్నవారే లేకపోయారు. పట్టణానికివచ్చిన మొదటిరోజున నా కెంతో బాధ అనిపించింది. మా ఇంటి కిటికీల తలుపులన్నీ బారలా తెరచి వున్నాయి. మా యింటి ప్రక్కనేగల రొచ్చు గుంటనుంచి మున్నూట అరవైయైదు రోజులూ దుర్గంధం ప్రసరిస్తూనే వుంటుంది. ఇంటి ప్రక్కనే గల రోడ్డంట వచ్చీ పోయే జనం చలిబాధనుంచి తట్టుకొనేందుకు ఆపాదమస్తకం శరీరాన్ని కోటులతో కప్పుకొని, అటూ యిటూ పోతున్నారు.

మా యింట్లో పరిస్థితికూడా దుస్సహంగానే వుంది. రోజల్లా ఇంట్లోపడి చావాలి. కాలు బయట పెట్టేందుకు వీల్లేదు. పట్టణంలో బంధువులూ లేరు; మిత్రులూ లేరు. ఎక్కడికని పోతాం?, అన్నా ఫ్యోడొరోవ్ నాకు, మానాన్నకు అసలు మాటలు లేకుండా పోయాయి. వారిద్దరూ పోట్లాడు కొని, మాట్లాడుకోటం మానేశారు. (ఆమెకు మానాన్న కొంత డబ్బు బాకీపడినట్టున్నాడు). మా నాన్న భాగస్థులు మాత్రమే అడపా దడపా మా యింటికి వస్తూ పోతున్నారు. వ్యాపారానికి సంబంధించిన విషయాలపై కీచులాటలు, వాద వివాదాలు, అరుపులు మున్నగు వాటితో మా యిల్లు కంగు

మంటుండేది. మా నాన్నకు మనస్థిమితం లేకుండా పోయింది. ఇంట్లో వున్నంతసేపూ నాన్న ఏదో ఒకటి దీర్ఘంగా ఆలోచిస్తూ, కాలుగాలిన పిల్లిలాగా గదిలో అటూయిటూ తిరుగాడుతుండేవాడు. అలాంటప్పుడు నాన్నను పలకరించటానికి అమ్మ భయపడుతుండేది. నేనుకూడా పిల్లికూనలాగా ఒక మూలను కూర్చొని ఏదో ఒక పుస్తకం చేతపట్టుకొని, చదువుతున్నట్టు నటిస్తూ కాలక్షేపం చేసేదాన్ని. పీటర్సుబర్గులో మకాం పెట్టిన మూడు నెలలకు ఒక బోర్డింగు పాఠశాలలో నన్ను చేర్పించారు. అంతా కొత్తే. అన్నీ కొత్తమొహాలే. ఆ బడిలో ఉపాధ్యాయులు బిగ్గరగా అరుస్తూ పిల్లలను హడలుకొట్టటం తప్పితే వాసు చెప్పే పాఠాలు మరిలేవు. ఆడపిల్లలంతా కలిసి నన్ను ఏడ్పించుకు తినేవారు. ఈ బడిలో అన్నీ నిర్బంధాలే. ప్రతిదీ నిర్ణీత క్రమంలో జరిగిపోవలసిందే. ఇష్టమున్నా, లేకపోయినా, ఆకలి వేయకపోయినా నిర్ణయించిన ప్రకారం అందరితో కలిసి సహపంక్తి భోజనం చేయవలసిందే; తప్పదు. ఇక పంతుళ్లు చెప్పే చదువు సంగతి చెప్పనే అక్కర్లేదు. అంతా అయోమయం. ఆ పాఠాలు వింటూంటే తలనొప్పి పుట్టుకొచ్చేది. చిత్రహింసలు అనుభవిస్తున్నట్లు బాధపడ్డాను. మొకట్లో రాత్రిపూట అసలు నిద్రపట్టేదే కాదు. ప్రక్కపై పడుకొని, రాత్రంతా కుమిలి కుమిలి ఏడ్చేదాన్ని. సాయంత్రంపూట పాఠాలు చదువుతూంటే, ధ్యాసంతా యింటిమీదే వుండేది. ఎంత చదివినా బుర్రకు ఎక్కేదే కాదు. అమ్మా, నాన్నా, అమ్మమ్మలపై గాలి మళ్ళేది. అమ్మమ్మ చెప్పే పేదరాసి పెద్దమ్మ కథలు గుర్తు

కొచ్చేవి. ఇంటిని గురించి తలుచుకొన్నకొలదీ దుఃఖం పొర్లు కొచ్చేది. ఈ పాడుబడికి ఒక నమస్కారం పెట్టి, ఇంటికి పారిపోతే ఎంతబాగుండు ననిపించిది. అమ్మను కావిలించు కొని, కులాసా కబుర్లు చెప్పుకొంటుంటే ఎంత బాగుంటుంది! ఇలాంటి ఆలోచనలతో నా మనస్సంతా వికలమై పోతుండేది. పాఠాలు వంటబట్టేవి కావు. పంతులమ్మ, పెద్ద పంతులమ్మ, తోటి ఆడపిల్లలు నాకు రాత్రిపూట కలలో భీకరంగా కన్పించే వాళ్ళు. తెల్లారిన తర్వాత పాఠాలు సరిగా అప్పజెప్పనందుకు నన్ను గోడకుర్చీ వేయించేవారు. ఆ శిక్ష చాలదన్నట్టు అన్నం తగ్గించి, కడుపుమాడ్చేవారు. ఈ వాతావరణంలో జీవించటం చాలా బాధగా వుండేది. మొదట్లో ఆడపిల్లలు నన్ను అవహేళన చేసి, ఏడ్పించారు. కావాలని ఎద్దేవాచేసే వారు. నన్ను చూసీచూడగానే అంతా విరగబడి నవ్వేవారు. పంతులమ్మ వేసిన ప్రశ్నలకు నేను సరియైన సమాధానం చెప్పలేకపోయినప్పుడల్లా వెక్కిరించేవాళ్ళు. భోజనానికి, అల్పాహారానికి అంతా కలిసి వెళ్ళుతుంటే, నన్ను గిల్లుతుండే వాళ్ళు. పైగా పెద్దపంతులమ్మకు నాపైన చాడీలు చెప్పే వాళ్లు. ప్రతి శనివారం సాయంత్రం అమ్మమ్మ వచ్చి నన్ను యింటికి తీసుకుపోతుండేది. ప్రతి శనివారం నాకొక పెద్ద పండుగలాగా అనిపించేది. అమ్మమ్మ రాగానే, ఆమెను గట్టిగా కావిలించుకొని ముద్దెట్టుకొనేదాన్ని. పదేళ్ళతర్వాత మళ్ళీ కలుసుకొన్నట్టు వ్యవహరించేదాన్ని. గబగబా ఇంటి ముఖంగా పరుగెత్తేదాన్ని. అమ్మమ్మ వెనకబడిపోయేది. ఇంటికిచేరగానే, పెద్ద కోలాహలం పుట్టించేదాన్ని. వసపోసిన

పిట్టలాగా తెరిపి లేకుండా వాగుతుండేదాన్ని. బందిఖానా నుంచి బయటపడిన ఖైదీలాగా వ్యవహరించేదాన్ని. ఆ విష యాలు తలుసుకొని, ఇప్పటికీ నాలో నేను నవ్వుకొంటూ వుంటాను. నాన్నకోసం, నా చదువుకొరకు నాన్న ఖర్చు చేస్తున్న డబ్బును సద్వినియోగం చేయటంకోసం శ్రద్ధగా చదివేందుకు శక్తివంచన లేకుండా కృషి చేశాను. నాన్న నానాఅవస్థలుపడుతూ కుటుంబ భారాన్ని నిర్వహిస్తు న్నాడు. రోజు రోజుకీ నాన్న మరింత విచారగ్రస్థుడవు తున్నాడు; ఆయనలో అసంతృప్తి, కోపతాపాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. ఆయనతో వేగటమే మహా కష్టం కాజొచ్చేంది. ఆర్థిక వ్యవహారాలు రాను రాను మరింత విషమించాయి. అప్పులవాళ్ళ బాధ భరింప శక్యంకానిదిగా తయారైంది. నాన్న ముందు నోరు విప్పటానికి కూడా అమ్మ జంకుతుండేది. చివరకు నాన్న చూస్తుండగా కంట తడిపెట్టుకోటానికి కూడా సాహసించలేక పోతున్నది. దిగు లుతో, సంసార బాధలతో అమ్మ కృంగి, కృశించిపోతున్నది. దీనికితోడు ఊపిరాడని దగ్గు ఒకటి పట్టుకొంది. స్కూలు నుంచి ఎప్పుడు ఇంటికి వచ్చినా, విచార దేవత నర్తిస్తోంది. విచారభారంతో ఇంట్లోవాళ్ళందరి మొఖాలూ ముడుచు పోయివుండేవి. నాన్న కస్సుబుస్సు మంటుండేవాడు. లోలోపల కుములుతున్నందున అమ్మ కళ్ళు నిర్జీవమై పోయాయి. ఇంట్లో తిట్లు, కీచులాటలు హెచ్చాయి. నేను పుట్టిన తర్వాత సంసారమంతా పాడైపోయిందని నాన్న సాధిస్తుండేవాడు. మిగిలిన కాస్త ఆస్తినీ కరిగించి, నా చదు

వుకు వెచ్చించినా।నాకు చదువేమీ అబ్బలేదని తిట్టుతుండే వాడు. ఒక్కమాటలో చెప్పాలంటే జరిగిన నష్టాలకు, వచ్చిన కష్టాలకు నేనూ, మా అమ్మా కారణమంటూ ఆడి పోస్తూండేవాడు. నాన్న చేతిలో అమ్మ అన్నివిధాలా యమ యాతనాలు అనుభవిస్తున్నది. అమ్మనుచూస్తే జాలేసేది. పీక్కుపోయిన కళ్లూ, బొమికలు తేలిన చెక్కిళ్ళు, శవా కారంగా తయారైన శరీరం - రేపోమాపో చచ్చిపోతుందా అన్నంతగా భయమేసింది. ఇక నేను పడ్డ తిప్పలు ఆ భగ వంతుడికే తెలియాలి. నిష్కారణంగా ఇంట్లో వాళ్ళంతా నాపై విరుసుకుపడేవాళ్ళు. ఎవరెవరి మీదనోవున్న కోప తాపాలన్నీ నాపైన చూపించేవాళ్లు. నేను ఒట్టిచవటననీ, చదువుసంధ్యలురాని దద్దమ్మననీ శపిస్తుండేవాళ్ళు. అమ్మకూ, నాన్నకూ నేనంటే చచ్చినంత ప్రేమ. అయినా ఈ అగచాట్లు తప్పవు. అదే విచిత్రం.

నాన్నకన్న కలలన్నీ కల్లలై పోయాయి. ఏ వ్యాపా పారంలో కాలుపెట్టినా ఎదురుదెబ్బలే తగిలాయి. నష్టమూ, దురదృష్టమూ మాత్రమే మాకు మిగిలాయి. చికాకులు, చింతలతో నాన్న ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. వీటన్నిటి పుణ్యమాఅంటూ నాన్నకు జబ్బుచేసింది. కొద్ది రోజులు మంచంపై తీసుకొని, తనువుచాలించి, మమ్ములను ఈ లోకంలో వదిలిపెట్టి వెళ్ళి పోయాడు. నాన్న చనిపోయాడన్న నాస్త వాన్ని మేము మొదట్లో నమ్మలేకపోయాం. స్వయంగా చూసిన విషయాన్నే విశ్వసించలేక పోయాం. ఇలా, ఇంత హఠాత్తుగా ఈ విపత్తు వచ్చిపడుతుందని కలలోకూడా

ఊహించలేక పోవటమే అందుకు కారణం కావచ్చు. మనో వ్యధతో అమ్మ మాటామంతీ లేకుండా మూగదాని వలె మారిపోయింది. ఆ స్థితిలో అమ్మను చూస్తుంటే, నాలో విపరీతమైన భయం పుట్టుకొచ్చేది. నాన్న చనిపోయాడన్న వార్త చెవినపడగానే, అప్పులిచ్చిన వాళ్ళంతా మిడుతల దండువలె నలువైపులనుంచీ మా యింటిని ముట్టడించారు. మిగిలిన కాస్త ఆస్తినీ, సామానులనూ ఎగేసుకు పోయారు. చిల్లిగవ్వకూడా మిగల్చ లేదు. చివరకు దిక్కులేని పక్షులమై పోయాం. తలదాచు కోటానికి యిల్లు లేదు. రేపు ఎలా గడుస్తుందో తెలియని విషమస్థితిలో పడిపోయాం. అప్పటికి నాకు పద్నాలుగేళ్ళ వయస్సు. రోగపీడితురాలైన అమ్మ ఆరోగ్యస్థితి ఆందోళన కరంగా పరిణమించింది. పొయ్యిలో పిల్లి లేచే మార్గం కన్పించలేదు. ఆకలిబాధకు గురియై చావటంకన్నా మరొక మార్గం లేదనిపించింది. మేము అలాంటిస్థితిలో వున్నప్పుడు అన్నా ఫ్యోడొరోవ్‌నా మా వద్దకు వచ్చింది. తాను మాకు దగ్గర బంధువునని చెప్పి, తనకు ఇల్లూ వాకిలీ వుందనీ, అక్కడకు తప్పక రావాలనీ ఆమె పట్టుబట్టింది. ఆమె బంధువు వేననీ, అయితే చాలా దూరపు బంధువనీ అమ్మ కూడా చెప్పగా విన్నాను. నాన్న బ్రతికుండగా, ఆమె ఎన్నడూ వచ్చి మమ్మల్ని చూసిన పాపాన పోలేదు. నాన్న చనిపోయిన తర్వాత కంటతడిపెట్టుకుంటూ మా దుస్థితికి వగస్తూ, మాపై ప్రేమానురాగాలు ప్రదర్శిస్తూ తన యింటికి వస్తేకాని వీల్లేదని కూర్చున్నది. మా కుటుంబం పరిస్థితి ఇలా

దిగజారటానికి మా నాన్న ప్రవర్తనే కారణమనీ, తలకు మించిన ఖర్చులు చేసి డబ్బంతా పాడుచేశాడనీ, ఇతరులు చెప్పిన మాటలు వినకుండా వ్యవహరించాడనీ ఆమె ఏమేమో ఏకరువుపెట్టింది.

జరిగిందేదో జరిగిపోయింది; గతాన్ని మరచిపోయి మనమంతా కలిసి, హాయిగా జీవిద్దాం అంటూ ఆమె ప్రతిపాదించింది. "మీాపై మాకు పగ ఏమిటి" అని మా అమ్మ అన్నప్పుడు ఆమె కళ్ళంట నీరు కార్చిందికూడా. ఏది ఏమైతేనేమి అమ్మకు అంతగా ఇష్టం లేకపోయినా, చివరకు అన్నా ఫ్యోడొరోవ్నా, మేము కలిసి ఒకే ఇంట్లో జీవించక తప్పింది కాదు.

ఆమె ఇంట్లో మేము ప్రవేశించిన వెంటనే, ఆమె ఏవేవో పాఠాలు మొదలెట్టింది. మేము ఎలాంటి దుస్థితిలో వున్నామో వివరిస్తూ పెద్ద ఉపన్యాసమిచ్చింది. నిరాశామయమైన, అంధకార బంధురంగా కన్పిస్తున్న భవిష్యత్తును తెలుసుకొంటున్నకొలదీ మనోవ్యథ, హృదయావేదన యితోధికం కాజొచ్చాయి. కష్టాల అధ్యాయంలోకి మా జీవితం ప్రవేశిస్తోంది.

## 2

అన్నాఫ్యోడొరోవ్నా ఇల్లు 6 వ లైనులో వుంది. ఆ యింట్లో అయిదుగదులు న్నాయి. ఆ యింట్లో అడుగు పెట్టగానే మాకు అంతా వింతగా కన్పించసాగింది. జీవితం

భయానకంగా తోచింది. ఇంట్లో మూడు గదులు అన్నా ఫ్యోడొరోవ్‌నా తన క్రింద వుంచుకొంది. ఒక గదిని మాకు కేటాయించింది. మరొక గదిలో ఒక పేద విద్యార్థి — అతని పేరు పొక్రొవ్‌స్కీ — అద్దెకు వుంటున్నాడు. మా మేనత్త కూతురు సాషా తల్లిదండ్రులు చిన్ననాటనే చనిపోయినందున, దానిని అన్నా ఫ్యోడొరోవ్‌నా పెంపకం తీసుకొంది. అన్నా ఫ్యోడొరోవ్‌నా పైకి అంత స్థితిపరురాలువలె కన్పించకపోయినా, ఆస్తి మస్తుగానే వుంది. మరి ఆ ఆస్తిని ఎలా సంపాదించిందో ఆ పరమాత్ముడికే తెలియాలి. ఆమె ఎప్పుడూ హడావిడిగా అటూ యిటూ తిరుగుతూ ఏదో ఒక పనిలో నిమగ్నమైవున్నట్టే కన్పించేది. ఆమెకు క్షణం తీరికవుండేది కాదు. చీటికి మాటికి ఎక్కడికో బయటకు వెళ్ళివస్తుండేది. ఆమెతో మాట్లాడటానికి రోజూ అనేకమంది వస్తూపోతూ వుండేవారు. వాళ్ళెవరో, అన్నా ఫ్యోడొరోవ్‌నాతో వాళ్ళ కేమిపనో, వాళ్ళంతా ఆమెతో మాట్లాడే వ్యాపారవిషయాలేమిటో ఎవరికీ తెలిసేది కాదు. వచ్చిన ప్రతివ్యక్తీ ఒక నిముషం మాట్లాడి, మళ్ళీ వెంటనే పోతుండేవాడు. వీధిగుమ్మం తలుపుతట్టిన చప్పుడు కాగానే గదిలోకి రమ్మని మా అమ్మ నన్ను కసురుకొనేది. ఇతరులకంట పడకుండా నేను గదిలోకి పోవటం అన్నా ఫ్యోడొరోవ్‌నాకు కంటగింపుగా వుండేది. ఆమె అమ్మపై విసుక్కుపడేది. 'తినటానికి టికాణా లేక పోయినా, అభిమానానికి మాత్రం లోటు లేదు అంత ఘోషా పనికిరాదే తల్లీ; ఏముందని చూసుకొని, అలా చాటుకు పోతారు?

మీ రేమన్నా రాణులా, రాణివాసం సాగించటానికి?' అంటూ ఏమేమో గంటలతరబడి మమ్మల్ని తిట్టిపోస్తుండేది. ఆ తిట్టుల లోని అంతరార్థమేమిటో అప్పుడు నాకు అర్థంకాలేదు. అన్నాఫ్యోడొరోవ్ నా యింటికి తరలటానికి అమ్మ అంతగా ఎందుకు సందేహించిందో నాకిప్పుడు అవగతమవుతోంది. ఆమె ఆసలే కోపిష్టిది. నన్నూ, మా అమ్మనూ నిత్యం వేధించీ, బాధించీ వేపుకుతిన్నది. ఇంతకీ ఆమె మమ్మల్ని తనింటికి రమ్మని అంతగా పట్టుపట్టటానికి గల అసలు కారణమేమిటో ఇప్పటికీ నాకు అంతు చిక్కటంలేదు. మొదట్లో మమ్మల్ని బాగానే చూసింది. కాని రోజులు గడచినకొలదీ ఆమె అసలు స్వభావం బయటపడింది. వీళ్ళు దిక్కులేని వాళ్ళుగదా, నొక్కితే లొంగక ఎక్కడికి పోతారులే అన్న ధీమాతో వ్యవహరించింది. తరువాత ఆమె నాపై అవ్యాజ ప్రేమను ప్రదర్శించింది. నా అందచందాలను గురించి పొగిడింది. గుణగణాలను మెచ్చుకొంది. కాని మొదట్లో నేనూ మా అమ్మలాగానే అన్ని అవస్థలూ పడక తప్పింది కాదు. ఆమె ఎప్పుడూ మా దిక్కులేనితనాన్ని గురించీ, ఆమె దాతృత్వాన్ని గురించి తప్పితే మరొక విషయం ప్రస్తావించేదేకాదు. బయటవాళ్లు వచ్చినప్పుడల్లా, "వీళ్ళకు నా అన్నవాళ్ళెవరూ లేరు. దిక్కులేనివాళ్ళను దగ్గ రకుతీస్తే, దేవుడు మెచ్చుకొంటాడన్న దృష్టితో నేను వీళ్ళను పోషిస్తున్నాను" అంటూ చెప్పేది. మేమంతా కూర్చొని భోజనాలు చేసేటప్పుడు, ఆమె ప్రవర్తన మరింత వింతగా, విచిత్రంగా వుండేది. నేనూ, మా అమ్మా తినే ప్రతీ ముద్దనూ

ఆమె అదోమాదిరిగా పరాకాయించి చూసేది. పోనీ, అలా గని రెండు ముద్దలు తక్కువ తిన్నామా సాధింపులు ప్రారంభించేది; తల్లికీ, కూతురికీ ఎంత నిక్కు! నా చేతి తిండి సహించటం లేదు కాబోలు. ఏం? ఈ కూడు మీకు అంత అసహ్యంగా వుందా? అంటూ ఆడిపోసేది. నాన్నను ఏడ తిట్టేది. హెచ్చులకుపోయి ఆస్తినంతా తగలేశాడని దెప్పుతుండేది; ఉన్ననాడు జోరుగా వెలిగి, చివరకు పెళ్లాన్ని, బిడ్డను దిక్కులేనివాళ్ళుగా, అడుక్కొనేవాళ్ళుగా వదిలిపోయాడని శపించేది. ఆమె నోటికి అడ్డం అనేది లేదు. ఎక్కడ పడితే అక్కడ కూసేది. ఆమె కారుకూతలు వింటుంటే కడుపుమండిపోయేది. బాధకలిగేది. అమ్మ కళ్ళంట కన్నీటి ధారలు జాలువారేవి. రానురాను అమ్మ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. అయినా నాతోపాటు అమ్మకూడా రేయింబవళ్లు కుట్టుపని సాగిస్తూనే వచ్చింది. మేము కష్టపడి పనిచేసుకోటం కూడా అన్నాభార్యలకు నాకు కష్టంగానే వుండేది. "ఈ కొంప అందాల దుస్తులషాపు కాదమ్మా" అంటూ సూటిపోటు మాటలంటూ వుండేది. మేము ఆమె యింట్లో వుంటూ, ఆమె తిండే తింటూవున్నా, పై ఖర్చులకు ఎంతో కొంత సంపాదించుకోకపోతే ఎట్లా గడుస్తుంది? అదీకాక ఈ ఇంట్లోపడి తింటూ ఎంత కాలం వుండటం? ఏదో కొంత మొత్తం కూడదీసుకొని, వేరేయింట్లోకి పోవాలన్న ఆలోచన కూడా మాకు లేకపోలేదు. అమ్మ అసలే జబ్బుమనిషి. అందులో రేయింబవళ్లు కుట్టుపని. వీటన్నిటివల్ల ఆమె అంతకంతకు బాగా క్షీణించిపోయింది. రోజులూ, వారాలూ గడుస్తున్న

కొలదీ, అమ్మ వంట్లో సత్తువా, నెత్తురూ తరిగిపోసాగాయి. మా జీవితం ఒక విధంగా కుదటపడింది. ఏ గొడవ లేకుండా బ్రతుకుతున్నాం. మేము తనకు పూర్తిగా లొంగిపోయినట్లు భావించిన అన్నా ఫ్యోడొరోవ్‌నా కూడా కొంత చల్లబడింది. ఆమె మాటను కాదనగల సాహసం, దమ్ములూ ఎవరికీ లేవు. ఆమె వుంటున్న గదులకు, మేముంటున్న గదికిమధ్య వరండా వుంది. మా ప్రక్క గదిలో పొక్రొవ్‌స్కీ వుంటున్నాడు. సాషాకు పాఠాలు చెప్పుతూ దానికి ప్రతిఫలంగా ఉచిత భోజనం, ఉచిత నివాసం పొందుతున్నాడు. అన్నా ఫ్యోడొరోవ్‌నా మాటల్లో చెప్పాలంటే, అతను ఫ్రెంచి, జర్మన్ భాషలు, చరిత్ర, భూగోళం సకల శాస్త్రాలలో సాషాకు పాఠాలు చెప్పాలి. సాషా అప్పటికి పదమూడేళ్ళ పిల్ల. దానిది కొంటె స్వభావం. ఒట్టి కొక్కిరాయి. పొక్రొవ్‌స్కీ వద్ద నన్ను కూడా విద్యనభ్యసించమని ఒకరోజున అన్నా ఫ్యోడొరోవ్‌నా చెప్పగానే మాఅమ్మ పట్టరాని సంతోషం పొందింది. మధ్యలో ఆగిపోయిన నా చదువు మళ్ళీ ప్రారంభమైంది. సాషాతోపాటు పొక్రొవ్‌స్కీవద్ద విద్య నభ్యసిస్తున్నాను.

మా అధ్యాపకుడు పేదవాడు; చాలా నిరుపేద. అందులో అనారోగ్యం. దానితో అతని చదువుకు ఆటంకమేర్పడింది. రోజూ బడికివెళ్ళి చదవకపోయినా, అలవాటు చొప్పున పేరుకు విద్యార్థిగానే చలామణీ అవుతున్నాడు. అతను చాలా మంచివాడు. గదిలో కూర్చొని కూనిరాగాలు తీయటం, ప్రేమగీతాలు ఆలాపనం చేయటం అతనికి బొత్తిగా

నచ్చవు. అతిమర్యాదస్తుడు; తనేమో తన పనేమో; అంతే. అతనిని చూస్తుంటే నవ్వొస్తుంది; అతని నడకతీరు, అతను మాటాడేవిధమూ, అతను ఇతరులకు నమస్కారంపెట్టే పద్ధతీ చూసితీరవలసిందే. చూస్తే కడుపుబ్బ నవ్వు పొంగుకొస్తుంది. మొదట్లో నేను నవ్వును ఆపుకోలేక విరగబడి నవ్వేదాన్ని. పాపా ఎప్పుడూ అతన్ని ఏడిపించుకొని తింటుండేది, ముఖ్యంగా పాఠాలు చెప్పేటప్పుడు అతనిని ఉడికిలించేది. అవహేళనపూర్వకంగా ఒక చిన్నమాటంటే చాలు, తోకత్రొక్కిన త్రాసులాగా బుసకొట్టేవాడు. గుసగుసలాడుతూ, గొణక్కుంటూ, చెప్పేచెప్పే పాఠం మధ్యలో ఆపివేసి బయటకు వెళ్ళిపోయేవాడు. ఆ తర్వాత కొన్ని రోజులపాటు తన గదిలో కూర్చొని, ఏవేవో పుస్తకాలు చదువుకొంటూ, పేజీలు తిరగేస్తూ, సమాధిలోకిపోయిన యోగిలా అసలు బయటకు వచ్చేవాడేకాదు. అతని గదిలో సాధారణంగా ఎక్కడా లభించని గ్రంథాలు, ఖరీదైన పుస్తకాలు చాలా వున్నాయి. అక్కడక్కడా అప్పుడప్పుడూ ప్రయివేట్లు చెప్పుతూ సంపాదించిన డబ్బంతా ఈవిధంగా ఈ పుస్తకాలపై పెట్టుబడిపెట్టాడు. అతనికున్న యావదాస్తీ ఆ పుస్తకాలే. అతనినిగురించి అర్థంచేసుకొంటున్నకొలదీ, అతన్ని మించిన కరుణాశీలి నాకు తెలిసినంతవరకు మరొకడు కన్పించలేదు. మా అమ్మకుకూడా అతనంటే ఎంతో గౌరవం. మా అమ్మ చనిపోయిన తరువాత నాకు అతను ఆప్తమిత్రుడయ్యాడు. కాని, మొదట్లో పాపాతోకలిసి నేనూ - యుక్తవయస్సులో వున్న దానినైకూడా -

అతనిని ఏడ్పించాను. అతనిని ఉడికిలించటానికి, రెచ్చ గొట్టటానికి పద్ధతులు ఏమిటాఅని నేనూ, పాపాకలసి గంటల తరబడి చర్చించి ప్లానులు వేస్తుండేవాళ్ళం. అతనికి కోపంవచ్చినప్పుడు చూడాలి! ఏమి మాట్లాడుతున్నాడో కూడా తెలియకుండా వాగేస్తుంటాడు. అది మాకెంతో ఆహ్లాదకరంగా వుండేది. (దానిని తలుచుకొంటే ఇప్పుడు నాకు తల కొట్టేసినట్టనిపిస్తూంది). ఒకసారి అతనిని ఎంత ఇదిగా ఏడ్పించామంటే, పాపం, అతని కళ్ళంట కట్టలు తెంచు కొని కన్నీరు ప్రవహించింది. "మీరు చిన్నపిల్లలైనా, మీ హృదయాలు పాషాణాలు" అని అతను నెమ్మదిగా గొణి గాడు. అంతే. నాటినుంచి నాలో ఒక విధమైన మార్పు వచ్చింది. మేముచేసిన పనికి నేను పశ్చాత్తాపపడ్డాను. అతనిని చూస్తే నాకు జాలివేసింది. నాకళ్ళంట కూడా నీళ్ళుతిరిగాయి. సిగ్గుపడుతూ, ప్రాధేయపూర్వకంగా చెప్పాను: ఏదో లెండి. చిన్నపిల్లలం. తెలియకచేసిన తప్పుకు మన్నించండి. మీరు కష్టం పెట్టుకోకండి. మనస్సు నొచ్చుకోకండి. అయినా అతను నామాట విన్పించుకోకుండానే, చెప్పేచెప్పే పాఠం మధ్యలో ఆపేసి కోపంగా గదినుంచి వెళ్ళిపోయాడు. ఆ రోజల్లా నా మనస్సు ఎంతిగానో దురపిల్లింది. పాపం, అతని కళ్ళంట నీరు తెప్పించేంతగా ఏడ్పించటమా ? అతను ఏడుస్తుంటేచూసి సంతోషించాలనే మేము ఆ పని చేశాం. కాని, తీరా అతని కళ్ళలో నీరుతిరగ్గానే నాకళ్ళు కూడా చెమ్మగిల్లాయి. ఆ రాత్రి నాకు సరిగా నిద్రపట్టలేదు. నేను చేసినపనికి నా మనస్సు చివుక్కుమంది. దుఃఖిస్తే హృదయ

భారం తగ్గుతుందంటారు. కాని ఈ మాట నిజంకాదని ఆనాడు అనుభవపూర్వకంగా గ్రహించాను. నా విచారంలో కొంత వంచనకూడా లేకపోలేదు. నన్నొక చిన్న పిల్లలాగా అతను పరిగణించటం నా కేమాత్రం ఇష్టంలేదు. అప్పటికి నేను పదిహేనేళ్ళదాన్నికదా!

నాటినుంచీ నేను పలు పలు విధాల ఆలోచించేదాన్ని, ఊహించేదాన్ని. నన్నుగురించి పొక్రొవ్‌స్కీ ఏర్పరచుకొన్న అభిప్రాయాలను మార్చటం ఎలాగా అని ఆవేదన చెందాను. కాని, ఎక్కడలేని సిగ్గు, బిడియం నన్ను ఆవహించాయి. నాలోని ఊహలు ఊహలుగానే మిగిలిపోయాయి. పాపా అతనిని ఏడిపిస్తూంటే నేను చూస్తూ వూరుకుండేదాన్ని. అంతకు మినహా నే నేమీ చేయలేక పోయాను. మాపై అతనికోపం తగ్గిపోయింది. అయినా దెబ్బతిన్న నా అభిమానానికి అది ఏమాత్రం ఉపశమనం కల్గించలేదు.

ఈ సందర్భంలోనే ఒకవిచిత్ర వ్యక్తిని గురించి నాలుగు ముక్కలు ఉల్లేఖించక తప్పదు. ఆ విచిత్ర వ్యక్తిని చూస్తే నే ఎవరికైనా తప్పకుండా జాలివేస్తుంది. అలాంటి వ్యక్తిని నేను ఇదివరకు ఎన్నడూ చూడలేదు. ఇంతకుముందు చాలా రోజులుగా ఆ వ్యక్తి మాయింటికి వస్తూపోతూనే వున్నాడు. అయినా అతనిని గురించి నేను అంతగా పట్టించుకోలేదు. పొక్రొవ్‌స్కీపట్ల నా వైఖరిలో మార్పు రావటంతో పాటు, ఈ విచిత్ర వ్యక్తిపట్ల ఆసక్తి హెచ్చింది.

తరచు ఒక వృద్ధుడు మా యింటి కొస్తుండేవాడు. అతను ధరించే దుస్తులు చూడటానికి చాలా అసహ్యకరంగా

వుండేవి. నెరిసిన జుట్టు, పొట్టికురస, గూని... మొత్తంమీద చాలా చోద్యంగా కన్పిస్తాడు. అతను ఎప్పుడూ ఎందుకో ఏదో తలవంపులు పొందిన వ్యక్తివలె బాధపడుతుండేవాడు. ఆ బాధ, ఆ వ్యథ అతనిని కృంగదీశాయి. అతనికి మతిభ్రమణం కల్గిందా అన్పించేలా కన్పించేవాడు. ఇంటిముందు దాకావచ్చి, లోపలకు అడుగుపెట్టటానికి జంకి, వాకిట్లో నిలబడేవాడు. ఎవరైనా కన్పిస్తే, నమస్కారంపెట్టి, అనుమతి పొంది మరీ లోపల ప్రవేశించేవాడు. నేనుగానీ, సాషాగానీ కన్పిస్తే అతను ఎంతో సంతోషం పొందేవాడు. ఇంట్లో కొత్తవాళ్ళున్నట్టు తెలిస్తే అతను వచ్చినా లోనికిరాడు. కొత్తవారు ఎవరూ లేరని రూఢి అయిన తర్వాత, నెమ్మదిగా తలుపు త్రోసుకుంటూ, చేతులు నలుపుకుంటూ, పిల్లిలాగా అడుగులో అడుగు వేసుకుంటూ పొక్రొవ్‌స్కీ గదివైపు వెళ్ళేవాడు. పొక్రొవ్‌స్కీ తండ్రే అతను.

చాలాకాలానికిగాని అతని సంపూర్ణ జీవితగాథ నాకు తెలియలేదు. ఎప్పుడో చాలాకాలంక్రిందట కొంతకాలం పాటు గుమ్మస్తా పనిచేశాడు. ఆ వృత్తిలో అతను సామర్థ్యం ప్రదర్శించలేదు. అయినా అది చెప్పుకోదగిన ఉద్యోగమూ కాదు. అతని మొదటి భార్య - పొక్రొవ్‌స్కీ తల్లి చని పోయిన తర్వాత-రెండోపెళ్ళి చేసుకొన్నాడు. కొత్తపెళ్ళాం వస్తూనే బండెడు కష్టాలు వెంటేసుకొచ్చింది. ఆమె వొట్టి గయ్యాళి; అందరిపైనా అధికారం చలాయించే బాపతు. అప్పటికి పొక్రొవ్‌స్కీ వయస్సు పదేళ్ళు. ఏపాపమూ ఎరుగని పొక్రొవ్‌స్కీని ఆ సవతితల్లి విపరీతంగా ద్వేషిస్తూ, రాపి

రంపాన పెట్టేది. అతని అదృష్టం పండిన ఫలితంగా, బైకోవ్ అనే భూస్వామి అతనిని దగ్గరికి తీశాడు; చదువు చెప్పించాడు. పొక్రొవ్‌స్కీ తల్లితో బైకోవ్‌కు పరిచయముంది. అన్నా ఫ్యోదొరోవ్‌నా యే ఆమెకూ, బైకోవ్‌కూ పరిచయం ఏర్పరచింది. అటుతర్వాత ఆమె పెళ్ళి కుదిర్చి చేసింది కూడా అన్నా ఫ్యోదొరోవ్‌నాయే. బైకోవ్ దయాశీలుడు కనుక ఆమె పెళ్ళికి కట్నం క్రింద 5 వేల రూబుళ్లు కూడా ఇచ్చాడు. ఆ డబ్బంతా ఏమై పోయిందో తెలియదు. మాస్టర్ పొక్రొవ్‌స్కీకి తన కుటుంబ విషయాలు చర్చించటమంటే ఎందుకోగాని ఏ మాత్రం యిష్ట ముండేది కాదు. అతని తల్లి చాలా అందగత్తె అని ప్రతీతి. అంత అందగత్తె ఒక అందవిహీనుడిని ఎందుకు పెళ్ళాడవలసి వచ్చిందో తెలియదు. వీరి జంట కాకి ముక్కుకు దొండ పండు అన్నట్టు వుండేది. యౌవనం పూర్తిగా అనుభవించ కుండానే, పెళ్ళయిన నాలుగేళ్ళకే ఆమె చనిపోయింది. పాఠశాల చదువు పూర్తిచేసిన పిమ్మట, మాస్టర్ పొక్రొవ్‌స్కీ విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. బైకోవ్ పీటర్స్‌బర్గు వచ్చి నప్పుడల్లా పొక్రొవ్‌స్కీ క్షేమసమాచారాలు అడిగి తెలుసుకొని వెళ్లుతుండేవాడు. అనారోగ్యంవల్ల పొక్రొవ్‌స్కీ చదువుకు స్వస్తిచెప్పక తప్పనిపరిస్థితి ఏర్పడినప్పుడు, బైకోవ్ ఆ కుర్రాడిని తీసుకొచ్చి అన్నా ఫ్యోదొరోవ్‌నా యింట్లో పెట్టాడు. బైకోవ్ సిఫారసు చేయబట్టే, అన్నా ఫ్యోదొరోవ్‌నా పొక్రొవ్‌స్కీని సాషాకు చదువు చెప్పేందుకు నియమించింది. ఈ లోగా రెండో పెళ్ళాం పెట్టే బాధలు భరించలేక

షా[క్రొవ్‌స్కీ తండ్రి దురభ్యాసాలకు లోనయ్యాడు. [తాగు డుకు పూర్తిగా దాసుడైపోయాడు. రెండో పెళ్ళాం అతనిని చావచితక తన్ని, వంటపనులనూ, యింటిపనులనూ అతని చేత చేయించేది. ఆవిధంగా అతను తన్నులకు, తిట్లకు పూర్తిగా అలవాటుపడిపోయాడు. ఇదేమిటి అని నోరెత్తి ఫిర్యాదుచేయటంకూడా మానుకొన్నాడు. నిజానికి వయస్సు అంతగా ముదరకపోయినా, తాగుడువల్ల, పెళ్ళాం తన్నులవల్ల అతని మానసికస్థితి పూర్తిగా దుర్బలమైపోయింది. పోతే అతనిలో ఒకే ఒకమానవత్వ లక్షణం యింకా చావకుండా మిగిలివుంది. అదే పితృ[పేమ. షా[క్రొవ్‌స్కీని చూచు కుంటూ అతను తన మొదటిభార్యను స్మరించుకొంటూండే వాడు. మొదటిభార్యను అతను అమితంగా [పేమించబట్టే కొడుకుఅంటే అతనికి అంత అనురాగం. అతను తన కొడు కును గురించే ఎప్పుడూ ఆలోచిస్తుండేవాడు. ఎవరితో మాట్లాడినా కొడుకు [పస్తావనే తెస్తుండేవాడు. వారా నికి రెండు సార్లు మాత్రమే వచ్చి కొడుకుని చూసుకు పోతుండేవాడు. అంతకు మించి రానటం అంటే అతనికి మహాభయం. షా[క్రొవ్‌స్కీ కూడా తన తం[డిని చూసి ఏవగించుకొనేవాడు. షా[క్రొవ్‌స్కీలో గల లోపాలన్నింటి లోకి పెద్ద లోపం కన్నతం[డిని చూసి అసహ్యించుకోవటం; తం[డి అంటే ఈషణ్మా[తం గౌరవం లేకపోవటం. ఈ [పపం చంలోని అభాగ్యులందరిలోకీ దురదృష్టవంతుడు ఈ వ్యక్తే నేమో అనిపిస్తుంది. అయినా కొన్ని సందర్భాలలో ఈ వ్యక్తి వ్యవహారం విపరీతమైన విసుగు జనింపచేస్తుంది. తనకు

అవసరం వున్నా లేకపోయినా ప్రతి విషయం గురించి తెలుసుకోవాలన్న కుతూహలంతో లేనిపోని ప్రశ్నలు వేసి, ఎదుటివ్యక్తిని విసిగిస్తాడు. ఒక్కొక్కప్పుడు అతను వేసే ప్రశ్నలు అర్థరహితంగా, అప్రస్తుతంగా వుంటాయి. పొక్రొవ్‌స్కీ ఏకాగ్రతతో ఏదైనా పుస్తకం చదువుకొంటూవుంటే, పాన కంలో పుడకలాగా, అతను ఆ చదువుకాస్త చెడకొట్టుతుం టాడు. అదీకాక, అప్పుడప్పుడు తప్పతాగి తూలుతూ వస్తుం టాడు. అందుకే పొక్రొవ్‌స్కీకి తన తండ్రి అంటే అంత అసహ్యం. తండ్రిని సన్మార్గంలోకి తేవాలని పొక్రొవ్‌స్కీ విశ్వ ప్రయత్నాలు చేశాడు. అయినా ఫలితంలేకపోయింది. కొడుకునుచూసి అతను భయపడటం అలవర్చుకొన్నాడే కాని, అవలక్షణాలను మార్చుకోలేక పోయాడు.

అతను తన కొడుకును చూసుకొని ఎప్పుడూ మురిసి పోతూండేవాడు. అయితే కొడుకు ఎదురుగావున్నంతసేపు అతను తలవంచుకుని, ఏదో తప్పుచేసిన నేరస్థుడులాగా భయ పడుతూ, బిడియపడుతూ వుండేవాడు. కొడుకును చూడటానికి వచ్చినప్పుడల్లా తటపటాయిస్తూ వాకిట్లోనే నిలబడిపోయేవాడు. నేనుగాని కన్పించానా, పొక్రొవ్‌స్కీని గురించిన ప్రశ్నాపరంపరతో నన్ను వేధించుకు తినేవాడు. కనీసం ఇరవైనిముషాలైనా తోమందే వదిలేవాడుకాదు. పొక్రొవ్‌స్కీ మనస్థితి ఎలావుంది? అతను ఏదైనా ముఖ్యమైన పనిలో నిమగ్నమై వున్నాడా? అంత ముఖ్యమైన పని ఏమిటి? వ్రాసుకొంటున్నాడా? లేక దేన్ని గురించైనా దీర్ఘంగా యోచిస్తున్నాడా? ఇత్యాది ప్రశ్న

లన్నింటికీ నేను సమాధాన మిచ్చిన పిమ్మట, ఫర్వాలేదు లోపలకు వెళ్లమని ప్రోత్సహించిన తర్వాత మాత్రమే అతను తలుపు నెట్టుకొని లోన ప్రవేశించేవాడు. అదైనా అడుగులో అడుగు వేసుకుంటూ పిల్లిలాగా ముందు తొంగి చూసి మరీ లోన ప్రవేశించేవాడు. తన కొడుకు కోపంగా లేడని తెలుసుకున్న తర్వాత, లోనికిరమ్మనమని తెలూపిన పిమ్మట మాత్రమే గదిలో కాలుపెట్టేవాడు. చడీచప్పుడు చేయకుండా లోపలకెళ్ళి, చిరిగిపోయిన, చివికిపోయిన తన కోటును జాగ్రత్తగా విడిచి మడిచి, నెత్తిపై టోపీని తీసి ప్రక్కన పెట్టేవాడు. అక్కడున్నంతసేపు కొడుకుమీదనుంచి దృష్టి మరల్చేవాడే కాదు. కసురూ, విసురూ, విసుగూ కొడుకుముఖంలో ఏ మాత్రం కన్పించినా, కంఠధ్వనిలో ఏమాత్రం విన్పించినా, అతను గొణుక్కుంటూ, "ఆఁ, ఏమీ లేదు; పోతూపోతూ నిన్నొకసారి చూసిపోదామని వచ్చాలే" అంటూ తక్షణం లేస్తాడు. బిడియమూ, అణకువతొణికిస్తూ చినిగిన తనకోటునూ, చివికిన తనహేట్‌నూ చేతబట్టుకొని, చప్పుడు కాకుండా, పిల్లిమాదిరిగా నడుస్తూ, నెమ్మదిగా తలుపుతీసి, పొందిన ఆశాభంగానికి ఒక చిరునవ్వు మెరిపించి మరీ అతను బయటపడతాడు.

అలాకాక, కొడుకు కనుక సాదరంతో స్వాగతం చెప్పితే, ఇక ఆరోజు అతనికి మహాపండుగే. సంతృప్తితో అతని హృదయం ఉప్పొంగేది. అతనిశరీరంలోని అణువణువూ సంతోషంతో నర్తించేది. స్వర్గానందాన్ని మరిపించే అమందా నందం అనుభవించేవాడు. అతని ముఖం విద్యుత్తేజమై వెలు

గొంతేది. పొక్రొవ్‌స్కీ కనుక కాస్త గద్దిస్తూ మాట్లాడితే, పాపం అతను గభాలున లేచి, న్యాయాధికారిముందు నిలిచిన నేరస్థునిలాగ చేతులు కట్టుకొని, ప్రాధేయపూర్వకంగా, ఆచి తూచి మాట్లాడాలని ప్రయత్నించుతూ చివరకు రసాభాసతో సంభాషణ ముగించేవాడు. పాపం! వట్టి అమాయకుడు. ఏలా మాట్లాడాలో కూడా తెలియదు. ఒకటి చెప్పబోయి మరొకటి అనేస్తాడు. మనసులో బయల్వెడలిన భావ ప్రకంపనలకు సరియైన మాటల రూపం యివ్వటం అతనికి చేతకాదు. చేతులు అటూయిటూ తిప్పుతాడు. ఒకమాట చెప్పి, వెంటనే దానిని సరిదిద్దుకోవాలని ప్రయత్నిస్తూ మరొక తప్పుడు పదం వాడేస్తుంటాడు. లేక లేక ఎప్పుడైనా కొడుకు వేసిన ప్రశ్నకు చక్కని సమాధానం చెప్పగల్గాడా, ఇక అప్పుడు అతని పరిస్థితి చూడాలి. మహా ధీమాగా భుజాలు కాస్త ఎగరేస్తాడు. కాలరు పైకి ఎత్తి, నెక్‌టై సరిచేస్తాడు. కాని, అలాంటి సందర్భాలు చాలా అరుదుగా, నూటికో కోటికో ఒకసారి మాత్రమే సందర్భపడతాయి. అలాంటప్పుడు ఘరానాగా లేచి, సాహసించి, పుస్తకాల అల్మరా దగ్గరకెళ్ళి, అందులోనుంచి ఒక పుస్తకం తీసి, చకచకా పేజీలు తిరగేస్తూ, "చూశావా, పుస్తకాలంటే నాకూ కొట్టిన పిండే" అంటూ కొడుకు ముందు తన ప్రతాపం ప్రదర్శిస్తాడు. కర్మం చాలక, ఒకసారి కొడుకు, తండ్రి మాట్లాడుకుంటూన్నప్పుడు నేను ఆ గదిలోకి వెళ్ళాను. "పుస్తకాల జోలికి పోవద్దని నీ కెన్నిసార్లు చెప్పాలి" అంటూ కొడుకు తండ్రిని గద్దిస్తున్నాడు. పాపం ఆ గద్దింపుతో

అతను కుక్కినపేనై పోయాడు. తప్పుచేసినవాడివలె బాధ పడ్డాడు. ముఖం వెలవెలపోయింది. నేనెక్కడ దానిని గమ నిస్తానో అని, అతను లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ ముసి ముసి నవ్వులు నవ్వుతూ, అంతా సజావుగానే వుందిలే అమ్మాయి అంటూ నన్ను నమ్మింపచేసేందుకు ఎంతో ప్రయత్నించాడు.

తండ్రిని సన్మార్గంలోకి తెచ్చేందుకు పొక్రొవ్‌స్కీ అడపా తడపా పాతికా పరకా పారితోషకం యిస్తుండేవాడు. కనీసం వరుసగా మూడుసార్లు నిషాలో రాకుండావుంటే, తండ్రికి ఏదో ఒక బహుమానం ముట్టజెప్పేవాడు. కొడుకు వద్దనుంచి బహుమానం పొందిన రోజున ఇక అతని సంతో షానికి పట్టపగ్గాలుండేవికావు. ఒక్కొక్కప్పుడు పాపాను, నన్ను ప్రత్యేకంగా పిలిచి, చెరొక ఆపిల్ లేదా మరొక పండో యిచ్చి తనకొడుకు గొప్పతనం మహా గొప్పగా చెప్పు తుండేవాడు. పొక్రొవ్‌స్కీ చెప్పే పాఠాలు శ్రద్ధగావినమనీ తనకొడుకు చాలా వినయసంపన్నుడనీ, సద్గుణసంపన్నుడనీ, చివరకు గొప్ప విద్యా సంపన్నుడనీ మాకు నచ్చజెప్పేవాడు. అతను చెప్పేదంతా ఆసాంతం విని నేనూ, పాపా విరగబడి నవ్వేవాళ్ళం. అతని స్థితిని చూసి అమ్మ ఎంతగానో జాలి పడేది. అన్నాఫ్యోడొరోవ్‌నా అంటే మాత్రం అతనికి మహామంట. ఆమెముందు మాత్రం అతను కుక్కినపేనై పోయేవాడు.

పొక్రొవ్‌స్కీవద్ద నా చదువు సమాప్త మయ్యేదశ వచ్చింది. ఇప్పటికీ అతను నన్నొక చిన్నపిల్ల మాదిరిగానే,

పాపాను చూసినట్టే చూస్తున్నాడు. ఇది నాకెంత మాత్రం యిష్టంలేదు. చెప్ప నలవికాని బాధఏదో నా హృదయంలో వేధిస్తోంది. నేను ఎంతప్రయత్నించినా నా భావాన్ని అతను అర్థం చేసుకోలేదు. అది నాకు మరింత బాధ కల్గించింది. పాఠాలు చెప్పించుకొనేప్పుడు తప్పిస్తే, నేను అసలు అతనితో మాట్లాడేదాన్నే కాదు. ఏకాంతంగా మాట్లాడటానికి అవకాశం చిక్కినా, అతనితో సంభాషించటమంటేనే ఏమిటో నాకు అమితమైన సిగ్గేసేది. నోరువిప్పి మాట చెప్పగల్గేదాన్ని కాదు. ఆ అవకాశంకాస్త చేయిజారిపోయిన తర్వాత, ఏదో ఒకమూలకెళ్లి పొంగుకొచ్చే క్రోధావేశంతో కుళ్ళి కుళ్ళి ఏడ్చేదాన్ని. విచిత్రమైన ఒకానొక సంఘటనే జరగకపోతే, చివరకిది ఎలా పర్యవసించేదో ఎవరికి తెలుసు. ఒకరోజు నాయంత్రి సమయాన అమ్మేమో అన్నా ఫ్యాషారోక్ నా గదిలోవుంది. ఆదేశందు అనుకొని నేను అతని గదిలో జొరబడ్డాను. అతను గదిలో లేడన్న సంగతి నాకు తెలుసు. అయినా గదిలోకెళ్లాను. ఎందుకెళ్లానో మాత్రం నాకు తెలియదు. దాదాపు సంవత్సరంనుంచి యిరుగు పొరుగునే నివసిస్తున్నా, ఇంతకుముం దెన్నడూ నేను యీ పనిచేయలేదు. నా గుండె వేగంగా కొట్టుకొంటోంది. ఆందోళన, కుతూహలం నా హృదయాన్ని పెనవేశాయి. గదిలోకి వెళ్ళి చూస్తినికదా, గదంతా అసహ్యంగా వుంది. ఇక్కడ కొన్ని పుస్తకాలు, అక్కడ కొన్ని పుస్తకాలు పడివున్నాయి. కాగితాలు చెల్లాచెదురుగా విరజిమ్మబడి వున్నాయి. ఆ దృశ్యం చూస్తుంటే నాలో ఒక విచిత్రభావం మెరిసింది: అవును.

నా స్నేహంకోసం, నా అనురాగంకోసం పరితపించవలసిన
గతి అతనికేమిపట్టింది? అతనేమో సకలశాస్త్రాలు అభ్య
సించిన మహావిద్వాంసుడు; నేనేమో చదువూ, చట్టుబండలూ
లేని శుద్ధ తెలివితక్కువ దద్దమ్మని. తూర్పు పడమరలు
ఏమిటో కూడా నాకు తెలియవు. నేనేమీ చదివినదాన్ని
కాదు. పట్టుమని ఒక్కపుస్తకం కూడా గట్టిగా చదివినదాన్ని
కాదాయె. ఆ పుస్తకాల వరుసలను చూస్తుంటే రోషమూ,
ద్వేషమూ రేగాయి. ఆ పుస్తకా లన్నింటినీ కట్టకట్టి ఒకేసారి
చదివేయాలని నిర్ణయించుకొన్నాను. గబగబా, ఒకే బిగువున
సాధ్యమైనంత త్వరగా వాటన్నింటినీ చదివిపారేయాలని దీక్ష
పట్టాను. అతనిలాగానే నేనూ యీ పుస్తకాలన్నీ చదివితే,
అతని స్నేహానికీ, అనురాగానికీ నేను పాత్రురాలను కాగల
ననుకొన్నాను. దుమ్మూ దూళి దట్టంగా పట్టిన ఒక ఉద్గ్రం
థాన్ని తీసి, గుండెలకు అదుముకొని, భయంతో గడగడ
వణికిపోతూ, ఉద్వేగంతో సిగ్గిల్లుతూ గబగబా బయటకు
పరుగెత్తాను. అమ్మ నిద్రపోయిన తర్వాత అర్ధరాత్రి సమ
యాన లేచి, దీపం వెలుతురులో దానిని చదవాలని
నా తలంపు. ఇంతగా ఆశపడి నేను ఆ గ్రంథాన్ని దొంగ
చాటుగా తీసుకెళ్లి, తీరా చదవటానికి తెరిచి చూస్తినిగదా,
నాకేమీ అర్థంకాని లాటిన్ భాషలో వుంది. ఆశాభంగం
మాత్రమే నాకు మిగిలింది. సమయం మించిపోకముందే
దానిని యథాస్థానంలో పెట్టేద్దామని మళ్ళీ గబగబా అతని
గదికి పరుగెత్తాను. అల్మరాలో దానిని వుంచబోతున్న సమ
యంలో వసారాలో పదధ్వని విన్పించింది. దొంగను దొరికి

పోయాను. అతను రానే వచ్చాడు. ఆ తొందరలో, ఆ హడావిడిలో అల్మారాలోని పుస్తకాలు ఒకదానివెంట మరొకటి వరుసగా క్రింద పడిపోయాయి.

ఈ సందర్భంలో ఒకమాట చెప్పాలి: ఇతరు లెవరైనా తన పుస్తకాల జోలికిపోతే, షాక్రొవ్‌స్కీ ఏ మాత్రం సహించలేడు. అలాంటప్పుడు నా మనస్థితి ఎలావుందో వేరే చెప్పాలా? గదిలోనుంచి అమాంతంగా అదృశ్యమైపోతే ఎంత బాగుండుననిపించింది. కాని అది సాధ్యమా? కన్నంలో దొరికిపోయిన దొంగ చందమైంది నా పని. షాక్రొవ్‌స్కీ శివతాండవంలో శివునివలె మహోగ్రరూపం ధరించాడు. "నీకు బుద్ధిలేదూ?" అంటూ బిగ్గరగా అరిచాడు. "ఇన్నేళ్ళొచ్చినా రానిబుద్ధి ఇంకెన్నాళ్ళకొస్తుంది" అంటూ శాపనార్థం పెట్టాడు. అతను వంగి క్రిందపడిపోయిన పుస్తకాలను తీయబోయాడు. నేను అతనికి సాయపడబోయాను. "చాలు నీసహాయం. పిలవని పేరంటానికి తగుదునమ్మాఅంటూ తయారు కాకు" అంటూ అతను నా ముఖంలోకి చూశాడు. నాలోని అమాయకత్వం అతని హృదయాన్ని ద్రవీభూతం కావించినట్టున్నది. నా మొఖం చూసి జాలిపడ్డాడు. అతని కంఠంలో కరుకుతనం మెతకతనంగా మారి, హుంకరింపులు మందలింపులుగా పరిణమించాయి. "ఇదేమిటమ్మా, నీవే ఆలోచించు. నీవు పసిపాపవు కాదే; చిన్నపిల్లవి కాదే. యుక్తవయస్సు వచ్చిన దానివి, నీకీ పని తగునా? చెప్పు" అంటూ చిన్న పాఠం దంచాడు. నా ముఖంలోకి తీక్షణంగా చూశాడు. అతని మొఖం కందగడ్డయింది. అదేమిటో నాకు అర్థంకాలేదు.

నివ్వెరబోయాను. నాకు మరింత దగ్గరగా వచ్చి నిలబడ్డాడు. ఏమిటేమిటో మాట్లాడాడు. మొదటి వాక్యానికి, రెండో వాక్యానికి సంబంధమే లేదు. క్షమాపూర్వకంగా నన్ను వేడుకొంటున్నా డనిపించింది బహుశా అతను ఆ క్షణంలో ఆ విషయం గుర్తించివుండడు; నేను యౌవ్వనం తొణికిస లాడుతున్న మగువనన్న విషయం అప్పుడు నాకు అర్థమైంది. ఆ క్షణంలో నేను ఎలా ప్రవర్తించానో నాకు గుర్తులేదు. అతనికన్నా నేనే ఎక్కువగా సిగ్గుపడివుంటాను. ముప్పిరిగొన్న సిగ్గుతో ఉక్కిరిబిక్కిరై, చేతులతో ముఖాన్ని కప్పేసుకొని, ఒక్క పరుగుతో ఆ గదిలోనుంచి బయటపడి మా గదిలో వాలిపోయాను.

ఈ అవమానంనుంచి ఎలా బయటపడాలో నాకు తెలియ లేదు. కన్నంలో దొంగ వలె దొరికిపోవటమా! మూడురోజులదాకా అతని మొఖం చూడలేకపోయాను. అవ మానభారంతో కన్నీరు జలజల రాలేవి. నా మనస్సులో ఆలోచనలు పరిపరివిధాల పరుగెత్తేవి. నాలో రేగిన సవాలక్ష ఊహాలలో ఇదొకటి: సరాసరి అతనివద్దకే వెళ్ళి, ఉన్నది ఉన్నట్టు, జరిగింది జరిగినట్టు చెప్పేస్తేపోలా అనిపించింది. నిజం చెప్పి, అతనికి నచ్చజెప్పవచ్చు అనుకొన్నాను. కాని ధైర్యం చాలిందికాదు. తీరా అతనిదగ్గరికి వెళ్లిన తర్వాత ఎటుతిరిగీ నాకు నోరుపెగలదు. అంతవరకు ఖాయం. అదంతా తలుచుకొంటే ఇప్పటికీ నాకు సిగ్గేస్తుంది.

ఆ ఘటన జరిగిన తర్వాత కొద్దిరోజులకే మా అమ్మకు పెద్ద జబ్బు చేసింది. మంచం పట్టింది. మంచం పట్టిన మూడో

నాటిరాత్రి అమ్మకు విపరీతమైన జ్వరం కాచింది. దానితో సంధి ప్రలాపాలు ప్రారంభమయ్యాయి. అహర్నిశలు అమ్మ మంచం వద్దనే జాగరణ చేయవలసివచ్చింది. అమ్మకు మందూ, మాకూ, మంచినీళ్లూ యిస్తూ రేయింబవళ్ళూ కంటిమీద కునుకులేకుండా గడిపాను. అలా రెండు రాత్రులు నిద్ర లేకపోయేసరికి నావంట్లో జవసత్వాలన్నీ ఉడిగిపోయాయి. కూర్చున్నచోటనుంచి లేవలేని స్థితి ఏర్పడింది. కళ్ళు తిరగటం ప్రారంభమైంది. నిద్ర తోసుకువస్తోంది. కళ్ళు మూత పడుతున్నాయి. అమ్మ రోదనలు, మూలుగులుగాని లేకపోతే, కూర్చున్నదానిని కూర్చున్నట్టే మైమరచి నిద్రపోయేదాన్ని. అనుక్షణం కునుకుపాటులనుంచి ఉలిక్కిపడి లేచేదాన్ని. మళ్ళీ కొద్ది క్షణాలకే కునుకుపాట్లు పడుతుండేదాన్ని. నిజంగా అదొక చిత్రహింస. అలాంటి చిత్రహింసలు పగవాడికికూడా వద్దుబాబు! అదేమిటో తెలియదు; సరిగా గుర్తులేదు కూడా. ఆ కునుకుపాట్లలోనే భయానకమైన కల కన్నాను. ఉలిక్కిపడి లేచాను. గదంతా చీకటిగా వుంది. గుడ్డిలాంతరు మాత్రం వెలుగుతోంది. విపరీతమైన భయం నన్ను ఆవహించింది. గుండెల్లో దడ. భరింపరాని, వర్ణింపనలవికాని బాధతో కుర్చీపైనుంచి గబాలున లేచి, గావుకేక పెట్టాను. దడాలున తలుపు తెరచుకొంది. పొత్రొవ్‌స్కీ లోన ప్రవేశించాడు. మళ్ళీ నాకు స్పృహ వచ్చేసరికి నేను అతని బాహువులమధ్య వాలిపోయి వున్నాను. అతను నెమ్మదిగా నన్ను లేవనెత్తి కుర్చీలో కూర్చోబెట్టాడు. గ్లాసుతో

మంచినీళ్ళు తెచ్చియిచ్చాడు. ప్రశ్నపై ప్రశ్న వేశాడు. ఆ ప్రశ్నలకు నే నేమి సమాధాన మిచ్చానో నాకు గుర్తులేదు.

"నీకు జ్వరం తగిలినట్టున్నది" అంటూ అతను నాచేతిని తీసుకొని, నాడీపరీక్ష చేశాడు. "అనవసరంగా నీ ఆరోగ్యాన్ని పాడుచేసుకోకు. కాస్త విశ్రాంతి తీసుకో. పోయి పడుకో. రెండు గంటలతర్వాత మళ్ళీ నిన్ను లేపుతాను. నామాట విని పోయి పడుకో". నేను చెప్పేది విన్పించుకోకుండానే అతను పదే పదే పోరుపెట్టాడు. అలసటతో తూలి, వాలిపోయే స్థితిలో వున్నాను. పోనీ కుర్చీలోనే కాస్త కునుకు తీద్దామని నడుంవాల్చాను. అంతే. ఆ గాఢనిద్రనుంచి తెల్లవారిన తర్వాత పాక్రొవ్‌స్కీ నన్ను తట్టి లేపితేకాని లేవలేదు. అప్పుడైనా అతను నన్ను లేపకనేపోవును. కాని, మా అమ్మకు మందు యివ్వవలసిన సమయంఅది. ఏమందు యివ్వాలో ఏమందు ఎక్కడుందో అతనికి తెలియదు. అందుకే నన్ను లేపాడు. మరుసటి రాత్రి, అమ్మ మంచంప్రక్కనే కూర్చొని, ఏమైనాసరే ఇవాళ రాత్రి నిద్రపోకూడదని తీర్మానించు కొన్నాను. సరిగా పదకొండు గంటలవేళ పాక్రొవ్‌స్కీ వచ్చి తలుపు తట్టాడు. లేచి వెళ్ళి తలుపు తీశాను: "ఒంటరిగా కూర్చుంటే నీకు ప్రొద్దు ఎలా గడుస్తుంది" అంటూ అతను గదిలో ప్రవేశించాడు. "ఇదిగో, ఈ పుస్తకం చదువుకుంటూ కూర్చో. పొద్దుగడుస్తుంది" కృతజ్ఞతాభావంతో నేను దానిని స్వీకరించాను. ఆ పుస్తకం ఏమిటో నే నసలు దానిని చదివానో లేదోకూడా నాకు గుర్తులేదు. కాని ఒకటి మాత్రం నిజం. ఆ రాత్రంతా నా కంటిపై కునుకులేదు. నాలో ఒక

విధమైన ఆత్మోన్నతభావం ఉత్పన్నమైంది. నిలకడగా ఒక చోట కూర్చోలేక పోయాను. గదిలో అటూ ఇటూ పచార్లు చేశాను. ఒక విధమైన సంతోషం, సంతృప్తి పొందాను. నన్ను గురించి అతను పట్టించుకొన్నందుకు, అంతగా ఆందోళన చెందుతున్నందుకు నే నెంతో ఇదయి పోయాను. ఆ రాత్రంతా మధుర స్వప్నాలు కంటూ, మధురభావనలు పొందుతూ పొద్దుబుచ్చాను. ఆ రాత్రి అతను మళ్ళీ రాలేదు. రాడన్న సంగతి నాకు తెలుసు. మరుసటిరోజు రాత్రి వస్తాడా, రాడా?

మరుసటిరోజున రాత్రి తొమ్మిదిగంటల వేళ, అంతా నిద్రపోతున్న సమయంలో, పొక్రోవ్‌స్కీ తనగది తలుపు తెరచుకొని బయటకొచ్చి, వాకిట్లో నిలబడి నాతో సంభాషణలు ప్రారంభించాడు. మేమిద్దరం అప్పుడు ఏమేమి మాట్లాడుకొన్నామో నాకు ఒక్క-ముక్క-కూడా జ్ఞాపకం లేదు. వల్లమాలిన సిగ్గు నన్ను ఆవహించింది. ఒకమాట చెప్పబోయి మరొకమాట చెప్పాను. నాలిక కరుచుకొన్నాను. ఆరి భగవంతుడా యీ సంభాషణ ఎప్పుడు ముగుస్తుందా అనుకొన్నాను. తొందరగా ముగిస్తే ఎంత బాగుండును అనిపించింది. అతనితో మాట్లాడాలనీ, అతని కెదురుగా కూర్చొని కులాసా కబుర్లు చెప్పుకోవాలనీ, సరసల్లాపాలు సాగించాలనీ పరితపిస్తున్న నేను, ఆరాటపడుతున్న నేను తీరా ఎదురుగా అతను ప్రత్యక్షమయ్యేసరికి, మరొకలా అనిపించటం ఆశ్చర్యమే మరి! ఆనాటినుంచి మా యిద్దరిమధ్య స్నేహం ప్రారంభమైంది. మా అమ్మ జబ్బు నయంఅయ్యేదాకా, మేమిద్దరం

ఎన్నో రాత్రులు అలా కలసిమెలసి గడిపాం. క్రమంగా నాలోని సిగ్గు అదృశ్యమై పోసాగింది. అయినా అతనిముందు మాటాడటమంటే, అదోమాదిరిగానే వుండేది. ఆ పాడు పుస్తకాలగొడవ అతను మరచిపోతున్నందుకు నేను లోలోన సంతసించాను. ఒకసారిమటుకు ఆ పుస్తకాలగొడవ ప్రస్తావించాడు. అదేమిటో ఆక్షణంలో మనసులో విషయం మనసు విప్పి చెప్పాలని బుద్ధిపుట్టింది. అతనిముందు ఒప్పేసుకున్నాను. చదవాలన్న తృష్ణకొద్దీ నే నాపని చేశానని చెప్పాను. ఆ మాట చెప్పతుంటే నా కళ్ళంట నీళ్ళు తిరిగాయి. రెండు మూడు కన్నీటి బిందువులు నేలరాలాయి కూడా. దాపరికంలేకుండా అన్నివిషయాలు ఏకరువుపెట్టాను. నీతో స్నేహంచేయాలనీ, నీ బాగోగులు చూసే బాధ్యత నెత్తినేసుకోవాలనీ, నామాటకు ఎదురుచెప్పరాదనీ, నీ మనస్సుకు కష్టం కల్గించ కూడదనీ, నీకు సంతోషం, సంతృప్తి, సౌఖ్యం సమకూడే విధంగా వ్యవహరించాలనీ ఆరాటమందాను-అని నేనుచెప్పతుంటే అతః ముఖం అదోమాదిరిగా మారిపోయింది. ఆశ్చర్యం, సిగ్గుమిళితమై మెరిశాయి. అతను నోరెత్తి సలకలేదు. అతని పలుకుకోసం పరితపించిన నేను ఆశాభంగం పొందాను. నామనస్సు చివుక్కుమంది. అతను నన్ను సరిగా అర్థం చేసుకోలేదు; బహుశా నామాటలకు అతను లోలోన నవ్వుకుంటున్నాడేమోకూడా - అనుకొంటూ భోరున ఏడ్చాను. నా కన్నా పసివాళ్ళే నయం. పొర్లుకొస్తున్న దుఃఖాన్ని ఎంత ఆపుకొందామన్నా ఆగిందికాదు. అతను నా రెండుచేతులు పట్టుకొని, ముద్దెట్టుకొని, తన గుండెలకు హత్తు

కున్నాడు. గొణుగుతూ నన్ను సముదాయించాడు. అతని హృదయం కరిగి నీరైపోయింది. ఆనాడు అతనేమన్నాడో నాకు సరిగా గుర్తులేదు. నేను ఏడ్చాను. నవ్వాను. మళ్ళీ ఏడ్చాను. నా చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. ఆనాడు పొందిన మహానందం వర్ణనాతీతం. అతను ఆందోళన చిత్తుడై వున్నట్టు, మొత్తం మీద కొంత యిరకాటంలో పడి కొట్టుకుంటున్నట్టు కని పెట్టాను. బహుశా అతను పొందిన ఆశ్చర్యమే అందుకు కారణం కావచ్చు. ఉన్నట్టుండి నేను పెద్దఆరిందాలాగా మాట్లా డానాయె. నే నెంత నిష్కల్మషహృదయంతో అతని మైత్రిని వాంఛిస్తున్నానో అతను గ్రహించివుంటాడు. రెండు మనస్సులు లీన మయ్యాయి. ఆహా! స్వర్గధామం చేరినట్టనిపించింది. స్వర్గసౌఖ్యం అనుభవించాను. ఏమాటకు ఆమాటే చెప్పాలి- రానురాను, అనుదినం అతను నాకు సన్నిహితుడయ్యాడు. నా స్నేహం అతనికీ సంతోషదాయకమే అయిందని చెప్పాలి.

మధురాతి మధురమైన ఆ దినాలలో, ఆందోళనా భరితమైన ఆ రోజులలో మే మిద్దరం మనసు విప్పి మాట్లాడు కోని విషయమే లేదు. మా అమ్మ మంచం ప్రక్కనే, దీపం ముందర పెట్టుకొని, ఏవేవో విషయాలు, ఎన్నెన్నో విష యాలు ముచ్చటించుకొన్నాం. మా ఊహాకందిన విషయాలు మా హృదయాలలో చెలరేగిన భావాలు - అన్నీ ప్రస్తుతాలే; చర్చనీయాంశాలే. ఆ ముచ్చటలు ఎంత ముచ్చటగొలిపా యని! ఆ రోజులు ఒకవిధంగా సంతోషం, సంరంభం పండిన దినాలు. మరొకవిధంగా శోకానలం రేగిన రోజులు. ఆ రోజులు గుర్తుకొస్తే మధురానుభూతులు, విరహవేదనలు - ఆమాట

కొస్తే స్మృతులు - అవి ఆనందదాయకమైనవైనా సరే, లేక విచారకరమైనవైనా సరే - బాధాకరంగానే వుంటాయి; కనీసం నాకు సంబంధించినంతవరకు అంతే. అయితే ఆ గాథలో కూడా ఒకవిధమైన ఆనందం వుంది. మనోవేదన ముప్పిర గొన్నప్పుడల్లా, స్మృతులను తలుచుకొంటే, హృదయభారం తగ్గిపోతుంది. గుండె తేలికపడుతుంది. మిట్టమధ్యాహ్నం సూర్యుని వేడికి వాడిపోయిన లేత చిగుళ్ళపై సాయంత్రం పూట చారెడు చన్నీరు చల్లితే ఆ చిగుళ్ళు ఎలా కిలకిల లాడుతూ, కళకళలాడతాయో నా మనస్సూ అలాగే ఊరట చెందుతుంది.

అమ్మ నెమ్మదిగా కోలుకొంటోంది. అయినా ఆమె మంచంప్రక్కనే నేను కూర్చోక తప్పటంలేదు. ప్రోక్రొవ్‌స్కీ తరచు పుస్తకాలు తెచ్చి నాకిస్తుండేవాడు. నిద్రపోకుండా మేల్కొనేందుకు మొదట పుస్తకాలు చదవసాగాను. రాను రాను గ్రంథపఠనానికి అలవాటుపడిపోయాను. ఎంత చదివినా తనివితీరని తృష్ణ నాలో బయలుదేరింది. పుస్తకాలు చదివే కొలదీ కొత్త కొత్త విషయాలనేకం బుర్రలోకి ధారావాహి కంగా ప్రవేశించాయి. వినూత్న భావోద్దీపన కల్గింది. తేనెటీగ లవలె నా మనస్సును ముసిరిన, ముట్టడించిన కొత్తభావాలతో నా హృదయం బరువెక్కింది; ఉక్కిరిబిక్కిరి అయింది. భావం ఎంత జటిలంగా వుంటే ఆస్వాదన అంత మధురంగా వుండేది. తేనెలూరించేది. నా హృదయ వీధులలో జొరబడిన భావ సముజ్జ్వలం గిలిగింతలు పెట్టించింది. అదృష్టవశాత్తు అన్ని భావాలు ఒకేసారి నా హృదయంపై ముప్పేట ముట్టడి

సాగించినప్పటికీ నేను తలక్రిందులు కాలేదు. వశం తప్పలేదు. ఊహాల ఉయ్యాలలో తూలుతూ, తేలిపోయాను. అంతే. మా అమ్మ ఆరోగ్యం పూర్తిగా కోలుకున్న పిమ్మట, సంధ్యా సమయాలలో మా కలయికలు, ముచ్చటలు ఆగిపోయాయి. మేము ఏమి మాట్లాడుకొన్నా, అందులో స్పష్టతకన్నా నిగూఢతే జాస్తిగా వుండేది. మా ముచ్చటలు అర్థవంత మైనవిగా కనిపించకపోవచ్చు; కాని వాటిలో ఎంతో అంత రార్థం వుండేది. ఆ కొలది వారాలలోనూ నేను అనిర్వచనీయ మైన ఆనందం, బ్రహ్మానందం పొందాను.

ఒక రోజున పాక్రొవ్‌స్కీ తండ్రి వచ్చాడు. యథా ప్రకారం వసపిట్టలాగా మాటల మూటలు విప్పాడు. అతను ఆ రోజున మహా హుషారుగా కూడా వున్నాడు. నవ్వాడు. నవ్వించాడు. మురిసిపోయాడు. మురిపించాడు. తన సంతో షానికి కారణమేమిటో చివరకు బయటపెట్టాడు: వారం రోజుల్లో తన కొడుకు పుట్టినరోజు పండుగ వస్తోందట. ఆ సం దర్భంలోనే తన బిడ్డను కలుసుకోబోతున్నాడట. అబ్బాయి పుట్టినరోజు పండుగనాడు, తన భార్య కుట్టిపెట్టుతానని వాగ్దానం చేసిన కొత్తకోటునూ, బూట్లనూ ధరిస్తాడట. ఒక్క మాటలో చెప్పాలంటే, అతను మహా సంబరపడిపో తున్నాడు.

పాక్రొవ్‌స్కీ పుట్టినరోజు పండుగ! అహోరాత్రాలు ఆలోచించాను. పుట్టినరోజు పండుగ సందర్భంలో అతనికి నేనూ ఒక బహుమతి యిస్తాను. స్నేహచిహ్నంగా దానిని సమర్పిస్తాను. అయితే ఆ బహుమతి ఏమైతే బాగుంటుందని

ఆలోచించగా ఆలోచించగా ఎట్టకేలకు తట్టింది; మంచి పుస్తకాలకోసం పరితపించే పొక్రొవ్‌స్కీకి పుష్కిన్ రచనల సంపుటిని బహుమతిగా యిస్తే చాలా బాగుంటుంది. అందులోనూ పుష్కిన్ రచనలంటే అతనికి మహా యిష్టం. అందుచేత పుష్కిన్ సంపుటిని సంపాదించి, బహూకరించాలి. కుట్టుపని ద్వారా సంపాదించి, ఆదాచేసిన డబ్బు ముప్పయి రూబుళ్ళు దాకా నాదగ్గర వుంది. అమ్మనుకూడా అడగవలసిన పనిలేదు. వంటమనిషి మాత్రోవ్‌నాను బజారుకు పంపించాను; ఆ సంపుటి ధర ఎంతో తెలుసుకురమ్మని. ఆ ముసల్ది వెళ్ళి ధర కనుక్కొచ్చింది. పదకొండు పుస్తకాలు కలిసి వెరశి 60 రూబుళ్ళని తెల్పింది. అమ్మబాబో, అంత డబ్బు సంపాదించటం ఎట్టా? ఆలోచించాను. అదేపనిగా ఆలోచించాను. ఏమీ పాలుపోలేదు, అమ్మనా అడగలేను. అడిగితే కాదన దనుకోండి. అయినా ఇలాంటి విషయాలలో అమ్మను డబ్బడగటం ఏమి బాగుంటుంది? ఇందుకోసం అమ్మను డబ్బడిగితే పదిమందికీ తెలిసిపోతుంది. బహుమతి విశేషం కాస్తా ఎగిరిపోతుంది. గురుకట్నంగా యిచ్చానని అందరూ అనుకొంటారు. పదిమందీ అలా అనుకోవటం నాకు ఏమాత్రం ఇష్టం లేదు. ఆ బహుమతి కేవలం నాదిగానే వుండాలి. నా కోసం అతను ఎంత కష్టపడ్డాడు. అతని రుణాన్ని తీర్చుకోవటం ఈ జన్మలో నాకు సాధ్యమా? స్నేహాన్ని మించిన విలువైన వస్తువ ఈ ప్రపంచంలో మరొకటి లేదు. స్నేహ చిహ్నమే నా బహుమతి. ఎట్టకేలకు పరిష్కార మార్గం కన్పించింది.

పాత పుస్తకాలు ఎక్కడ అమ్మేది నాకు తెలుసు. కొత్త పుస్తకాలే సరాసరి ముద్రణాలయంనుంచి ఆ అంగడికి వస్తాయన్న సంగతి నాకు తెలియనిదికాదు. సరిగా బేరంచేస్తే సరికొత్త పుస్తకాలే అక్కడ సగంధరకు దొరుకుతాయి. సరే, ఆ పాత పుస్తకాల అంగడికి వెళ్ళాలని తీర్మానించుకున్నాను. మరుసటి రోజునే అవకాశం దొరికింది. అమ్మకేమో ఆరోజున ఆరోగ్యం సరిగా లేదు. అన్నాఫ్యోడొరోవ్‌నా అమిత బద్ధకస్తురాలు కనుక బజారుకు బయలుదేరదు. కనుక సరుకుల బేరం చేసి యింటికి తెచ్చే బాధ్యత నా నెత్తిమీద పడింది. ఇదే సందు అనుకొని బయలుదేరాను.

వంటమనిషి మాత్రోనావ్‌నాను వెంటబెట్టుకొని బజారుకు వెళ్ళాను. అదృష్టవశాత్తు అనుకొన్నట్టే, కావలసిన పుస్తకం, చాలా చక్కని పుస్తకం, ఆ అంగడిలోవుంది. బేరంచేయటం ప్రారంభించాను. మొదట ఆవ్యాపారి అసలుధరకుమించిన వెల చెప్పాడు. కిందబెట్టి మీదబెట్టి ఎట్లాగైతేనేం సగానికి పైగా దిగొచ్చాడు. బేరంచేయటం ఎంత విచిత్రంగా వుంటుందని! మోసానికి మారుపేరే వ్యాపారమా అనిపిస్తుంది. ఆ పుస్తకం కోసంనేనింతగా ఎందుకు పరితపిస్తున్నానో పాపం మాత్రోనావ్‌నా గ్రహించలేదు. అందుకే వెర్రిమొగం వేసుకొని, నోరెళ్ళబెట్టి చూస్తోంది. ఇంతకీ నాదగ్గర ముప్పయి రూబుళ్ళు మాత్రమే వున్నాయి. చచ్చిగీపెట్టినా 35 రూబుళ్ళకు దమ్మిడీ తక్కువైతే పుస్తకం యిచ్చేదిలేదని ఆవ్యాపారి భీష్మించాడు. నేను ప్రాధేయపడగా, ప్రాధేయపడగా చివరకు రెండు రూబుళ్ళు తగ్గించటానికి అంగీకరించాడు. "గిట్టకపోయినా

నీకుకనుక యిస్తున్నాను, ముద్దులొలికే నీ ముఖంచూసి ఇస్తున్నాను. ఈ ప్రపంచంలో మరెవరొచ్చినా చచ్చినా దమ్మిడీ తగ్గించేవాడిని కాదు" అంటూ ఆ వ్యాపారి ఏమేమో ఏకరువ పెట్టాడు. అన్నింటికీ ఊఁ కొట్టి ఊరుకోవలసి వచ్చింది. అయినా ఇంకా మూడురూబుళ్ళు సంపాదిస్తేకాని, అతను చెప్పిన మొత్తం భర్తీకాదు. ఏమిచేయాలో తోచిందికాదు. నిజం చెప్పొద్దూ, ఏడ్పువచ్చినంతపనయింది నాకు. అదృష్ట దేవత కటాక్షించినట్టున్నది; ఊహించని ఘటన జరిగింది. ఆపదనుంచి బయట పడగలిగాను.

అక్కడికి సమీపానే గల మరొక పుస్తకాల షాపు ముందు పోక్రొవ్‌స్కీ తండ్రి నిలబడి బేరం చేస్తూండటం చూశాను. బ్రతికిపోయాను భగవంతుడా అనుకొన్నాను. అతని చుట్టూ నలుగు రైదుగురు పుస్తకాల వ్యాపారులు చేరి "నా పుస్తకం కొనమంటే నా పుస్తకం కొనమని" వేపుకు తింటున్నారు. ప్రతీ వ్యాపారి తన పుస్తకాల ప్రాశస్త్యం గురించి గొప్పగా చెప్తున్నాడు. ఏమి పుస్తకాలు! ఏమి పుస్తకాలు!! అతనికి అన్నీ నచ్చాయి. అన్నీ కొనదగ్గవిగానే వున్నాయి. దేనిని ఎంచుకోవాలో తెలియక అతను తికమక పడిపోతున్నాడు. నెమ్మదిగా నేను అతని దగ్గరి కెళ్లాను. ఏమిటీ కొంటున్నావు అని ప్రశ్నించాను. నన్ను చూడగానే అతనికి ఎక్కడలేని సంతోషం కల్గింది. అతనికి నేనంటే ఎంతో అనురాగం. బహుశా తన కొడుకుని ఎంత ప్రేమ పూర్వకంగా చూసుకుంటాడో, అంతే వాత్సల్యం నా విషయంలోను ప్రదర్శిస్తాడు. "పుస్తకాలు అమ్మాయి,పుస్తకాలు.

పుస్తకాలు కొంటున్నాను. అబ్బాయి పుట్టినరోజు పండుగ వస్తోందిగా. అందుకని అబ్బాయికి పుస్తకాలు కొంటున్నాను." అంటూ సంబరపడుతూ సమాధాన మిచ్చాడు. అసలు అతని మాటలు ఎప్పుడూ విచిత్రంగానే వుంటాయి. అందు లోను ఇప్పుడు కొంచెం తికమకలోపడి వున్నాడేమో, అందు చేత అతని సమాధానం మరింత చోద్యంగా వుంది. అతనికి ఏ పుస్తకమైనా ఒకటే; ధరమాత్రం ఒకటి, రెండు, మహా అయితే మూడు రూబుళ్లకు మించకుండా వుంటే చాలు. పెద్దపెద్ద పుస్తకాల జోలికి అసలు అతను పోనేపోడు. వాటి ధర అడగనే అడగడు. ఒకవేళ ఏదైనా లావుపాటి పుస్తకం తీసి చూచినా, వెంటనే జాగ్రత్తగా దానిని యథాస్థానంలో వుంచేస్తాడు. "వద్దు, వద్దు. దాని ధర చాలా హెచ్చు" అంటూ గొణుకుతాడు. "మరి అవో" అంటూ మాస పత్రికలు, పాటల పుస్తకాలు, ఎందుకు పనికిరాని చెత్తపుస్తకాలు చూపమంటాడు. అవైతే చౌకగావస్తాయని అతనికి తెలుసు. "ఈ చెత్తపుస్తకాలు కొనకేం ?" అన్నాను. "అలా అనకమ్మా, ఇవి చాలా మంచివి. నీకు తెలియదు; చాలా మంచివిలే." అంటూ తడబడుతూ జవాబిచ్చాడు. మంచి పుస్తకాలు కొనటం మంచిదేకాని, అంత ధరపెట్టి నేను ఎక్కడ కొన గలను అంటూ పేదమొఖం పెట్టాడు. "సరే, ఇంతకీ నీదగ్గర ఎంత డబ్బు వుందేమింటి ?" అని అడిగాను. "డబ్బా!" అంటూ అతను తన జేబులోనుంచి కాగితంతో చుట్టిన చిల్లరడబ్బులు తీశాడు. ఎన్నిసార్లు లెక్కవేసినా ఆ చిల్లర మూడున్నర రూబుళ్ళకు మించలేదు. నేను అతనిని గబగబా లాక్కుంటూ

పాత పుస్తకాలు అమ్మే అంగడికి తీసుకొచ్చాను. "ఇదిగో ఈ పదకొండు పుస్తకాల ధర 33 రూబుళ్ళు. ఇదిగో నావద్ద ముప్పయి రూబుళ్ళు వున్నాయి. నీదగ్గర డబ్బుకూడా దీనికి జతజేసి ఈ పదకొండు పుస్తకాలు కొందాం. మనిద్దరి తరఫునా ఈ పుస్తకాలను బహూకరిద్దాం. ఏమంటావ్ ?" అతను ఎగిరి గంతేశాడు. తన జేబులో డబ్బు గబగబాతీసి పుస్తకా వ్యాపారి ముందర పెట్టాడు. మొత్తం డబ్బు ముట్టిన తర్వాత ఆ వ్యాపారి దాదాపు మణుగు బరువుగల ఆ పదకొండు పుస్తకాలను అతని చేతుల్లో పెట్టాడు. "సరేనమ్మా, వీటిని రేపు భద్రంగా పరులకంట పడకుండా మీ యింటికి చేరుస్తాలే తల్లీ" అంటూ అతను వెళ్లిపోయాడు.

## 3

మరుసటి రోజున అతను తనకొడుకును చూడటానికి వచ్చాడు. యథాప్రకారం గంటసేపు కొడుకుతో గడిపి, మావద్దకు వచ్చాడు. అతను కూర్చొన్న తీరు, అతను వ్యక్తంచేసే హావభావాలు చూస్తుంటే నవ్వొస్తుంది. అతను గమ్మత్తుగా నవ్వాడు. ఏదో రహస్యం తనవద్ద వున్నట్టు పోజు పెట్టాడు. ఆ రహస్యం త్వరగా చెప్పేయాలన్న ఆతురత ప్రదర్శించాడు. చేతులు నలుపుకుంటూ చెప్పాడు: నిన్న కొన్న పుస్తకాలను రహస్యంగా మా వంటగదిలోకి చేర్చినట్టూ, మాత్రోవ్‌నా అదుపాజ్ఞలలో వాటిని భద్రంగా దాచినట్టూ చెప్పాడు. అటుతర్వాత మా సంభాషణ పుట్టిన

రోజు పండుగ పైకి మళ్లింది. బహుమతి ప్రదానం ఏవిధంగా జరగబోతున్నదో అతను సవివరంగా, పూసగుచ్చినట్లు చెప్పాడు. అతను మాట్లాడే తీరునుబట్టి, ఏదో చెప్పాలను కొంటూ చెప్పలేక పోతున్నట్టు నేను గమనించాను. మనసు లోని మాటను వెల్లడించటానికి సాహసించలేక పోతు న్నాడు. నే నేమీ అనలేదు. అతను చెప్పేదాని కంతకూ ఊఁకొట్టుతూ, ఊరుకున్నాను. పోను పోను అతని మొఖంలో ఒకవిధమైన ఆందోళన ఇరకాటస్థితి ద్యోతక మైంది.

చివరకు భయపడుతూ, బిడియపడుతూ "సర్వారా అతెగ్జియేనా" అంటూ ప్రారంభించాడు. "నే నొక విషయం చెప్పాలనుకొంటున్నాను. చెప్పమంటావా?" అని నా సమా ధానంకోసం ఆగిపోయాడు. "సరే జెప్ప"మన్నాను. "ఆఁ, ఏమీలేదు. ఇలా అయితే ఎలా వుంటుందో ఆలోచించు. నీ తరఫున పది పుస్తకాలు బహుమతిగాయివ్వ. పోతే మిగి లిన ఆ ఒక్క పుస్తకం నాతరఫున చదివిస్తాను. చూశావు, నీవు బహుమతి యిచ్చినట్టు అవుతుంది; నేను ఒక బహుమతి యిచ్చినవాణ్ణి అవుతాను. ఏమంటావ్? మనిద్దరం బహు మతులు యిచ్చినట్టు అవుతుంది ......" అని చెప్పి వూరుకొన్నాడు. నా తీర్పుకోసం కొండంత ఆశతో ఎదురు చూస్తున్నాడు. "మనిద్దరం కలిసే ఆ బహుమతి చదివించ వచ్చుగా" అన్నాను. "అలాగే చేయవచ్చుననుకో. అయినా చూశావూ, అసలు విషయం ఏమిటంటే...... "అంటూ నత్తులు కొట్టుతూ, వాక్యాన్ని ముగించలేక పోయాడు.

మాటలకోసం తడుముకొంటున్నాడు. ముఖం కంద గడ్డలా మారిపోయింది.

"విషయ మేమిటంటే......" అంటూ అతను అతి ప్రయత్నంమీద మళ్ళా మొదలెట్టాడు. "ఏమిటోనమ్మా, అదేమిటోగాని నేను అప్పుడప్పుడు అనుకొంటూనే వుంటా. ఈ దుర్వ్యసనం పాడుగాను. అయినా చూశావ్వా, ఇతరులు నన్ను తోటకూరలో పురుగును చూసినట్టు చూస్తారు; ఏదో ఒక మనోవేదన ఉండనే వుంటుంది. లేదా మనస్థితి బాగా వుండదు. నీ కన్నీ తెలుసుగా, అందుచేత ఒకచుక్క పడనిదే తాళలేను. ఇది అబ్బాయికి బొత్తిగా నచ్చదు. నేను చుక్క వేశానని తెలిస్తేచాలు, అబ్బాయి మండిపడతాడు; పడతిడతాడు. నాకు నీతులు వల్లిస్తాడు. అందుకని, నేను బహుమతి యిస్తినా, నేనూ క్రమంగా బాగుపడుతున్నానని అబ్బాయికి నమ్మిక ఏర్పడుతుంది. చాలా కాలంగా డబ్బు ఆదాచేసి ఈ పుస్తకం కొని తెచ్చాననుకొంటాడు. నాకు దమ్మిడీ ఆదాయం లేదన్న సంగతి వాడికి తెలుసుగా. ఎప్పుడన్నా నాలుగు డబ్బులువస్తే, వాడి చేతినుంచే రాలేది. అది వాడికీ తెలుసు...... అందుచేత నేను బహుమతి యిస్తే వాడు సంతోషిస్తాడమ్మా."

అతని ముఖం చూస్తే నాకు జాలేసింది.

"పోనీలే, మొత్తం పుస్తకాలన్నీ నీ పేరుతోనే చదివించు."

"అన్ని పుస్తకాలు నా పేరుతోనే చదివించమంటావా?"

"ఓ, అన్నింటిని కలిపి నీవే బహుమతిగా యివ్వు."

"నిజంగా ?"

"నిజంగానే"

ఎంతో సేపటికిగాని అతనికి నేను చెప్పింది అర్థం కాలేదు.

అతను స్వాప్నిక జగత్తులో తేలిపోతూ గొణిగాడు ;

"మంచిదే. అద్భుతం. అపూర్వం. సరేగాని, మరి నీసంగతో......మరి నీవేమి చదివిస్తానమ్మా ?"

"నేను ఏ బహుమతి యివ్వను. యివ్వక పోతేనేం ?"

"ఏమీ యివ్వవా ?" అతను భయకంపితు డయ్యాడు.

అందుకు అతను అంగీకరించ లేదు. అతనిది వెన్నవంటి మనస్సు. నేనెంతో నచ్చజెప్పాను.

"నీవూ, నీ కొడుకు సంతోషించటం కన్నా నాకు కావలసిం దింకేముంది చెప్పు ?"

చివరకు అతను మహా సంతోషంతో అంగీకరించాడు. మాతో గడిపిన రెండు గంటలూ చిన్నపిల్లవాడివలె, హుషారుగా అటూ యిటూ తిరుగాడుతూ; గంతులేస్తూ, నవ్వుతూ నవ్విస్తూ, పాపాతో ఆటలాడుతూ, నన్ను ముద్దాడుతూ, అవకాశం చిక్కినప్పుడల్లా నా చేయి గిల్లుతూ మహా అల్లరి చేశాడు. అన్నా ఫ్యోదొరోవ్నా వెనుక చేరి మూతితో వెక్కిరించాడు. అతని అల్లరి భరించలేక చివరకు ఇంటి యజమానురాలు అతనిని మెడపట్టి గెంటివేసింది !

వేయికళ్ళతో ఎదురు చూస్తున్నరోజు రానే వచ్చింది. సరిగా ఉదయం 11 గంటలకు, పొక్రొవ్‌స్కీ తండ్రి చర్చిలో ప్రార్థన కార్యక్రమం ముగించుకొని, సరాసరి అక్కడనుండి కొడుకు గదిలోకి వచ్చి వాలాడు. కొత్త కోటు, కొత్త బూట్లు ధరించాడు. నీటుగా ముస్తాబై వచ్చాడు. రెండు చేతుల నిండా పుస్తకా లున్నాయి. అతను వచ్చేటప్పటికి మేమంతా అన్నాఫ్యోడోరోవ్‌నా గదిలో కూర్చొని కాఫీ సేవిస్తున్నాం. ఆ వేళ ఆదివారం. అతను వచ్చీరావటంతోనే "పుష్కిన్ మహాకవి" అంటూ ప్రారంభించాడు. తరువాత అతని మాటలు ఎందుచేతనోగాని తడబడ్డాయి. నలుగురిలో వున్నప్పుడు జాగ్రత్తగా వ్యవహరించాలన్న తలంపు అప్పుడు తట్టినట్టున్నది. పిచ్చిపిచ్చిగా వాగితే, ఎక్కడ తాగొచ్చాడని అనుకొని పోతారోనని భయపడినట్టున్నాడు. అపోహాలు, అపార్థాలు ఒకవ్యక్తి సర్వనాశనానికి సోపానాలు. అతను తనసొద, సోది ప్రారంభించాడు; ఏదో వాదించాడు. దురలవాట్లను వదిలించు కొంటున్నాననీ, సత్ప్రవర్తన అలవర్చు కొంటున్నాననీ చెప్పాడు. తన ప్రవర్తనలో వచ్చిన మార్పుకు ఈ గ్రంథాలే సాక్షి అన్నాడు. ఎంతో కాలంగా డబ్బు ఆదా జేసి, అబ్బాయికి ఈ బహుమతి తెచ్చానని చెప్పాడు.

పొక్రొవ్‌స్కీ తండ్రి మాటలు వింటూంటే, నాకు నవ్వు, ఏడుపు ఒకేసారి పొర్లుకొచ్చాయి. అవసరమొస్తే అబద్ధాలతో కథను చక్కగా అల్లటంలో అతను సిద్ధహస్తుడు. ఆ పుస్తకాలు పొక్రొవ్‌స్కీ గదికి చేర్చబడ్డాయి. అల్మరాలో

చక్కగా అమర్చబడ్డాయి. వాస్తవమేమిటో పొక్రొవ్‌స్కీ యిట్టే గ్రహించి వుంటాడు. ఆవేళ పొక్రొవ్‌స్కీ తన తండ్రిని భోజనానికి ఆహ్వానించాడు. ఆ రోజంతా మహా సరదాగా గడిచిపోయింది. భోజనానంతరం పేకాట ఆడాం. సాషా మహా అల్లరిచేసింది. దానికన్నా నే నేమీ తక్కువ తిన లేదు. ఒంటరిగా వున్నప్పుడు చూసి నాతో మాట్లాడాలని పొక్రొవ్‌స్కీ విశ్వప్రయత్నాలు చేశాడు. అందుకు నే నేమాత్రం అవకాశం యివ్వలేదు. నాలుగేళ్ళ కాలంలో అంతటి మహాసంతోషదాయకమైన దినం మరొకటి లేదు. ఆ పర్వదినం నాకు కలకాలం గర్వకారణం.

కాని ఈనాడు ఆ రోజును తలుచుకొంటుంటే, విచారం, బాధ కలుగుతున్నాయి. చీకటి రాత్రులలో వెన్నెల రాత్రులను స్మరించుకోనటంకన్నా బాధాకరం మరొకటి వుండదు కదా ? బహుశా అందుకేకాబోలు, కలం ముందుకు సాగటం లేదు. అందుకేకాబోలు, నా జీవితంలో మాధుర్యం చిలికించిన ఆ రోజుల్లో జరిగిన ఘటనలను నే నింత సజీవంగా, సవివరంగా చిత్రించగల్గుతున్నాను. నా జీవితానందానికి ఆదీ, తుదీ అదే. అటుతర్వాత వేదనలు, వేతనలు ఆరంభమయ్యాయి. అవి ఎప్పటికి అంతమవుతాయో ఆ భగవంతుడికే తెలియాలి.

నేను పైన ఉదహరించిన ఘటనలు జరిగిన రెండు నెలలకు పొక్రొవ్‌స్కీ పడకబెట్టాడు. కొద్దిరోజులు జబ్బుతో తీసుకొని, ఈ లోకాన్నీ, నన్నూ శాశ్వతంగా విడిచిపెట్టి పరలోక గతుడయ్యాడు. బ్రతుకు తెరువుకోసం అతను ఆ

రెండు నెలలూ విధి విరామంలేకుండా పనిచేశాడు. నికరమైన ఉద్యోగంలేదు. మానవుడు ఆశాజీవి. ఆశ లేకపోతే జీవితం దుర్భరంగా మారుతుంది. అందరిలాగానే అతనూ ఆఖరి క్షణం వరకు, తాను చాలాకాలం బ్రతకగలనని గట్టిగా విశ్వసించాడు. అతనికి కావాలంటే ఎక్కడో ఒకచోట ట్యూటరు ఉద్యోగం తేలికగానే లభించేది. కాని అలాంటి ఉద్యోగం చేయటం అతనికి నామోషీ. పోతే, ప్రభుత్వ ఉద్యోగమంటారా, అది అసంభవం. అతని ఆరోగ్యం అంతంతమాత్రంగా వుంటే, ప్రభుత్వోద్యోగం దొరకటం మాటలా? నికరమైన ఉద్యోగం లేకపోవడంతోపాటు, చిల్లర మల్లరగా సంపాదిస్తున్న డబ్బుకూడా అనుకున్న ప్రకారం చేతికి వచ్చేదికాదు. దానితో అతను నిరాశ, నిస్పృహాలలో మునిగి పోయాడు. మనోవేదనతో ఆరోగ్యం మరింతగా దెబ్బతిన్నది. వర్షాకాలంలోకూడా వంటి పైబట్ట తోనే బజారులంట, ఉద్యోగంకోసం ఎక్కడపకు దిగేగడపకు లెక్కలేదన్నట్టు తిరిగాడు. ఎక్కడకు వెళ్ళినా తిట్లు, చివాట్లు తినటంతప్ప, ఉద్యోగంమాత్రం దొరకలేదు. వర్షాలకు తడిసి, పడక బెట్టాడు. అంతే – శాశ్వతంగా కన్ను మూశాడు.

అతను జబ్బుతో తీసుకున్నంతకాలం నేను అతని మంచం వద్దనే వుండవలసి వచ్చింది. అతనికి పరిచర్యలు చేయవల సిన విధి, బాధ్యత నాపై బడ్డాయి. కొన్ని రాత్రులు అసలు కునుకుతీయటానికి అవకాశమే వుండేదికాదు. జబ్బుతో తీసుకుంటూ కూడా అతని ఆలోచనలు పరిపరివిధాల పరు గెడుతుండేవి. ఎన్నో విషయాలను గురించి మాట్లాడు

తుండేవాడు: తాను చదివిన పుస్తకాలను గురించీ, ఉద్యోగాల కోసం చేసిన ప్రయత్నాలను గురించీ, నన్ను గురించీ, తన తండ్రిని గురించీ - ఎన్నెన్నో కొత్త విషయాలు చెప్పాడు. అతనికి జబ్బుచేసిన తొలి దినాలలో అంతా నానంక అదో విచిత్రంగా చూస్తుండేవారు. అన్నాఫ్యోడొరోవ్నా అయితే మాతి విరుస్తూ, ముఖం చిట్లించింది కూడా. వాళ్ల కోర చూపులకు నే నేమాత్రం చలించకుండా, నాపని నేను చేసుకు పోతుండేదాన్ని.

పొక్రొవ్‌స్కీకి సంధించింది. మనుష్యులను గుర్తించటంలేదు. అప్పుడప్పుడు మాత్రం నన్ను గుర్తించుతుండే వాడు. రేయింబవళ్లు ఒకటే వాగుడు; అర్థం పర్థంలేని ప్రలాపాలు. నే నొక్కదానినే ఆ గదిలో వుండేదాన్ని. ఎప్పుడూ గుండె పీచు పీచుమంటూ వుండేది. ఆఖరిరోజు రాత్రి అతని సంధి ప్రలాపాలు బాగా పెచ్చరిల్లిపోయాయి. బాధతో గిలగిలా తన్నుకొన్నాడు. ఇంటి పెంకు లెగిరిపోయేటట్లు మూల్గాడు. అంతా హడలిపోయారు. ఆరి భగవంతుడా వీడిని త్వరగా తీసుకపోరా తండ్రీ అంటూ అన్నాఫ్యోడొరోవ్నా ప్రార్థనలుచేసింది. డాక్టరు వచ్చి, రోగిని పరీక్షించి, రేపు ఉదయానికి రోగి తప్పకుండా చచ్చిపోతాడని గట్టిగా చెప్పివెళ్ళాడు.

ఆ కడపటి రాత్రి పొక్రొవ్‌స్కీ తండ్రి ఆగది వెలుపల ద్వారంచెంతనే పరచివున్న చాపపై నడుం వాల్చాడు. చీటికి మాటికి కొడుకుస్థితి ఎలావుందో అన్న ఆదుర్దాతో గదిలోకి వస్తుండేవాడు. ఆ ముసలాడిముఖం చూస్తుంటే భయమేసింది.

అతని గుండెలు అవిసిపోతున్నాయి. బాధతో అతని హృదయం గిలగిలా తన్నుకొంటోంది. సదా ఏదో గొణుగుతుండేవాడు. అతనికిగాని పిచ్చెత్తలేదుకదా అన్నంత భయమేసింది. ఏమైతేనేమి, తెలతెలవారుతున్న సమయానికి ఆ ముసలాడు అలసిపోయి, వళ్లుమరచి నిద్రాదేవి కౌగిలి జేరాడు.

తెల్లవారింది. ఏడుగంటలు కావొచ్చింది. పాక్రొవ్‌స్కీ అంతిమదశ సమీపించిన లక్షణాలు గోచరించాయి. వెళ్లి ముసలాడిని లేపాను. చనిపోయే వ్యక్తికి సమస్తం తెలుసు, అందుకే అందరికీ వందనాలు చెప్పి, సెలవు తీసుకొన్నాడు. అదేమి విచిత్రమోకాని, ఒకవైపున హృదయం పగిలి, విహ్వాలమై పోతున్నప్పటికీ నేను ఏడ్వలేదు; నాకు ఏడ్పు రాలేదు.

ఆఖరిక్షణాలు నిజంగా దుస్సహమైనవి. పాక్రొవ్‌స్కీ ఏదో చెప్పాలన్న తహతహతో, నాలుక స్వాధీనం తప్పుతున్నప్పటికీ, మహా ప్రయత్నంమీద వినిపించీ వినిపించని విధంగా ఏదో చెప్పాడు. అతను ఏమి చెప్పాడో నాకు అర్థం కాలేదు. గంటసేపు అతను తన్నుకున్నాడు. ఏదో చెప్పాలనుకొని, చెప్పలేక, సైగలతో తన అభిప్రాయాలను వ్యక్తం చేయాలని ప్రయత్నించాడు. ఆ దృశ్యం నిజంగా నాకు దుస్సహమనిపించింది. అతను జాలిగా నావంక చూశాడు. ఏదో గొణిగాడు. ఎంత ప్రయత్నించినా ప్రయోజనముంటేగా ? అతను చెప్పింది ఒక్క ముక్క నాకు బోధపడలేదు. అందరినీ పిలిచాను. అంతా వచ్చారు. ఎవరికీ అవగతంకాలేదు. దాహంతో పరితపిస్తున్నాడేమోనని మంచినీళ్లు తెచ్చి

యిచ్చాను. చివరకు అతను కోరుతున్న దేమిటో గ్రహించ గలిగాను: చనిపోయేముందు భగవంతుడు సృష్టించిన యీ ప్రకృతి సౌందర్యాన్ని తనివితీరా ఒకసారి చూడాలనీ, ఉదయ భాస్కరుని తేజోమయ ఓజస్సును ఒకసారి పరికించాలనీ అతను పరితపించాడు. తెర తొలగించమని అతను యింత సేపూ ప్రాధేయపడుతున్నాడు. తొలగించాను. సూర్యోదయం కూడా చాలా నిస్తేజంగా వుంది. కొడిగట్టిన దీపంలాగా వుంది. కావలసిన వెలుగు లేదు. ఆకాశమంతా మబ్బులు కమ్మి, మసకమసకగా వుంది. విషాదం ఆ గదిని ఆవ హించింది. మరణశయ్యపై పరుండి, మరణదేవతలో లీనం కాబోతున్న ఆ మానవుడు నాపై ఆశాదృక్కులు బరపుతూ, గబాలున తలవాల్చాడు. ఆ మానవుని జీవితానికి అదే అంతం. అతను మరి లేడు.

అంత్యక్రియలకు అన్నాఫ్యోడొరోవ్నా అన్ని ఏర్పాట్లు చేయించింది. పెద్ద ఖర్చు లేకుండా, కావలసిన ఏర్పాట్లన్నింటినీ పూర్తి చేయించింది. అంత్యక్రియలు జరిపించినందుకు కొంత ఖర్చు అయిందికనుక, ఖర్చు పద్దుపడిన తర్వాత దానిప్రక్కనే జమపద్దు పడకపోతే, లెక్కలో తప్పులు వస్తుంది కనుక, పొక్రొవ్‌స్కీ పుస్తకాలన్నింటినీ ఆమె జమ వేసుకొంది. ఆ గదిలోని ఇతర వస్తువులను స్వాధీనం చేసుకొంది. కొడుకు ఆ ఆస్తి తనకురావాలని ఆముసలాడు పట్టుబట్టి, పోట్లాడినాఫలితం లేకపోయింది. పోట్లాడగా, పోట్లాడగా చివరకు అయిదారు పుస్తకాలుమాత్రం అతను పొందగలిగినట్టున్నాడు. తన కొడుకు స్మృతిచిహ్నంగా ఆ పుస్తకాలు చూసుకొంటూ ఆ ముస లాడు ఒకవిధమైన తృప్తిపొందాడు.

పొక్రొవ్‌స్కీ అంత్యక్రియలకు మా అమ్మగానీ, అన్నా ఫ్యోడొరోవ్‌నా గానీ హాజరుకాలేదు. అమ్మకేమో ఆ వేళ సుస్తీ చేసింది; అన్నాఫ్యోడొరోవ్‌నా బయలుదేరబోయింది కాని, ఆఖరిక్షణంలో ఆ ముసలాడితో కీచులాడి, తన మనస్సు మార్చుకొంది. చివరకు నేనూ, ఆ ముసలాడు మాత్రమే అంత్యక్రియలకు హాజరయ్యాం. పొక్రొవ్‌స్కీ భౌతిక కాయాన్ని పెట్టెలో పెట్టి, సమాధి చేస్తుంటే నా కళ్ళంట కన్నీటిధారలు జాలువారాయి. ఇంటి కెళ్ళి అమ్మ ఎదపై వాలి భోరుభోరున ఏడ్చాను. అమ్మను కావలించుకొని ముద్దు పెట్టుకున్నాను. ఈ లోకంలో ఇక నాకు మిగిలిన 'నా' అన్న వ్యక్తి నన్నా కాపాడుకోగల ననుకొన్నాను. కాని, ఆమెను కూడా భగవంతుడు ఎత్తుకు పోనే పోయాడు ...........

జూన్, *11*

*మకార్ అలెగ్జివిచ్,*

నిన్న నన్ను దీవులలోకి పి.కాకు తీసుకెళ్ళావు. నీకు ధన్యవాదాలు. ఆహా! ఆదృశ్యాలు ఎంత రమణీయంగా వున్నాయి. పచ్చపచ్చగ పెరిగి, పిల్లగాలులకు తలలూపుతున్న ఆ పచ్చగడ్డి చూడముచ్చటగా వుంది! దట్టంగా పెరిగిన

ఆ ఆకుపచ్చనిచెట్లు ఎంత చక్కగా ఉన్నాయ్! ఎంతో కాలానికి తిరిగి పచ్చదనం చూడగలిగాను. ఇలాంటి దృశ్యాలను చూసే భాగ్యం యీ జీవితంలో నాకు లభిస్తుందని నేను అనుకోలేదు. అదృష్టవశాత్తు జబ్బునుంచి కోలుకొన్నాను. కోలుకొన్న వెంటనే పిరియబోసిన ప్రకృతి సౌందర్యం చూసి ఆనందించగలిగాను. ఏమీ అనుకోకు. నిన్నంతా నేను చింతాగ్రస్తురాలై వున్నానని తలంచకు. చాలా సరదాగా గడిపాం. అదేమిటోగాని, మహదానందం పొందుతున్న సమయంలోనే నేను విచారగ్రస్తురాల నవుతుంటాను. ఒకవేళ అలాంటి సందర్భాలలో నేను దుఃఖించినా నీవు బాధ పడనవసరం లేదు. అదేమిటోకాని తరచు నాకు దుఃఖం పొర్లుకొస్తుంటుంది. అందుకు హేతువేమీ కన్పించదు. అదే విచిత్రం. మనస్సులో ఆనందం చిగిర్చితే, హృదయంలో కలకవేసినట్టవుతుంది. నిన్న సాయంత్రం ఆకాశమంతా వినిర్మలంగా వుంది. అస్తమిస్తున్న సూర్యుడు, సంధ్యా సమయ ప్రశాంతత - నా హృదయాన్ని కదిలించివేశాయి. గుండెలు బరువెక్కాయి. కళ్ళనీటి పర్యంతమైంది. అందుకు కారణం చెప్పమంటే చెప్పలేను. ఇదంతా ఎందుకు వ్రాస్తున్నట్టు చెప్మా? అసలు నా మనస్సులోనే భావ స్పష్టత అంతంతమాత్రంగా వుంది. అయినపుడు కాగితంపై ఎక్కించేసరికి ఆ అస్పష్టభావాలు ఎలా వికృత రూపం ధరిస్తాయో వేరే చెప్పాలా? అర్థరహితంగా కన్పించినా కన్పించవచ్చు. అయినా నీవు నాహృదయాన్ని అర్థంచేసుకోగల వనుకొంటాను. కన్నీరు, నవ్వు! మకార్ అలెక్జెవిచ్, నీవు

ఎంత మంచివాడివి. నీదెంత ఆర్ద్రహృదయం. నిన్న నీవు తదేకంగా నా వంక చూస్తున్నప్పుడు, నా కళ్ళల్లో భావాలను, నాహృదయంలో ఆనందాన్ని స్పష్టంగా చదవాలని ప్రయత్నించినట్టు నేను గ్రహించాను. నేను చిన్న పొదను చూస్తున్నా, మొక్కను తిలకిస్తున్నా, చెట్ల గుబుర్లను పరికిస్తున్నా, జలజల ప్రవహిస్తున్న సెలయేరును పరిశీలిస్తున్నా నీవు సగర్వంగా, ఆ ప్రదేశమంతా నీ సొంత ఎస్టేటు అయినట్టు నా వంక చూశావుకదూ! నీ హృదయం కరుణామయం అనటానికి ఇదంతా నిదర్శనం. అందుకే నీవు అంటే నాకు అంత అనురాగం. సెలవు, ప్రియతమా! ఈ వేళ నాకు మళ్ళీ సుస్తీచేసింది. తడిలో తిరిగాను. జలుబు లంకించుకొంది. ఫెడోరా పరిస్థితికూడా ఏమంత బాగాలేదు. మేమిద్దరం అవిటివాళ్ళమైపోయాం. మమ్మల్ని మరచిపోకు. వీలున్నప్పుడల్లా ఒకసారి వచ్చి వెళ్ళుతుండు.

నీ

వి. డి.

జూన్, 12

ప్రియమైన వర్వారా అలెగ్జియేవా,

నీకు తెలుసో, తెలియదో కాని, నిన్నటి నీ ఉత్తరం వచనంలో కాక, కనీసం కవితారూపంలో ప్రత్యక్ష మవు

తుందని ఆశించాను. కాని, నీవు ఒకే ఒక పేజీ ఉత్తరం వ్రాశావు. అంటే ఇంతకీ నేను చెప్పవచ్చేదేమిటంటే, రాసింది స్వల్పమే అయినా, అందులోని అనురాగం అనల్పం. చాలా బాగుంది. ప్రకృతి సౌందర్యమూ వుంది. నేత్రానంద కరమైన దృశ్యాలూ వున్నాయి. సముజ్జ్వలభావాల పుట్ట. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆ లేఖలో అన్ని సంగతులు మహా అమోఘంగా వర్ణించావు. ఇక నా విషయమంటావా, నే నెందుకూ పనికిరానివాడిని. ఎలాంటి ప్రతిభా లేదు నాకు. పది పన్నెండు పేజీలు నింపినా, చెప్పదల్చుకున్న భావాలను బట్వాడా చేయలేను. ఓ ప్రియతమా, నీ పొగడ్తల ధాటికి తట్టుకోలేక చచ్చిపోతున్నానంటే నమ్ము. నే నేదో మహా దయాపరుడ నైనట్టూ, పరులకు హాని తలపెట్టని సద్గుణ సంపన్నుడ నైనట్టూ, ప్రకృతిలో గోచరించే మంచితనమంతా నాలోనే మూర్తీభవించినట్టూ నీవు వ్రాశావు. నిజమే; నీవు వ్రాసినదంతా అక్షరాలా నిజమే. ఆ విషయం నీకూ తెలుసు. కాని నీ లేఖ చదివితే, కఠినాత్ముని హృదయంకూడా కరిగి నీరై పోక తప్పదు. నిజం చెప్పొద్దూ, దానిని చదివి, విచారించాను. ఈ సందర్భంలో నా జీవితగాథను కొంత చెప్తాను, విను.

ఆఫీసులో చేరినప్పుడు నా వయస్సు పదిహేడేళ్ళు. ఇప్పటికి ముప్పయియేళ్ళయింది. ఈ ఉద్యోగకాలంలో ఎన్ని కోట్లు చిరిగిపోయాయో చెప్పలేను. కాని వయసు పెరగటంతో వివేకంకూడా హెచ్చింది. ప్రజలంటే ఎలాంటివారో కొంతవరకు అర్థంచేసుకోగల్గాను. నిజంగా నేను జీవించాను.

ఈ విషయంలో నీకెలాంటి సందేహం అక్కర లేదు. అదేమిటి, ఒకసారి పెద్ద ఉద్యోగానికి నన్ను పెద్దపెద్దవాళ్ళే సిఫారసు కూడా చేశారు. అంతా సిద్ధమైంది. ఈ విషయం నీకు నమ్మ శక్యంగా కన్పించకపోవచ్చు. నాకు భగవంతుడే సాక్షి. కాని, దురదృష్టవశాత్తు నాచుట్టూ దుష్టులుచేరారు. నేనేమో వట్టి అమాయకుణ్ణి. అందరిలాగా నాకు హృదయంవుంది. నా కర్మ కాలి, ఒక దుష్టుడు నాకు దాపురించాడు. వా డేమిచేశాడో తెలుసా? చెప్పబోతే సిగ్గేస్తున్నది. వాడేమిచేశాడో చెప్పను, వాడు ఆపని ఎందుకు చేశాడో చెప్తాను: నేను వట్టిపిరికి పందను కావటంవల్లా, ఇతరులజోలికి పోయేవాణ్ణి కాకపోవటం వల్లా, జాలిగుండె గలవాణ్ణికావటంవల్లా, అతనికి నేను నచ్చ లేదు. అంతే. చిలికిచిలికి గాలివాన అవుతుందన్నారు. అంతే జరిగింది. మొదట అతి స్వల్పవిషయాలతో ప్రారంభించాడు: "మకార్ అలెగ్జెవిచ్ యిలాంటివాడు; మకార్ అలెగ్జెవిచ్ అలాంటివాడు." అటుతర్వాత: "మకార్ అలెగ్జెవిచ్ నుంచి నీవు ఆశించగలిగింది ఏమిటి?" చివరకు: "ఇందుకు మధ్యవర్తు లెవరు? మకార్ అలెగ్జెవిచ్ అని వేరే చెప్పాలా?" చూశావా, ప్రియతమా, తప్పు ఎప్పుడూ మకార్ అలెగ్జెవిచ్ దే. వాళ్ళంతా కలిసి చేసింది అంతే. నేను పనిచేస్తున్న మంత్రిత్వ శాఖలో ఎక్కడ చూసినా నన్నుగురించి చెప్పుకోడమే. వాళ్ళు అక్కడితో ఆగారా? నేను తొడిగిన బూట్లకు, కోటుకు సవాలక్ష వంకలు పెడుతూ, చిలవలు, పలవలు ప్రచారం చేశారు. నా జుట్టును, నా ఆకారాన్ని వెక్కిరిస్తూ, కొక్కిరిస్తూ, అవ

హేళన సాగించారు. ఇలా కొన్నేళ్ళపాటు తెరిపీ, తెంపూ లేకుండా సాగింది. వా టన్నిటికీ నే నిప్పుడు అలవాటు పడి పోయాను. వాళ్ళు సన్నెందుకు యింతగా తిప్పలుపెట్టారో తెలియదు. నే నెవ్వరికీ ఎట్టి హాని చేసి ఎరుగనే. పై అధి కారులకు ఎవరిపైనా పితూరీలు చెప్పలేదే. పై పదవులకు ఎగ్రబాకాలన్న ఆకాంక్షతో నే నెవ్వరినీ క్రిందకు పడలాగ లేదే. నే నెవరిమీదా కుట్రపన్ని ఎరుగనే. అయినప్పుడు వాళ్ళు ఎందుకు నా కీ అన్యాయం తలపెట్టినట్లు? నీవే ఆలో చించు, కుట్రలూ, కుహకాలు పన్నగల సమర్థుడనా నేను? ఆరి భగవంతుడా, అలాంటి బుద్ధులు పగవాడికికూడా వద్దు బాబు! నేను నీ దృష్టిలో యోగ్యుడనే... కాదంటావా? ఇతరులకన్నా నీవు ఎన్నో వేల రెట్లు మంచిదానివి. ఇంతక ఈ సంఘంలో గౌరవంగా బ్రతకాలంటే ఏమి చేయాలి? నిన్న ఇవానివిచ్‌తో ఎవో ఆంతరంగిక విషయాలు మాట్లాడు తుంటే చెప్పాడు. రెండుచేతులాసంపాదించేవాడినే ఈ సంఘం యోగ్యుడుగాను, గౌరవనీయుడుగాను పరిగణిస్తుం దన్నాడు. ఇవానివిచ్ నవ్వుతాలకే ఆమాట అనివుండవచ్చు (అతను నవ్వుతాలకే ఆమాట అన్నాడని నావిశ్వాసంకూడా). ఏమైనా దీనినుంచి నేర్చుకోవలసిన నీతి ఒకటుంది. ఎవరూ పరులకు భారంకారాదు. నే నెవరికీ భారంకా లేదు. నా పొట్ట నేను పోషించుకుంటున్నాను. నాది నికృష్టమైన బ్రతుకే కావచ్చు. అయినా నిజాయితీగా జీవిస్తున్నాను. న్యాయంగా ఆర్జిస్తూ, న్యాయశాస్త్ర సమ్మతంగా భుజిస్తున్నాను. మానవుడు చేయవలసింది ఏమిటి? ప్రతులు, కాపీలు తీయటం

ఏమంత గొప్పకాదు. అయినా నేను చేస్తున్న ఉద్యోగాన్ని గౌరవప్రదంగా,గర్వకారణంగా ఎంచుకొంటాను. చెమటోడ్చి సంపాదిస్తూ బ్రతుకు వెళ్ళబుచ్చుతున్నాను. ఏం? కాపీలు తీయటం అంతహీనమైన వృత్తా? అదేమన్నా పాపకార్యమా? "అవిగో చూడండి, కాపీలు తీస్తున్నాడు" "ఆఫీసు ఎలుక చూపి వ్రాస్తోంది" ఏమిటి ఇదంతా? నేను చేస్తున్న పనిలో అవినీతి ఏముంది? నా దస్తూరీ చక్కగా, చూడముచ్చటగా వుంటుంది. హిజ్ ఎక్సెలెన్సీకి నా దస్తూరి అంటే ఎంతో యిష్టం. అందుకే హిజ్ ఎక్సెలెన్సీ అధికారపత్రాలలో ముఖ్యమైనవాటిని నా చేతనే వ్రాయిస్తుంటాడు. పోతే, శైలి అంటావా, అది నా యింటా వంటా లేదు. ఆ విషయం నాకూ తెలుసు. అందుకే నేను పై ఉద్యోగాలలోకి ఎగబ్రాకలేకపోయాను. ఓ నా ముద్దులకూనా, నా మురిపాల వానా, నీకు రాసే వుత్తరాలుకూడా బహు సాదాగా వుంటాయి. అందులో తళుకులూ వుండవు. తలపులూ వుండవు. ఏమంటావ్? ఏదో మనసులో మెదిలిన ఆలోచనలను యథాతథంగా కాగితంపైకి ఎక్కిస్తుంటాను. ఆ విషయం నాకు పూర్తిగా తెలుసు. అయితే నాకు తెలియక అడుగుతాను, అంతా అందలమెక్కేవాళ్లే అయితే ఇక మోసే బోయీలెవ్వరు? దీనికి సమాధానం చెప్పు ప్రియతమా! అందుచేత నా అవసరం వుందనటం నిజం. వాళ్ళు నన్ను "ఆఫీసు ఎలుక"గా చూస్తే చూడవచ్చుగాక. ఈ ఎలుక అవసరం వుందన్నసంగతి బహుశా వాళ్ళకు తెలియకపోవచ్చు. నేను ప్రయోజనకరమైన ఎలుకను. అప్పుడప్పుడు వాళ్ళకు బుద్ధిచెప్పాలని బుద్ధిపుడుతూ

వుంటుంది. ఓ చిన్నారి వయ్యారీ, సెలవు. త్వరలోనే నిన్ను చూడటానికి వస్తాలే. వచ్చేటప్పుడు ఒక మంచి పుస్తకం కూడా తెస్తాలే. సెలవు, వరెంకా.

నీ శ్రేయోభిలాషి,
మకార్ దెవూష్కిన్.

జూన్, 20

ప్రియమైన మకార్ అలెక్సెవిచ్,

చాలా హడావిడిలో యీ జాబు వ్రాస్తున్నాను. అన్న ప్రకారం త్వరగా పూర్తిచేసి యివ్వవలసిన పని వుంది. విషయ మేమిటంటే: లాభసాటి బేరం ఒకటి తగిలింది. ఎవరో ఒక కొత్త సూటును అమ్మటానికి సిద్ధంగా వున్నాడనీ, ధరకూడా కారుచౌక అనీ ఫెడోరా చెప్పింది. ఆ సూటును నీవు కొంటే బాగుంటుంది కదూ? ఇప్పుడు నీ స్థితికూడా కొంతవరకు బాగుపడింది; ఆ విషయం నీవే అంగీకరించావ్. డబ్బులేదని సణిగితే కుదరదు! నీవు ధరించే దుస్తులు ఎలా వున్నాయో ఒకసారి చూసుకో! అవి ఎంతో అసహ్యంగా వున్నాయి. వాటిని ధరించి నలుగురిలో తిరగటం హేయమూ, హీనమూ— నీకు పెట్టెలో కొత్త దుస్తులు కూడా లేవాయె.

దాపుడుదుస్తు లున్నవని నీవు చెప్పినా ఆ మాట నేను నమ్మబోను. నీ సంగతి నాకు క్షుణ్ణంగా తెలుసు. ఈమధ్యనే కొన్న కొత్త సూటును ఏమిచేశావో ఆ భగవంతుడికే తెలియాలి. కనుక దయచేసి త్వరగా ఏ విషయమూ తేల్చు. నీవు నన్ను ప్రేమిస్తున్నట్టయితే, నేను చెప్పినట్లు చేయి.

నీవు పంపిన బహుమతిని అందుకొన్నాను. అంత ధర పెట్టి ఆ బహుమతిని నాకు పంపటమెందుకు చెప్పు? చేజేతులా సర్వనాశనాన్ని కొనితెచ్చుకుంటున్నావు. ఈ విధంగా డబ్బు తగలేయటం దారుణం. నీకు డబ్బంటే నీళ్ళప్రాయమై పోయింది! ఇవన్నీ శుద్ధ దండుగ. నీవు నన్నుఎతంగా ప్రేమిస్తున్నావో నాకు తెలియకపోతేగదా! ఈ బహుమతులు పంపి పదేపదే గుర్తుచేయవలసిన అగత్యం ఏముంది చెప్పు? ఎన్నిసార్లు నెత్తిననోరెట్టుకొని మొత్తుకొన్నా నీవింటేగా? ఇదే తుదిసారి చెప్పటం: మళ్ళీ ఎప్పుడూ బహుమతులు పంపించకు. నిన్ను వేడుకొంటున్నాను. పంపటం ఇకనైనా మానేస్తావ్ కదూ?

మిగతా జీవితగాథనుకూడా పంపించమని కోరావు. ఇంకా మిగిలిపోయిన జీవితగాథను పూర్తిచేయమని సూచించావు. నిజానికి ఆ ఆత్మకథను ఎలా రాయగలిగానో నాకే తెలియదు. గతాన్ని గురించి ముచ్చటించటమన్నా, ఆలోచించటమన్నా నాకు దుస్సహంగా వుంటుంది. వెనుదిరిగి చూడటమంటే నా గుండె గుభేలుమంటుంది. అన్నిటికంటే మా అమ్మను తలచుకోవటం ఎంతో బాధకస్తుల్గింది. ఆమె తన కూతురుని దుష్టుల కప్పగించి వెళ్ళిపోయింది. అది

తలుచుకొంటే నా హృదయం తరుక్కుపోతుంది. అమ్మ చనిపోయి సంవత్సరమైంది. అయినా ఇంకా మనోవేదన సమసిపోలేదు. అదంతా నీకు తెలియని విషయంకాదు గదా.

అన్నా ఫ్యోడొరోవ్నా మనోగతాభిలాషలు ఇప్పుడు ఎలా వున్నాయో ఇదివరకే నీకు తెలిపాను. నాకు విశ్వాసమన్నది ఏకోశానా లేదని ఆమె ఆరోపిస్తున్నది. బైకోవ్ చేష్టలకు తాను ఏ విధంగాను బాధ్యురాలను కానని ఆమె అంటోంది. మళ్ళీ తనింటికి వచ్చేయి మని ఆమె నన్ను వత్తిడి చేస్తోంది. పరుల దానధర్మాలపై ఆధారపడి జీవించడం మంచిదికాదని హితువు చెప్తోంది. నేను గనుక మళ్ళీ తనింటికి తిరిగి వెళ్ళితే, ఎట్లాగొట్లా బైకోవ్‌ను ఒప్పించి అతని చేత కట్నం రూపేణా కొంత మొత్తం నాకు ముట్టేటట్లు చూస్తానని ఆమె ఆశ చూపుతోంది. అన్నీ తెలిసి ఆ యమకూపంలో మళ్ళీ అడుగు పెట్టటం కల్ల. ఇక్కడే నాకు హాయిగా వుంది. నీవు కొండంత అండగా వున్నావు. కన్నతల్లి లేని లోటును తీర్చే మహాతల్లి ఫెదోరా వుంది. నాకు ఇంకా కావలసినదేమి వుంది? మనిద్దరం దూరపుబంధువులమే కావచ్చు; అయినా నీవున్నంతవరకు నాకెట్టి భయంలేదు. పోతే, వాళ్ళ సంగతంటావా? అసలువాళ్ళను ఎరక్కపోతేనే ఎంతో బాగుండేది. ఇదివరకువాళ్ళు నాకుచేసింది చాలు! ఇవన్నీ వట్టిపుకార్లనీ, నాజోలికి ఇక వాళ్ళు రారనీ ఫెడోరా అంటోంది. దేవునిదయవల్ల అలాగే జరిగితే నాకదేపదివేలు.

వి. డి.

ప్రియతమా, నా చిన్నారి వయ్యారీ

ఈ లేఖ ఎలా ప్రారంభించాలో తెలియకుండా వుంది. మనిద్దరం, ఇక్కడ ఈ విధంగా జీవించటం వుంది చూశావూ, అదిచాలా విచిత్రం! నేనింతకుముందెన్నడూ ఈ విధమైన ఆనందం పొందలేదు. దైవానుగ్రహంవల్ల నాకూ ఒక ఇల్లు, కుటుంబం అంటూ ఏర్పడ్డాయి. ప్రియతమా, నా వరహాల మూటా, నేను పంపిన ఆ నాలుగు చౌకబారు బ్లౌజుల గురించి నీవు ఎందుకంత గొడవ చేస్తావ్? బ్లౌజులు లేక నీవు యిబ్బంది పడుతున్నావని ఫెదోరా చెప్పింది. నా ప్రాణ సమాన గా ఎంచుకొంటున్న నీకు యిబ్బందులు కల్గితే నేను సహించగలనా? తల తాకట్టు పెట్టయినా నీ యిబ్బందులు తీర్చటం నాకు అదొక సంతోషం. అందుచేత దయచేసి నా ఆనందాన్ని పాడుచేయకు. నా మనస్సుకు కష్టం కల్గించకు. నన్ను ఎందుకు వేధిస్తావు? ఎటు తిరిగీ నా జీవితం పరిపూర్ణమైంది. నీ కోసమూ, నా కోసమూ నేను జీవిస్తున్నాను. పోతే, ముఖ్యమైన మరో విషయమేమంటే, ఇప్పుడిప్పుడే సమాజంలో నాకూ గౌరవస్థానం లభిస్తోంది. నా పొరుగున నివసిస్తున్న రతజ్యేవ్ వున్నాడు చూశావ్, అతను నన్ను అల్పాహారవిందుకు ఆహ్వానించాడు. సాహితీగోష్ఠులు ఏర్పాటుచేయించే అతను నన్ను తనింటికి

ఆహ్వానించటం విశేషంకాదా? ఈవేళ సాయంత్రమే ఆ విందు జరుగుతుంది. ఆ విందులో మేమిద్దరం సాహిత్యచర్చ సాగిస్తాం. సరే, సెలవు. వ్రాసేందుకు విశేషాలేమీలేవు. నేను కులాసాగానే వున్నానని తెల్పేందుకే ఈ నాలుగు ముక్కలు వ్రాస్తున్నాను. కుట్టుపనికి అవసరమైన రంగు సిల్కు దారాలు ఏమైనా అవసరమైతే, థెరెస్సాద్వారా కబురు పంపు. రేపు ఉదయానికల్లా రంగుదారాలు కొని పంపిస్తాను, తప్పకుండా కొని పంపిస్తాను. ఉంటా.

నీ సన్నిహితమిత్రుడు,

మకార్ దెవూష్కిన్.

జూన్, 22

ప్రియమైన వర్వారా అలెక్సెయేనా,

మా యింట్లో జరిగిన విషాదఘటన గురించి తెల్పటానికి విచారిస్తున్నాను. గోర్‌ష్కోవ్ చిన్నబ్బాయి యీవేళ తెల్లవారఝామున నాలుగు గంటల ప్రాంతంలో చనిపోయాడు.

సన్నిపాతజ్వరము ఏదో వచ్చినట్టుంది. నేను వాళ్ళ దుఃఖోపశమనానికి ఊరటకల్గించే నాలుగు మాటలు చెప్పి వచ్చాను పాపం, ఆ కుటుంబం ఎంత పేదరికంలో వుందని చెప్పను? వాళ్ళ స్థితిని చూస్తుంటే జాలేసింది. తొమ్మిదేళ్ళ పాటు అల్లారుముద్దుగా పెంచుకొన్న కుర్రాడు చనిపోయాడు. ఆ తల్లిదండ్రులు కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తున్నారు. వాళ్ళను చూస్తుంటే గుండె తరుక్కుపోతుంది. తల్లి అంతంగా లబో దిబోమంటూ దుఃఖించక పోయినప్పటికీ, ఆమె గుండెలు బద్దలైనట్లు ఆమెను చూస్తేనే తెలిసిపోతుంది. నిజానికి బిడ్డలలో ఒకడు పోయినా పోయినట్లేనని వారు లోలోన సంతసిస్తున్నారేమో తెలియదు. కటిక దరిద్రంతో బాధపడుతూ పిల్లలను పోషించటం మాటలా? ఇంకా ఇద్దరు పిల్ల లున్నారు. ఒక పసిపాప, అయిదారేళ్ళ పిల్లవున్నది. ఆ పిల్లల దుస్థితి చూస్తే కడుపు తరుక్కుపోక మానదు. ఆతండ్రి చిరిగిపోయిన కోటు ధరించి, విరిగిపోయిన కుర్చీలో కూర్చొని అదేపనిగా కన్నీరు కారుస్తున్నాడు. పొంగుకొచ్చే దుఃఖానికి ఆ కన్నీరు సాదృశ్యం కాకపోవచ్చు; అది అతనికి అలవాటుగా మారివుండ వచ్చు. ఇతరులతో మాట్లాడటం అతనికి సిగ్గు; మాటలు తడ బడతాయి. ఆ రేళ్ళ కూతురు అన్న శవం ప్రక్కనే నిలబడి వుంది. దీర్ఘాలోచనలో నిమగ్నమైంది. అంత చిన్న వయస్సులో పిల్లలు దీర్ఘాలోచనలో నిమగ్నం కావటం నిజంగా శోచనీయం. నోట్లో వేలేసుకొని ఆ పిల్ల అక్కడ నిలబడి వుండటంచూసి, మాయింటి యజమానురాలు ఆ పిల్లకు ఒక నిమ్మతొన తెచ్చి

యిచ్చింది. ఆ పిల్ల నిమ్మతొనను స్వీకరించిది. కాని తిన లేదు. ఇదెంత విషాదకరం! ఏమంటావ్ వరెంకా?

మకార్ దెవ్రూష్కిన్.

జూన్, 25

ప్రియమైన మకార్ అలెగ్జివిచ్,

నీ పుస్తకం నీకు పంపించి వేశాను. పాడు పుస్తకం, విసుగు పుట్టించింది. అలాంటి గ్రంథరాజాన్ని ఎక్కడ సంపాదించావు మహానుభావా? వేళాకోళాని కేమొచ్చెగాని, నిజంగా అలాంటి పుస్తకాలు నీకు నచ్చుతాయా, మకార్ అలెగ్జివిచ్? ఎప్పుడో ఏదో వాగ్దానం చేశావు. చక్కని పుస్తకం తెచ్చి చదివి విన్పిస్తానన్నావు. మనిద్దరం సహపఠనం సాగిద్దాం. మరి ఎప్పుడు? సెలవు. సుదీర్ఘమైన లేఖ వ్రాయటానికి తీరిక లేదు.

వి. డి.

ప్రియమైన వరెంకా,

నిజం చెప్పాలంటే, ఆ పుస్తకం నేను చదవనే లేదు. ఏవో కొన్ని పేజీలు తిరగేశాను. అంతే. నవ్వుపుట్టించే సరుకు అందులో వుందనుకొన్నాను. బహుశా వరెంకాకు ఇది నచ్చుతుందేమో అనుకొన్నాను. అందుకే దానిని నీకు పంపించాను.

అయితే రతజ్యేవ్ మంచి పుస్తకం తెచ్చి యిస్తానని వాగ్దానం చేశాడులే. చదువుకోటానికి కావలసిన పుస్తకాలు నీకు పంపిస్తాలే. రతజ్యేవ్ నిజంగా ఘనాపాఠి. విద్వాంసుడు; రచయితకూడా. ఎంత చక్కగా వ్రాస్తాడని. అతని కలం నిజంగా గొప్పది. శైలి మహా బాగుంటుంది. మామూలీ మాటను మలిచి, విశేషార్థం కల్పించగల్గిన శక్తి అతని కలానికి వుంది. చివరకు బూతుకూతలను నీతులుగా మార్చగల్గిన మహాశక్తి ఆ కలానికి వుందంటేనమ్ము. అలగాజనం మాట్లాడే మాటలనే నిర్దిష్టమైన శైలిలోకి మలిచే మహాయుక్తి అతనిలో వుంది. అతను ఎప్పుడు ఎవరికి ఎలాంటి విందుచేసినా నేను తప్పక హాజరవుతుంటాను. అంతాకూర్చొని సిగరెట్లు కాల్చుకొంటున్నప్పుడు, అతను తన రచనలు చదివి విన్పిస్తాడు. ఒకొక్కసారి భళ్లున తెల్లవారుతుందికూడా. అమోఘం! ఆణిముత్యాలు! అతను ఉపయోగించిన మాటల ఆణిముత్యాలతో పెద్ద ముత్యాలహారం తయారుచేయవచ్చు. అతను

దయాశీలుడు; కరుణామయుడు. మొఖమాటస్తుడు. అతనితో పోల్చితే నే నెంత? అతని వేలిగోటికి కూడా సరితూగను. అతనికున్న పేరు ప్రతిష్ఠల గురించి వేరే చెప్పాలా? మరి నేనో? ఎందుకూ కొరగాని వాణ్ణి. అనామకుణ్ణి. అయినా అతను నన్ను ఎంత ఇదిగా చూస్తాడని? అతని రచనల ప్రతులను కాపీచేసిపెట్టే పనిని నాకే ప్రత్యేకంగా పురమాయిస్తాడు. నన్ను ఆ విధంగా ఉపయోగించుకుంటున్నాడని తలంచకు ప్రియతమా! ఒకవేళ ఎవరైనా నీతో అలాఅని చెప్పితే నమ్మబోకు. కేవలం అదంతా నిందాప్రచారం. కావాలనే, బుద్ధిపూర్వకంగానే, మహా సంతోషంతోనే నేను అతనికి ఆపని చేసిపెట్టుతున్నాను. అతను చాలా మంచివాడు. గొప్ప రచయిత. మనిషిలోని మంచితనం, గొప్పతనం గుర్తించ గలిగినశక్తి నాకున్నది.

వరెంకా, చెప్పితే నీవు నమ్ముతావో లేదోకాని సాహిత్యం ఎంత గొప్ప వస్తువు అనుకొన్నావ్! మొన్నే ఈ విషయం నాకు తెలిసింది. అది అమోఘమైనదంటే నమ్ము, సాహిత్యగ్రంథాలలో ఎన్నెన్ని సంగతులుంటాయను కొన్నావ్? సాహిత్యం ఒక చిత్రం, ఒకదాని ప్రతిరూపం; అదొక అద్దం. అందులో రాగద్వేషాలు వుంటాయి. చక్కని విమర్శ అంతర్వాహినిగా గర్భితమై వుంటుంది. వివేకవంతమైన విషయాలు ఎన్నో వుంటాయి. జీవితం ముమ్మూర్తులా ప్రతిబింబిస్తుంటుంది. ఇదీ సాహిత్యం. నిజంచెప్పొద్దూ, ఇవన్నీ వాళ్ళ సంభాషణలనుంచే నేను పరిగ్రహించాను. వాళ్లతోపాటు సిగరెట్లు కాలుస్తూ, వారి

సంభాషణలు ఆలకిస్తూవుంటే ఎంత సరదాగా వుంటుందని! కర్మంచాలక వాళ్లు వాదవివాదాలలోకిదిగారా, ఇక మనబోటి వాళ్ళం చచ్చామన్నమాటే. ఒక్క ముక్కకూడా మనకు అర్థంకాదు. అర్థం అయినట్లే నేనూ అందరితోపాటు తలూపు తుంటాను. నిజానికి నాకు వీసమెత్తుకూడా బోధపడదు. వాళ్ళ వాదవివాదాల అంతరార్థం ఈ మొద్దుబుర్రకు అంతు చిక్కుతుందా? వాళ్ళ చర్చలలో నేనూ తలదూర్చుదామని ప్రయత్నిస్తాను. కాని, ఎంత ప్రయత్నించినా సరియైన పదం, సరియైన వాక్యం ఒక్కటైనా నోటినుంచి బయటపడితేగా? అందుకే అన్నారు పెద్దలు: "గాడిదను మించిన గాడిద లేద"ని. మరి అలాంటప్పుడు నేనేమి చేయాలి? ఏదో ఒకపని చేయక తప్పదుగా? అందుకని అతని రచన ప్రతులు వ్రాసి పెట్టు తుంటాను. దీనివల్ల నాకు ప్రయోజనమూ వుంది; ఇతరు లకు ఉపయోగమూ వుంది. రచయితలు ఎంత సంపా దిస్తారో వూహించగలవా? ఉదాహరణకు రతజ్ యేవ్ నే తీసుకో. ఒక పేజీ వ్రాయడం అతనికేమీ లెక్కకాదు. రోజుకు అతను అయిదారు పేజీలుకూడా రాయగలడు. అందుకు అతను పొందే ప్రతిఫలం ఏమిటో తెలుసా? మూడువందల రూబుళ్ళు! అని అతను చెప్పగా విన్నాను: ఆమాటకొస్తే అయిదువందల రూబుళ్ళు సంపాదించే సందర్భాలు కూడా వున్నాయట. ఇది నమ్మశక్యమైన విషయంగా కన్పించక పోవచ్చు. అయినా ఇది యథార్థం. కావాలంటే ఈసారి వేయి అప్పుగా అడిగి చూదాం! అతని ఆటలు మన దగ్గరా సాగేది! అతని నోట్‌బుక్‌లో ఏడు వేల రూబుళ్ళువిలువచేసే

పత్రాలు వున్నాయంటే నమ్ము. ఎంతడబ్బో చూశావా, మూడంతస్తులమేడ లేస్తుంది. ఎవరో అయిదువేలకు అడిగారట. అతనేమంత పిచ్చాడా, అడిగినంతకు తన కవిత్వాన్ని తెగనమ్మటానికి? అతనికి నచ్చజెప్పాలని ఎంతో ప్రయత్నించాను. నీకు పుణ్యం వుంటుంది, ఈ కవిత్వం పారేసి మాటాడకుండా ఆ అయిదువేలు పుచ్చుకోమని చెవినిల్లుకట్టుకొని పోరాను. అయినా విన్నాడు కాదు. "ఈ పద్యాలకు ఏడు వేలు రావాలి." చూశావా ప్రియతమా, అతని తెలివితేటలు ఎంత గొప్పవో?

వట్టి వట్టి మాటలెందుకు? ఇదిగో చూడు. అతను రచించిన గ్రంథరాజం "ఇటాలియన్ రాగద్వేషాలు"లోని కొన్ని ఆణిముత్యాలు ఇవిగో:

> "నరనరాన అనురాగ తృష్ణ
> దీర్ఘశృతిలో ప్రవృద్ధ్వానిలో
> ప్రోత్సహించి, పురికొల్పగా
> కదిలెను వ్లాడిమీర్"

"రాకుమారీ, నేను నిన్నెంతగాఢంగా ఆరాధిస్తున్నానో గ్రహించావా? ఇప్పటికైనా అనుగ్రహించవా? నా ఉన్మాద స్థితిని కాంచలేవా? లేదు. నా స్వప్నాలు నన్ను మోసగించలేదు. నిన్నమితంగా ప్రేమిస్తున్నాను. కళ్ళులేని కబోదివలె, వళ్ళు తెలియని ఉన్మాదివలె నిన్ను ప్రేమిస్తున్నాను. నా హృదయంలో ఉవ్వెత్తున పైకెగసే అనురాగ జ్వాలా

ముఖి నీ భర్త శరీరంలోని యావత్ రక్తం ఒలికించినా, చిలికించినా ఆరబోదు. నా వక్షస్థలం ఒక బడబాగ్ని. అందులో దాగి వున్నది దావాగ్ని. అది ప్రజ్వలితమైందా ప్రళయం తప్పదు. ప్రణయం ప్రళయంగా రూపాంతరం పొందుతుంది. ముల్లోకాలను దగ్ధపటలం కావిస్తుంది. ఓ జినైదా, నా జినైదా !"

అతని కౌగిలిలో వాలిపోయి, అనిర్వచనీయమైన ఆనందడోలికలమధ్య తేలిపోతున్న ఆమె నెమ్మదిగా "వ్లాడిమీర్" అన్నది.

"ఓ జినైదా" అన్నాడు. ప్రేమతో మత్తెక్కిన స్మిల్‌స్కీ.

అతని ఉచ్ఛ్వాస, నిశ్వాసల వేగం హెచ్చింది. ప్రేమ దీపిక తృష్ణతైలంతో ధగధగా జేగీయమానంగా వెలుగుతోంది. పాపం, అదృష్టానికి నోచుకోని ఆ రెండు హృదయాలు విరహ వేదనతో ఆక్రోశిస్తున్నాయి.

ఆమె వక్షోజాలు పొంగాయి ఆమె చెక్కిళ్లు ఎర్రబారాయి. ఆమె కళ్లు జ్యోతులయ్యాయి. ఆమె మత్తిల్లింది. "వ్లాడిమీర్"

ఆ విధంగా రెండు శరీరాలు లీనమై, తాదాత్మ్యం పొందాయి.

..........................................

మరొక అరగంట తర్వాత ఆమె భర్త వచ్చాడు.

"సరే, అయితే మన అతిథికి అవసరమైన ఏర్పాట్లు పూర్తిచేయవద్దా, ప్రేయసీ" అంటూ అతను ఆమె చెక్కిలిపై ఓ చిన్న చిటికి వేశాడు.

చూశావా, వరెంకా? ఇదెంత బాగుందంటావు? ఏ మాటకు ఆమాటే చెప్పుకోవాలి. ఒకవ్యక్తి సామర్థ్యాన్ని ఒప్పుకోవాలి. అతను రచించిన మరొక కథ చూడు. దాని పేరు "యెర్మాక్ - జువైకా" సైబీరియాను జయించిన ఆ యోధానయోధుడు జువైకాను ప్రేమించాడు. ఆమె సైబీరియా జార్ కుచుమ్ కూతురు. జువైకా అతనికి బందీ.

ఇకచూడు. ఈ రచన ఎంత రమణీయంగా సాగుతుందో!

"నన్ను ప్రేమించావా, జువైకా? నన్ను ప్రేమించానని చెప్పు. మరొకసారి చెప్పు. వేయిన్నొక్కసారి చెప్పు."

"నిన్నే ప్రేమించాను. నిన్నే ప్రేమించాను యెర్మాక్" అని నెమ్మదిగా పలికింది జువైకా.

"అయితే, భూమిమీద స్వర్గం వెలిసిందన్నమాట. భూతలస్వర్గం దొరికింది. ధన్యుణ్ణి. భూతలాన్నే స్వర్గంగా మారుస్తాను. నాకు ఆనందవెలుగు అందించావు. సంతోష రవళి ప్రసాదించావు. నేను జన్మించిన దాదిగా నా హృదయం నీకోసం పరితపిస్తోంది. నిన్నే కలవరిస్తోంది; పలకరిస్తోంది. నా జీవితానికి ధృవతారవు నీవే. ప్రేమ సారథివీ నీవే. ఇక నా జువైకాను ప్రపంచమంతా వూరేగిస్తా. ఎవరేమన్నా, ఎవ రడ్డొచ్చినా ఇక నేను ఆగబోను. లతనుబోలిన ఆమె లేత మనస్సులో మమతను ఈ లోకం గుర్తిస్తే, ఆ చిన్నారి కను కొలకులనుంచి జాలువారే ప్రతి కన్నీటి బిందువులోను దోబూచులాడే ప్రేమగీతికను గమనిస్తే! ఆహా! ఆ గంధర్వ

లోకంనుండి ఊడిపడిన దేవకన్యా, నా ప్రేమ తృష్ణను తీర్చుమా సఖీ!"

దానికి జునైకా ఇచ్చిన జవాబేమిటి?

"“యర్‌మాక్, ఈ ప్రపంచం క్రూరమైనది. ఈ మనుష్యులంతా మనపాలిటి యమధర్మరాజులు. మనలను హాయిగా బ్రతకనివ్వరు. తన్ని తగిలేస్తారు. లోకంలోనుంచి వెలివేస్తారు. నీవు జీవించే సమాజం వట్టి కపటమైనది; ఆచారాల ఉరిత్రాళ్ళను మన మెడలకు తగిలిస్తారు. నిన్నూ నన్నూ ఎన్నటికీ ఈ లోకం అర్థం చేసుకోలేదు. ప్రియా, అర్థం చేసుకోలేదు."

"అలాగా? అయితే ఈ కోసక్ యోధుని వీరఖడ్గం వారి తలలపై విలయనృత్యం చేస్తుంది."

జునైకాను నిలువునా ఖూనీచేశారన్న వార్త విని, అతను ఎంతగా దుఃఖించివుంటాడో ఆలోచించుకో, వరెంకా. అర్థరాత్రి, గుడారంలో పడుకొని, నిశ్చింతగా నిద్రపోతున్న ఆమెను, దొంగచాటుగా గుడారంలో జొరబడిన ఆమెతండ్రి, గుడ్డివాడు, తన కూతురినే స్వయంగా కత్తితో పొడిచి ఖూనీచేశాడు. పాపం, ఆ గుడ్డివాడు అనుకొన్నాడు; తన సౌఖ్యాన్నీ, తన రాజ్యాన్నీ, తన వంశ మర్యాదనూ పొట్టబెట్టుకొన్న నీచుణ్ణి ఒక్క కత్తిపోటుతో హతమారుస్తున్నట్టు అతను భ్రమించాడు.

యెర్‌మాక్ పళ్ళు పటపట కొరికాడు. బండ రాతిపై తన కత్తిని నూరాడు. అది తళ తళ మెరుస్తోంది.

"వాడి పేగులు తీస్తాను. కక్ష సాధిస్తాను. దుర్మార్గుడిని దును మాడతాను.

జునైకామరి లేదన్న సంగతి తెలుసుకొని యెర్‌మాక్ నదిలోపడి ఆత్మహత్య చేసుకొన్నాడు. అక్కడితో ఈ కథ ముగుస్తుంది.

ఏమి హాస్యం, వరెంకా, ఏమి హాస్యం! ఎంత సున్నిత మైన, పరిశుద్ధమైన హాస్యం! ఈ కథను మాకు చదివి విన్పించినప్పుడు మేమంతా పొట్టలు చెక్కలయ్యేట్టు నవ్వామంటే నమ్ము. అలాంటి వ్యక్తి రతజ్‌యేవ్! తెలుసా. పాపం అతను వట్టి అమాయకుడు. ఈ కథలో ఏదో అభ్యుదయకర భావాలను, స్వేచ్ఛాలోచనను పొదిగాడని అనుమానించవలసిన అవసరం యీషణ్మాత్రం లేదు. ఒక విషయం తప్పక చెప్పితీరాలి. రతజ్‌యేవ్ సత్ప్రవర్తనపరుడు; అందుకే అతను ఉత్తమ రచయిత కాగలిగాడు. చాలామంది రచయితలకు ఈ విధంగా చెప్పుకొనేందుకు అంతగా వీలుండదు.

ఒకనాటికి నేనుకూడా గొప్ప రచయితనే కాగలనేమో? ఎవరు చెప్పగలరు? ఏమిటీ అర్థం పర్థంలేని ఆలోచన? ఒకవేళ ఒకరోజున మకార్ దెవ్రూష్కిన్ "గేయాలు" అన్న గ్రంథం నీ కళ్ళముందు వెలిస్తే, నీవు ఏమనుకుంటావ్? చెప్పు. నా చిన్నారి వర్యార్రీ, నీ వేమనుకొంటావో చెప్పు. నా మట్టుకు నేను నలుగురులో తలెత్తుకు తిరగలేనేమో నని పిస్తున్నది. ఎక్కడికెళ్ళినా "అదుగో, దెవ్రూష్కిన్. కవీ, సాహితీవేత్త అదుగో" "దెవ్రూష్కిన్ రచనలలో భావం తొణికిసలాడుతుంటుంది" అని అంతా అంటూవుంటే, సిగ్గువేయదూ?

పైగా, మాచికలు వేసిన ఈ బూట్లను ధరించి తిరగటం అవమానకరంకాదూ? కవీ, సాహితీవేత్త అయిన దెవ్రూష్కిన్ ఇలాంటి బూట్లు తొడిగి, తిరుగుతున్నాడని, లోకు లందరికీ తెలిస్తే, తల తీసివేసినట్టుకాదూ? నన్ను ఆ స్థితిలో చూసి మహారాణి ఏమనుకొంటుంది? అయినా మహారాణి ఇలాంటి విషయాలు పట్టించుకోకపోవచ్చులే. అందులోనూ ఒక గుమస్తా ఎలాంటి బూట్లు తొడుగుతున్నాడో ఆమెకు పట్టుతుందా? (ఎంత లేదన్నా ఇవీ బూట్లేకదా?) కాని, నా స్నేహితులే నాకు ద్రోహంచేస్తారు. అందులో సందేహంలేదు. ముఖ్యంగా రతజ్యేవ్ అందరిలోకి ముందుగా నాకు ద్రోహంచేస్తాడు. అంతవరకు ఖాయం. అతను తరచు మహారాణి దగ్గరకెళ్ళి వస్తుంటాడు. వారంతా పాతస్నేహితులు; ప్రాణమిత్రులు. అతనుచెప్పగా విన్నానులే. ఆమె కవిత్వం అంటే పడిచస్తుందట. ఆహా, రతజ్యేవ్ ఎంత ప్రతిభావంతుడు.

సరి, ఈ సోది ఇక్కడితో సరిపెడదాం. నవ్వేతాలకి ఇదంతా వ్రాశాను, నీకు వినోదం కల్గించేందుకు. సెలవు, ప్రియతమా, ఏదో పిచ్చాపాటీ విషయాలు ఏకరువు పెట్టాను. ఎందుకోగాని ఇవాళ నా మనస్సు చెంగు చెంగున గంతువేస్తోంది. ఇవాళ రతజ్యేవ్ ఇంట్లో విందారగించాం. వాళ్ళు (ఆ నీచులు!) వైన్‌కూడా త్రాగారు. ఇవ్వన్నీ నీకు వ్రాయవలసిన విషయాలు కాదనుకో. అయినా వీటిని గురించి నీవు అంతగా పట్టించుకోకు. నన్ను గురించి అపోహపడకు. అపార్థం చేసుకోకు. ఊసుపోక రాసిన రాతలు యివి. అంతే. మరేమీ కాదు. నీకు పుస్తకాలు పంపిస్తాలే. తప్ప

కుండా పంపిస్తాను...ఇక్కడ ఒక పుస్తకం వుంది కాని, అది నీవు చదవతగిన పుస్తకం కాదులే. లైంగిక అవినీతిని ప్రోత్స హించే ఈపుస్తకాన్ని నీతిమంతులైన విమర్శకులంతా దులిపి వదిలేశారని వినికిడి. నీకు ఒక అరవీశెడు పంచదార మిఠాయి పంపిస్తున్నాను. నీ కోసం ప్రత్యేకంగా తెచ్చానులే. హాయిగా ఆ మిఠాయి తిను. ఒక్కొక్క మిఠాయి వుండ తింటూ నన్ను గుర్తుచేసుకొంటూ వుండు. నీవు పళ్ళరసం మాత్రమే తాగుతూ వుండు. పళ్ళు తినకమ్మా. నీకు ఏమి కావలసినా జాబు వ్రాయి. సరే, సెలవు, వరెంకా సెలవు. నీకు దైవానుగ్రహం కలుగుగాక. నా చిన్నారి వయ్యారీ, నే నిక వుంటా.

నీ ఆప్తమిత్రుడు,

మకార్ దెవ్రూష్కిన్.

ప్రియమైన మకార్ అలెక్జీవిచ్,

కావాలంటే నాకు మంచి ఉద్యోగమిచ్చి సహాయపడే వారు చాలామంది కలరని ఫెడోరా అంటోంది. శ్రీమంతుల యిళ్లలో ఆయా ఉద్యోగాలు చాలా ఖాళీగా వున్నాయట. అందుకు ఒప్పుకోటమా? ఒప్పుకోక పోవటమా? ఈ విషయంలో నీ సలహా ఏమిటి? ఆ ఉద్యోగానికి నేను అంగీకరిస్తే, ఇంకెంతమాత్రం నీకు నేను భారంగా వుండను. పైగా ఆ వుద్యోగంకూడా లాభసాటి యైనది. పోతే, నన్నొకటి పట్టుకు పీడిస్తోంది. ముక్కూ-మొఖం ఎరుగని యింట్లో ప్రవేశించటం భయంగా వుంది. వాళ్ళంతా శ్రీమంతులు. వారిలో నానారకాలవారు వుంటారు; ఒకవేళ వారు "నీ గత చరిత్ర ఏమిటి?" అని అడిగితే, నేను ఏమని చెప్పాలి? అదేమిటోగాని వారి వింత మనస్తత్వం, జనాన్ని చూస్తేనే నాకు భయమేస్తుంది. బాగా పరిచయంవున్న చోటులలో మాత్రమే జీవించటానికి అలవాటుపడ్డాను; జీవితం దుర్భరంగా వున్నా అలాంటి చోటులలోనే జీవించా లనిపిస్తుంది. ఉద్యోగం కోసం కొత్తచోటుకు వెళ్ళితే, అక్కడ ఏమేమి పనులు చేయవలసివస్తుందో? పిల్లలను సాకటంవరకే పని పురమాయిస్తారా? లేక యింకేమన్నా చేయమంటారా? చీటికి మాటికి ఆయాలను మార్చేస్తుంటారని కూడా విన్నాను. మకార్ అలెక్జీవిచ్, నీకు పుణ్యం వుంటుంది, ఏమి చేయ

మంటావో చెప్పు. ఆయా ఉద్యోగంలో చేరమంటావా? వద్దంటావా? మా యింటిగడప తొక్కటమే బొత్తిగా మానేశావు. కారణమేమిటో తెలియదు. ఈమధ్య అసలు నీ దర్శనమే పూర్తిగా కరువైపోయింది. ఏదో ఆదివారాలలో మాత్రం చర్చిలో కలుస్తుంటాం. నాలాగానే నీవుకూడా చాలా వింతమనిషిలాగా కన్పిస్తున్నావు. నేను దాదాపు నీకు బంధువునిగదా! మకార్ అలెక్సెవిచ్, దయచేసి నాపై అనురాగం వలికించకు; ఏకాంతంగా కూర్చొని విచారిస్తుంటాను. ముఖ్యంగా సాయంసమయాల్లో ఒంటరిగా కూర్చొని ఆలోచిస్తుంటాను. ఫెడోరా ఏదో పనిమీద ఎక్కడికో పోతుంది. నేను ఒక్కదానినే ఒంటరిగా కూర్చొని గతాన్ని తలపోస్తూ, విలపిస్తాను. గతమంతా చలనచిత్రంవలె నా మనోనేత్రంలో దొర్లుకుపోతుంది. సుపరిచితమైన ముఖాలు ప్రత్యక్ష మవుతాయి (అవన్నీ సాక్షాత్తూ సాక్షాత్కరించినట్లు తోస్తుంది). అందరికంటే ఎక్కువగా అమ్మ తలపుకొస్తుంది. నేను కనే కలల సంగతి ఏమని చెప్పను? నా ఆరోగ్యం బొత్తిగా పాడైపోయి నట్లనిపిస్తోంది. కదిలితే ఆయాసంగా వుంటోంది. ఈవేళ పొద్దున్నే లేస్తూ తూలి పడిపోయాను. స్పృహ తప్పినంత పని అయింది. కొంతకాలంగా పొడుదగ్గు పట్టుకు పీడిస్తోంది. త్వరలో చచ్చిపోక తప్పదనిపిస్తోంది. నేను చచ్చిపోతే, నా కోసం విచారించేవారు, దుఃఖించేవారు, నా భౌతిక కాయానికి అంత్యక్రియలు జరిపేవారు ఎవరున్నారు? బహుశా ఎక్కడో ముక్కూ ముఖమూ ఎరుగని కొత్త

యింట్లో, కొత్తచోట తనువు చాలిస్తాను. ఆరిభగవంతుడా, నా కింత దురవస్థ ఎందుకు తెచ్చిపెట్టినట్టు!

మకార్ అలెగ్జెవిచ్, నీ పిచ్చికాకపోతే, ఎందుకా మిఠాయి పదే పదే పంపిస్తున్నావు? దీని కంతటికీ డబ్బు ఎక్కడనుంచి తెచ్చి తగలేస్తున్నావ్? ప్రియమిత్రమా, నా మాటవిని, డబ్బు పొదుపు చేసుకో. నేను అల్లిక అల్లిన దుప్పటి అమ్మటానికి ఫెడోరా బజారుకు పట్టుకెళ్లింది, కనీసం యాభై రూబుళ్ళు చేతికొస్తాయి. అంత మొత్తం వస్తుందని నేను అనుకోలేదు. అందులో మూడురూబుళ్లు ఫెడోరాకు యిస్తాను. నే నొక చక్కని ఫ్రాక్ కుట్టుకుంటాను. నీకొక మంచి వెయిస్ట్‌కోటు స్వయంగా కుట్టిపెడతానులే.

ఫెడోరా ఒక పుస్తకం తెచ్చింది. దానిపేరు *"ది టేల్స్ ఆఫ్ ఇవాన్ బెల్కిన్" దానిని నీకు పంపిస్తున్నాను. నీకు నచ్చితే చదువు. దయచేసి దానినిమాత్రం తడిపి ముద్ద చేయకు. త్వరగా చదివేసి తిరిగి పంపించేయి. రెండేళ్ళక్రితం నేనూ, మా అమ్మా కలసి ఈ పుస్తకం చదివాం. మళ్ళీ ఈ పుస్తకాన్ని ఒంటరిగా కూర్చొని చదువుతుంటే, నన్ను విచారం ఆవహించింది. నీదగ్గరేమన్నా పుస్తకాలుంటే, దయచేసి పంపించు. రతజ్యేవ్ రచనలుమాత్రం పంపబోకు. ఆ చెత్త పుస్తకాలను చదవలేక చచ్చిపోతాను. ఏదో బుద్ధికి తోచినదల్లా రాసేశాను. వాగేశాను. మరి శెలవు ఇప్పిస్తావా? మళ్ళీ మనస్సు వ్యాకులంగా వున్నప్పుడు మరొక సుదీర్ఘమైన లేఖ వ్రాస్తాలే. బరువెక్కిన హృదయాన్ని తేలిక

* 1830 లో పుష్కిన్ రచించిన కథల సంపుటి - [సం.]

చేసుకోటానికి నాకు మిగిలిన మార్గం ఇదే. శెలవు, ప్రియ మిత్రమా శెలవు.

నీ

వి. డి.

జూన్, 28

వర్వారా అలెగ్జియేవా, నా ప్రేమ పతంగమా!

నీవు అంత నిస్పృహ పొందనేల? నిరాశ చెందనేల? రా, రా, ఓ నా దేవకన్యా! నీకు అలాంటి ఊహాలు, తలపులు పెట్టుకోనేల? నీకు అసలు ఎలాంటి రుగ్మత లేనే లేదు. నా మాట నమ్ము ప్రియా. నీకేమిటి జబ్బేమిటి? వికసిస్తున్న పువ్వంవలె పరిమళిస్తున్నావు. ఎండ తాకిడికి పూవు వాడినట్లు కొంచెం నీ మొఖం వాడిపోయింది. అంతే. అయినా వికసించే పుష్పానికి పరిమళం కరువవుతుందా చెప్పు? నీవు కన్న కలలేమిటి? నీ ఊహాపథంలో మెరిసిన చిత్రాలేమిటి? చెప్పవూ? ప్రియతమా, లేనిపోని ఆలోచనలతో

ఆరోగ్యం పాడుచేసుకోకు. అదేమిటోగాని, నాకు యిప్పుడు హాయిగా నిద్రపట్టుతోంది చింతలూ, వేదనలూ మటు మాయమై పోయాయి. ఎందుకలా నావంక చూస్తావ్ ! నేను హాయిగా, దుంగలాగా నిద్రపోతున్నాను. మనస్సు సంతోషంతో గంతులేస్తోంది. యినకునివలె బలిష్ఠంగా వున్నాను. నిజం. నామాట నమ్ము. రమ్ము. రమ్ము, వరెంకా. వచ్చి నిశ్చింతగా జీవించు. నీ చిలిపి మనస్సులో దోబూచులాడు తున్న భావా లేమిటో నేను ఊహించగలను. చీటికి, మాటికి, చింతిల్లుతూ, విచారాన్నీ, వేదననూ పొందుతూ కూర్చోకు. కనీసం నా కోసమైనా, నా మేలుకోరి అయినా ఆపని చేయకమ్మా. పోతే, ఆయా ఉద్యోగం సంగతంటావా, వద్దు, వద్దు. ముమ్మాటికీ ఆ పాడు ఉద్యోగం వద్దు. నీకు అసలు ఆ పాడు యోచన ఎలా తట్టింది. నన్ను విడిచి, ఎక్కడికో దూరంగా పోతావా ? వీల్లేదు. పోవటానికి వీల్లేదు ప్రియతమా! నీవు నన్ను విడిపోతే, నేను బ్రతకలేను. ఏమైనా సరే నేను అందుకు ఒప్పను. నీవు లేమిచేత సతమతమవు తూంటే నేను చూడలేను. అవసరమైతే తల తాకట్టుపెట్టి అయినా సరే, నీ కష్టాలను కడిగేస్తాను. ఎవరింటోనో ఆయాగా పనిచేయటం నీకు తగదు. ఆ యోచనే అవివేక మైనది. ఈ తలంపు నీదికాదన్న సంగతి నాకు తెలుసు. ఇదంతా ఫెడోరా ప్రేరణే అయివుంటుంది. అది శుద్ధ తెలివి తక్కువ దద్దమ్మ. దాని మాటలను నమ్మబోకు. ఫెడోరా ఎలాంటిదో నీకింకా పూర్తిగా తెలియదు. అది దాని మొగు డిని వేధించుకు తిని, మరీ ప్రాణాలు తీసింది. పాపం, వాడు

చచ్చి ఏలోకాన వున్నాడో! బహుశా అది నిన్ను రెచ్చ గొట్టి వుంటుంది. నీవే కనుక నాపై ఆగ్రహించి, నన్ను వీడి పోతే ఇక ఈ లోకంలో నాకు మిగిలే దేముంది? అయినా ఇప్పుడు నీకొచ్చిన లోటేమిటి? నీ పుణ్యమా అంటూ నేను కాస్త సుఖంగా జీవించగల్గుతున్నాను. అయినప్పుడు ఇప్పుడు ఇలాంటి ఆలోచన ఏల? నచ్చిన పుస్తకాలు నీవు చదువుకో వచ్చు; అల్లికపని చేసుకోవచ్చు. కావాలంటే కుట్టుపని మానేసి, పుస్తకాలే చదువుతూ కాలక్షేపం చేయొచ్చు; అంతేకాని, నన్ను వదిలేసి మాత్రం పోవద్దు. నీవు పోతా నన్నా నేను పోనిచ్చేదిలేదు. నీకు కావలసిన పుస్తకాలన్నీ తెచ్చి పెడతాను. మనిద్దరం కలిసి మళ్ళీరోజూ సాయంత్ర వ్వాట షికారుకు వెళ్ళదాం. ఆ పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేయి. నిన్ను చూడటానికి వస్తాను. చాలా త్వరలోనే వస్తాను.

•

మనస్సు విప్పి చెప్పినందుకు మన్నించు. మనస్సులో విషయం దాచుకోటం నాచేతకాదు; దాపరికంతో మసలు కోటం సిగ్గుచేటు. నిజం, ప్రియతమా, అది బహు చెడ్డ అల వాటు. నే నంతగా చదువుకొన్నవాణ్ణికాకపోవచ్చు. పెద్దలు సామెత చెప్పినట్లు, నాది కేవలం నానాకాలపుచదువు. నా గొడవకేమి వచ్చెనుగాని, రతజ్ యేవ్‌ను గురించి కొన్ని విషయాలు ముచ్చటించదలచాను. అతని తరఫున వకాల్తా పుచ్చుకొంటున్నందుకు క్షమించు. అతడు నా ఆప్తమిత్రుడు. అందుకని అతనిమీద ఈగవాలినా నేను సహించలేను. అతని రచనలు మహా రమణీయంగా వుంటాయి. నిజం.

వాటిలో పస లేకపోవటం అంటూ వుండదు. ఈవిషయంలో నేను నీతో ఏకీభవించను; ఎందుచేతనో ఏకీభవించ లేక పోతున్నాను. అతని రచనల్లో ఎమకం, గమకం బహు పసందుగా వుంటాయి. కవితాధార సెలయేరువలె జలజల ప్రవహిస్తుంది. చెవికి యింపు, కంటికి సొంపు చేకూర్చేవర్ణన, చిత్రణ కొల్లలు. ఇక భావాలా అమోఘం. చెడ్డవనేందుకు వీల్లేదు; బహు దొడ్డవి. బహుశా నీవు సద్భావంతో, సదుద్దేశంతో అతని రచనలను చదివి వుండవు. అందుకే అవి నీకు రుచించలేదు. లేదా చికాకులో, విసుగుదలసమయంలో నైనా చదివివుంటావు. ఒకవేళ ఫెడోరాతో పోట్లాడో లేదా మరొక అవాంఛనీయఘటన జరిగిన నెను వెంటనేనో వాటిని నీవు చదివివుండవచ్చు. లేకపోతే, అవేమిటి, నీకు నచ్చక పోవటమేమిటి ? సరేంకా, నామాటవిని వాటిని మళ్లీచదువు. కాస్త జాగ్రత్తగా దృష్టిని లఘ్నంచేసి చదువు. మనసు ఉల్లాసంగా ఉన్నప్పుడు చదువు. చదివేముందు ద్రాక్షరసంసేవించి మరీ చదువు. అప్పుడు నీకే తెలుస్తుంది. రతజ్ యేవ్ రచనల గొప్పతనం ఏమిటో ? రతజ్ యేవ్ కన్నా గొప్పరచయితలు లేరని నేను అనను. అతనికన్నా ఉత్తమరచయితలు ఉండవచ్చు. అది నేను కాదనను. అయితే ఒకటిమాత్రం వాస్తవం. రతజ్ యేవ్ కూడా మంచిరచయితే. గొప్పరచయితలు మరి కొందరు వున్నంతమాత్రాన ఇతడు చెడ్డవాడై పోడుగా ? అంతే ప్రియతమా, మరి సెలవు. ఇక నేను వ్రాయగల్గింది లేదు. పైగా ఈవేళ నేను హడావిడిలో వున్నాను. ఓ నా చిన్నారి వయ్యారీ, మనోవ్యాకులతతో పిచ్చిపిచ్చిఆలోచనలకు

పోకు. భగవంతుడు నీకు సదా అండగా వుండుగాక. మరి నే నిక వుంటా.

నీ ఆప్తమిత్రుడు,

మకార్ దెవూష్కిన్.

తాజాకలం: నీవు పంపిన పుస్తకం అందింది. అందుకు ఎనలేని ధన్యవాదాలు. నేను పుష్కిన్ రచనలు చదువు తుంటాను. ఇవాళ, బహుశా సాయంత్రం నిన్ను కలుస్తాను.

జూలై 1

ప్రియమిత్రమా, మకార్ అలెగ్జీవిచ్,

ఇక్కడ, మీ మధ్య జీవించే యోగ్యత నాకు లేదను కొంటాను. లాభసాటియైన అవకాశం చేజిక్కినప్పుడు, చేజేతులా పాడుచేసుకోటం పొరపాటని దీర్ఘాలోచనానంతరం గ్రహించాను. ఏదో నా పొట్ట నేను పోషించుకొంటాను.

నా విషయంలో దాక్షిణ్యాం చూపిన ఆ అపరిచిత కుటుంబా నికి నా శక్తికొలదీ సేవచేయటానికే యత్నిస్తాను. సాధ్యమైతే నా స్వభావాన్ని మార్చుకోటానికి ప్రయత్నిస్తాను. అపరిచితుల మధ్య జీవించటం, వారికి సంతృప్తినిచ్చి, వారి నుంచి మెప్పుపొందగలగటం కష్టమే ననుకో. అచ్చోట గుట్టుమట్లు లకు అవకాశం లేనిమాటా నిజమే. అయినా పైన భగవంతు డున్నాడు. ఆపత్సమయంలో ఆదుకొంటాడన్న విశ్వాసం వుంది. కలకాలం ఇలాగే సిగ్గుపడుతూ, బిడియపడుతూ లోకానికి దూరంగావుంటూ జీవించటం సాధ్యంకాదుగదా? కొత్తవాళ్ళ మధ్య జీవించటం నాకు కొత్తేమీకాదు. ఇంతకు ముందు ఇవన్నీ అనుభవించినదాన్నే. బోర్డింగ్ పాఠశాల అనుభవాలను యింకా మరచిపో లేదు. ఆదివారాలలో ఇంటికి రాగానే నరకంలోనుంచి స్వర్గంలోకి ఊడిపడినట్టుండేది. ఇంటిదగ్గర అమ్మ తిట్టినా, కొట్టినా అదీ అదోమాదిరి ఆనం దానికి హేతుభూతమయ్యేది. ఆదివారం అంతమై, సోమవారం నస్తుందంటేనే ఎంతో బాధగా వుండేది. సోమవారం 9 గంట లకే స్కూలుకు వెళ్ళక తప్పేదికాదు. బడిలో అంతా కొత్తే. అప్యాయత మచ్చుకైనా కానరాదు. పంజరంలోని చిలుకవలె బ్రతుకు వెళ్ళబుచ్చాలి. పంతులమ్మలు ఎప్పుడూ కస్సు బుస్సు మంటూ వుండేవారు. నిజంగా నాకు ఏడుపు వచ్చేది. ఎక్కడనో ఓ మూల జేరి, ఎవరికీ కనపడకుండా దాగి వెక్కి వెక్కి ఏడ్చేదాన్ని. నా జీవితచరిత్ర పుటలన్నీ ఇలా విచార, విషాద అనుభవాలతో నిండి వున్నాయి.

అదీకాక, నీకూ, ఫెడోరాకూ భారంకావటం నాకు సుతరామూ నచ్చటంలేదు. ఎంతకాలమని మీ యిద్దరిపై

ఆధారపడి జీవించటం? పరులపై ఆధారపడి జీవించటం కన్నా మనస్సహ్యమైనది మరొకటి లేదు. వాస్తవాలను నిర్మొఖమాటంగా నీతో ముచ్చటిస్తున్నందుకు మన్నించు. నామూలాన ఘోరాకు క్షణం విశ్రాంతి లేకుండా పోతోంది. ఆ ముసలి దాన్ని ఇంకా ఎంతకాలం ఇలా కష్టపెట్టమంటావు? నీకొచ్చే జీతమంతా నా కోసమే ఖర్చుచేస్తున్నావు. చివరకు తల తాకట్టుపెట్టయినా సరే, నా సౌఖ్యానికి లోటు లేకుండా చూస్తాననికూడా నీవు వ్రాశావు. ప్రియమిత్రమా, నీ హృదయం వెన్నపూసవంటిదని నాకు తెలుసు. కాని, దినం గడవటమే చూసుకొంటే, మరి తనువు గడిచేదెట్లా? నీవే ఆలోచించు. నా ఆరోగ్యం అంతంతమాత్రంగా వుంది. కష్టపడి పనిచేసే సత్తువ ఎంట్లో లేదు. సోమరిపోతువలె జీవించటం మనబోటి వాళ్ళకు సాధ్యమా! అయినా నీకు నేను అంతగా అవసరమా? నేను నీకు చేయగల్గిన మేలు ఏమిటి? మనసారా నిన్ను ప్రేమిస్తున్నాను. నీవు నాకు అత్యంత ఆత్మీయుడవు – కాని నా రాత ఇలా వుంది: ప్రేమించగలను. కాని నా ప్రేమ ఎందుకూ కొరగాని వస్తువు. నీ రుణాన్ని నేను ఏ విధంగానూ తీర్చుకోలేను. ఇక నన్ను పోషించటం శుద్ధ దండుగ. మరొకసారి ఆలోచించు. ఏ విషయమూ వెంటనే తెలియజేయి. నీ జవాబు కోసం ఎదురుచూస్తూ వుంటా.

నీ అనురాగమాల,

వి. డి.

వరేంకా, ఏమిటీ చాదస్తం, ఎందుకీ పిచ్చి ఆలోచనలు! ఒంటరిగా వుంటే నీ బుర్ర పూర్తిగా చెడిపోతున్నట్టున్నది. నీకు ఇదీ నచ్చదు; అదీ నచ్చదు. ఆలోచిస్తే అంతా అయోమయంగావుంది. మళ్ళీ నీకిదే చెప్పటం: పిచ్చి పిచ్చి ఆలోచనలు కట్టిపెట్టు. మనసు విప్పి, నీకేమి కావాలో చెప్పు. మనిద్దరి జీవితాలు పరస్పరానురాగబంధనాలతో బంధితమైనాయి. చీకూ చింత లేకుండా హాయిగా జీవిస్తున్నాం. ఇంతకన్నా మనకు కావలసిం దేముంది! పరాయిచోటుకు పరుగెత్తితే మనకు ఒరిగే దేమిటి? పరాయివాళ్లు ఎలాంటి వారో నీకు తెలియదు ప్రియతమా! వాళ్ళు ఎలాంటివాళ్లో నన్నడుగు; నేను చెప్తాతా. వాళ్ళ లోతుపాతుల గుట్టుమట్టులు ఆమూలాగ్రంగా నాకు తెలుసు. వాళ్ళ ప్రవర్తన ఎట్టిదో రుచిచూసిన నాకు తెలుసు. వాళ్ళు పాషాణులు. నిజం, వరేంకా, నామాట నమ్ము. వాళ్ళు తిట్టే తిట్లకు అంతుండదు. తోటకూరలో పురుగును చూసినట్లు నిన్ను చూస్తారు. వట్టి నీచులు. పరమ కిరాతకులు. ఇక్కడ హాయిగా పంజరంలోని చిలుకవలె జీవించక పోయి పోయి ఆ కసాయికూపంలో పడతానంటావే? నీవు మమ్ము వీడి పోతే, మా గతేమికాను? మా హృదయాలు వ్రక్కలై పోవూ? సన్నిస్థితిలో వదిలిపెట్టిపోవటం నీకు తగునా? చెప్పు, వరేంకా! నీవల్ల ఎట్టి ప్రయోజనం లేదంటావా? శుద్ధ దండుగంటావా? ఎవరంటూ రామాట? నీవంటే మాత్రం

నేను ఒప్పుకోవద్దూ? నీవల్ల నా కెంతో మేలు కలుగుతోంది. నీవే ఆలోచించు. నీ ప్రభావం నాపై ప్రసరించిన ఫలితంగా ......ఉదాహరణకు ఈ క్షణంలో నిన్ను గురించే తలపోస్తూ, అనిర్వచనీయమైన ఆనందం పొందుతున్నాను......అంతేనా ......అడపా దడపా నా హృదయావేదనకు అక్షరరూప మిచ్చి, నీకు లేఖలు వ్రాస్తున్నాను......నీ దగ్గరనుంచి సవివరమైన, సుదీర్ఘమైన జవాబులు అందుకొంటున్నాను ......నీకు మంచి మంచి దుస్తులు కొనిపెట్టగలను...... నీ కొక హ్యాట్ కూడా కొనుక్కొచ్చాను.......నా నుంచి నీవు కోరదగినవి యింకా అనేకం వున్నాయి. అయినప్పుడు నీవల్ల ఎట్టి ప్రయోజనం సిద్ధించబోదంటే నే నెలా నమ్మను! నీవు యీ అభాగ్యుడిని వంటరిగా వదిలేసి పోతే, ఏ డేమైపోవాలి? బహుశా నీవు యీ విషయం ఆలోచించి వుండవు. అవునా, వరెంకా! ఈ అభాగ్యు డిని గురించి ఆలోచించకపోవటం నీకు ధర్మమేనా, చెప్పు? నిన్ను నీవు యీ విధంగా ప్రశ్నించుకో! పాపం, నేను వెళ్లిపోతే, ఇతని పరిస్థితి ఏమిగాను? నీ సాన్నిహిత్యానికి అలవాటు పడ్డాను. ఇక నీవులేకపోతే, నాకు మిగిలిందల్లా ఒకటే. ఏ నుయ్యో గొయ్యో చూసుకోటం. అంతే. అంతకన్నా నేను చేయకల్గిం దేముంది? ఇది నీకు తగదు, వరెంకా. ఈ పాతకానికి వడిగట్టకు. నీ పుస్తకం తిరిగి పంపి స్తున్నాను. ఈ పుస్తకం ఎలావుందో చెప్పమంటావా? నా జీవితంలో ఇంతకన్నా మంచిపుస్తకం చదివి ఎరుగను. నేను వట్టి మూర్ఖశిఖామణిని. అందుకు భగవంతుడు నన్ను

క్షమించుగాక. నిజంచెప్పాల్సివస్తే నేను అసలు ఏ అడవిలోనో పుట్టవలసినవాణ్ణి. ఏ విషయంగురించీ నాకు సరిగా తెలియదు గదా! కేవలం అజ్ఞానిని. "ఒకమానవుని చిత్రం". చాలా మంచిపుస్తకం; మరొక రెండు పుస్తకాలుమాత్రం చదివాను. ఇప్పుడు నీవు పంపిన పుస్తకంలో * "స్టేషన్‌మాష్టర్" కథ పఠించాను. దీనినిబట్టి నే నెంత అవివేకినో నీవు గ్రహించ వచ్చు. చక్కని గేయరూపంలో విరచితమైన తన జీవితగాధ నే ఇన్నేళ్ళవయస్సు వచ్చేదాకా చదవని వ్యక్తిని ఏ మనాలి? ఈ కథను చదువుతున్నకొలదీ అన్నివిషయాలు కళ్ళకు కట్టి నట్లు సుబోధకం కాజొచ్చాయి. అందుకే ఈ పుస్తకం నాకు బాగా నచ్చింది. ఇంతకన్నా తెలివితేటలు ఒలికించే పుస్త కాలు చదివాను గాని, దీనివలె వాటిని మెచ్చుకోలేక పోయాను. ఈ పుస్తకం నా హృదయాన్ని చూరగొన్నది. మిగతా పుస్తకాలు నా మనస్సును మెలివేశాయి. అదీ తేడా. ఉద్గ్రంథాలు చదవటం నా స్వభావానికి వ్యతిరిక్తం. కాని ఈ పుస్తకం చదువుతూంటే, దీనిని వ్రాసింది నేనే అనిపిం చింది. ఇందులోని ప్రతివాక్యం నా నోటినుంచి ఊడిపడ్డట్టే వుంది. ఇందులోని ప్రతిమాట నా హృదయాన్ని స్పదింప చేసింది. ఈ పుస్తకాన్నిగురించిన నా అభిప్రాయం ఇదే. చాలా సరళంగావుంది. ఇలాంటి పుస్తకాలైతే నేనూ వ్రాయ గలను. ఎందుకు వ్రాయలేను? దీనిలోని భావాలన్ని నావి గానే తోస్తున్నాయి. ఇందులోని పాత్రలన్నీ నాకు సుపరి చితాలే ననిపించింది. ఈ పుస్తకం చదువుతూ కంట తడిపెట్టా

---

* "టేల్స్ ఆఫ్ ఇవాన్ బెల్కిన్" పుస్తకంలోని ఒక కథ—అను.

నంటే సమ్ము. శామ్సన్ ఎరిన్ అనే పాత్ర, పాపం దురదృష్టవశాత్తు త్రాగుడు, దురలవాటుకు లోనైపోతాడు. తప్ప త్రాగి, పగలంతా ఎక్కడో కటికి నేలపై పడి దొర్లుతూ, బెత్తెడుమందాన మురికి దేరిన తన కోటుతో కళ్ళంట ప్రవహించే కన్నీటి ధారలను తుడుచుకొంటూ, ఎక్కడో దూరాన వున్న తన కూతురును గురించి తలచుకుంటూ కాలక్షేపం చేస్తాడు. అదీ జీవితం. మరొకసారి చదువు. జీవితం ఉట్టిపడే రచన. అలాంటి జీవితాన్ని నేను స్వయంగా అనుభవించినవాణ్ణి. థెరెస్సా విషయం లేదా గుమస్తా విషయంచూడు. మనమందరం ఈ సమయంలో ఒకే కోవకు చెందినవాళ్ళం. మనందరి బ్రతుకులు సామాన్యాలే. మన జీవితాలలో ఏదైనా సంభవించవచ్చు; ఏమి సంభవించినా ఆశ్చర్య పడవలసిన పని లేదు. నన్ను వదిలేసి పోతానంటున్నావ్, అది నీకు భావ్యమేనా, ప్రియతమా? ఈపుస్తకంలోని వింక్ పాత్రవలె నేనూ త్రాగుడు దుర్వ్యసనానికి లోనై జీవితాన్ని మరింత దుఃఖభాజనం చేసుకొన్నా చేసుకోవచ్చు. అందుచేత నాయందు దయయుంచి, ఆ తలంపు విరమించుకో, వరెంకా. నన్ను అనవసరంగా వేధించకు. బాధించకు. చెడుసలహాలకు చెవియొగ్గకు. నీవు పంపిన పుస్తకాన్ని మరొకసారి శ్రద్ధగాచదువు. అది నీకు మేలు చేకూర్చుతుంది.

"స్టేషన్ మాస్టర్" ను గురించి రతజ్యేవ్‌కు చెప్పాను. అతను దానిని పుక్కిటి పురాణంక్రింద జమకట్టాడు. ఆధునిక పుస్తకాలలో భావవైచిత్రి, వర్ణనలు బ్రహ్మాండంగా వుంటాయన్నాడు. అదేమిటో నాకు బొత్తిగా అర్థంకాలేదు.

మొత్తంమీద పుష్కిన్ మంచి రచయితేనని, రష్యాకు పేరు ప్రతిష్ఠలు ఆర్జించిన వ్యక్తి అని అతను ఒప్పుకొన్నాడు. అవును, వరెంకా, ఈ పుస్తకం చాలా మంచిది. తప్పకుండా మరొకసారి చదువు. నా మాట విని, నా సలహా మేరకు తప్పకుండా చదువుతావుగా? భగవంతుని కృపాకటాక్షం సదా నీపై ప్రసరించుగాక.

నీ ఆప్తమిత్రుడు,

మకార్ దేవుష్కిన్.

జూలై, 6

*ప్రియమైన మకార్ అలెగ్జెవిచ్,*

ఈవేళ ఫెదోరా పదిహేను వెండి రూబుల్లు పట్టుకొచ్చింది. అందులో మూడు రూబుల్లు ఆమె కిచ్చాను. ఆ మూడు రూబుళ్ళ చేతపడగానే ఆమె ముఖం చాటంత అయింది. పాపం, వట్టి అల్ప సంతోషి. ఈ ఉత్తరం చాలా హడావిడిలో వ్రాస్తున్నాను: నీకు కోటు కుట్టేపనిలో మునిగి

వున్నాను. కోటుగుడ్డ చాలా మంచిది. కళ్ళు జిగేల్‌మంటు న్నాయి. నీకు మరొక పుస్తకం పంపిస్తున్నాను. కథలసంపుటి. నేను వాటిల్లో కొన్నికథలు చదివాను. అందులోని "ది సర్వీస్ కోట్"* అన్నకథను తప్పక చదువు. నాటకశాలకు నీతో కలసిరమ్మని అంతగా వత్తిడిచేస్తా వెందుకు? టిక్కెట్లు లకు బోలెడు డబ్బు తగలేయాలి కదా? ఒకవేళ నాటక శాలకు వెళ్లటం తప్పనిసరి అయితేమటుకు, తక్కువ తరగతి టిక్కెట్లుకొను. నాకు ఊహవచ్చిన తర్వాత నాటకశాలకు వెళ్లినట్టు నాకసలు గుర్తులేదు. ఏది ఏమైనా, నాటకం చూడటానికి డబ్బు వృథా చేయటం భావ్యమేనా అని నా భయం. ఫెదోరా శిరః కంపనం ఏమీ తగ్గలేదు. నీవు తలకు మించిన ఖర్చులు చేస్తున్నట్టు ఫెదోరా చెప్పింది. ఈ విషయం ఆమె చెప్పినా, చెప్పకపోయినా నేను గ్రహించగలను. నా కోసమే నీవు ఎంతడబ్బు తగలేశావో కదా! ఇలాగైతే ఎప్పుడో ఒకప్పుడు ముప్పు ముంచుకు వస్తుందని భయంగా వుంది. అద్దె విషయమై ఇంటి యజమానురాలితో నీవు వాదులాడినట్లు ఫెదోరా చెప్పింది. మకార్ అలెక్సెవిచ్, నీ వ్యవహారం చూస్తుంటే నాకు మహాభయంగా వుంది. సెలవు. ప్రస్తుతం చాలా తొందర పనుల్లో వున్నాను. నీ హ్యాటు రిబ్బను మార్చుకోవలసి వుంది.

వి. డి.

తాజాకలం: మనం నాటకశాలకు వెళ్లటమే తట స్థించితే, నేను కొత్తహ్యాట్, కొత్తదుస్తులు ధరించివస్తాను. ఏమంటావ్? అలా చేయటం చాలా బాగుంటుంది కదూ?

---

* 1842 లో గొగోల్ రచించిన కథ.

అత్యంత ప్రియతమమైన వర్వారా అలెగ్జీయేనా,

నిన్నటి మన సంభాషణను - మధ్యలో తెగిపోయిన సంభాషణను - ఈ లేఖలో మళ్లీ ప్రారంభిస్తున్నాను. ప్రియతమా, నేనూ ఒకప్పుడు, నా యవ్వనంలో ప్రేమకోసం పరితపించినవాణ్ణే. ఆ రోజుల్లో ఓనటీమణి నా హృదయాన్ని దొంగిలించింది. పిచ్చివానివలె ఆమె వెంటపడ్డాను. అదొక విచిత్రగాథ. నేను అసలు ఆమెను చూసి ఎరుగను. ఒకసారి ఏదో నాటకంలో ఆమె నటించగా చూశాను. అంతే. అయితేనేం, నేను ఆమెను ప్రేమించాను. అమితంగా ప్రేమించానులే. ఆ రోజుల్లో నా చుట్టూ ఒక అరడజనుమంది యువక బృందం వుండేవారు. వాళ్లంతా వట్టి ఆకతాయి బాపతు. ఇష్టంలేకపోయినా వాళ్లతో స్నేహం చేయక తప్పని పరిస్థితి ఏర్పడింది. అయినా వాళ్ల పిచ్చిచేష్టలకు మాత్రం నేను ఎప్పుడూ ఆమడ దూరానే వుంటూవచ్చాను. నలుగురిలో వున్నప్పుడు నలుగురితోపాటు నవ్వకపోయినా, నవ్వించకపోయినా బాగుండదని వాళ్లతో పరిహాసోక్తులు ఆడుతుండేవాణ్ణి. ఆ నటీమణిని గురించి వాళ్లు ఎలాంటి విషయాలు చెప్పారని! ప్రతిరోజూ ఆమె ప్రదర్శనకు వాళ్లంతా హాజరు! డబ్బులేక నానా అవస్థలు పడుతూకూడా, ఎట్లాగో కొంత డబ్బు ఆదాచేసి నాటకాలు చూస్తూండేవారు. వాళ్లకు

అన్నింకన్నాకూడా నాటకం ముఖ్యం. ఇక నాటకశాలలో వాళ్ల ప్రవర్తన ఎలాంటిదని చెప్పను ? ఒక టే 'వన్సుమోర్ లు!' ఒక టే చప్పట్లు. పాపం, ఆమెను నిలువునా చంపేసేవారంటే నమ్ము. పిచ్చెక్కినట్లు వ్యవహరించేవాళ్లు. నాటకం ముగిసిన తర్వాత, గదికివచ్చి తెల్లవార్లూ ఆమెనుగురించే చెప్పుకోటం; తమ ప్రియతమ నటి గ్లాషాను గురించే పొగుడుకోటం; వాళ్ళంతా, ఒక్కడుకూడా బీకుపోకుండా, ఆమెను ప్రేమించారు. కామించారు. ఆమె పాడినపాట వాళ్ళ హృదయాలలో సదా ప్రతిధ్వనిస్తుండేది. మేను పులకింపచేసేది. వాళ్ల పోరు పడలేక ఒకరోజున వాళ్ళతోపాటు నేనూ నాటకానికి వెళ్లాను. తెరకు దూరంగా, దాదాపు హాలుచివరన గ్యాలరీలో కూర్చున్నాం. స్టేజీలో ఒకమూలమాత్రమే నాకు కన్పిస్తోంది. అయితేనేమి, నటీనటకుల నోటినుంచి ఊడిపడిన ప్రతీ మాట స్పష్టంగా నా చెవిని చేరాయి. అది చాలదా ? ఆ నటీమణి పాట నిజంగా మహాద్భుతంగా వుంది. కోకిలకంఠం. మృదు మధురమైన సంగీతరావం, ఆహా ! హృదయాన్ని ఉర్రూతలూగించింది. చేతులు నొప్పిపుట్టేటట్లు చప్పట్లు కొట్టాం. గొంతు బొంగురు పోయేటట్లు అరిచాం. ప్రేక్షకులంతా తమదృష్టిని స్టేజీపైనుంచి మాపైకి మళ్ళించారు. అప్పుడుగాని మాకు స్పృహ రాలేదు. నాటకం చూసి, గృహోన్ముఖుడనై, జేబు తడివిచూచుకొంటే, ఒక రూబుల్ మాత్రమే మిగిలింది. పదిరోజులకుగాని జీతం చేతికిరాదు. ఈ పదిరోజులూ ఈ రూబుల్‌తోనే కాలక్షేపం చేయాలి. ఎంత అవస్థ వచ్చిపడింది ? ఏమంటావ్ ప్రియతమా ?

మరుసటిరోజు ఆఫీసు కెళ్ళి, పనిపాటలు పూర్తిచేసుకొని, గదికి తిరిగొస్తూ ఆ రూబుల్‌తో ఒక సెంటుబుడ్డీ, సువాసన గల సబ్బుబిళ్ళా కొన్నాను. ఎందుకు కొన్నావు అని ప్రశ్నిస్తే జవాబు చెప్పలేను. ఆవాళరాత్రి పస్తు. కడుపు కాలుతోంది. పున్నమిచంద్రుడు పండువెన్నెల వెదజల్లుతున్నాడు. ఆ నటీ మణి వుంటున్న ఇంటిప్రక్కనే ఆ రాత్రి గడిపాను ఆమె దర్శనభాగ్యం అపేక్షిస్తూ. ఆ మేడలో మూడో అంతస్థులో ఆమె నివసిస్తోంది. నేను క్రింద పడిగాపులుపడి, ఆమెదర్శనం కోసం ఎదురుచూశాను. ఈవిధంగా నెలరోజులపాటు ఆ ఇంటి గుమ్మంలో కుక్కకాపలా కాశాను. ఆమెదృష్టిని ఆకర్షించడం కోసం ఎన్నో పనులుచేశాను. తలకుమించిన ఖర్చులుచేశాను. అప్పుల పాలయ్యాను. అప్పటికికాని నాలో ప్రేమతపన చల్లారలేదు. విసిగి, వేసారిపోయాను. లాభం లేదని తీర్మానించుకొన్నాను. చూస్తివా ప్రియతమా! ఒక నిజాయితీ పరుడిని ఒక నటీమణి ఎంతటి దుస్థితిపాలుచేసిందో? కాని నేను ఆరోజుల్లో మంచి యావ్వనంలోవున్నాను.

ఎమ్. డి.

జూలై, 8

గౌరవనీయమైన వర్వారా అలెగ్జెయేనా,

ఈ నెల 6 వ తేదీన నీవు పంపిన పుస్తకాన్ని వెంటనే నీకు తిరిగి పంపేస్తున్నాను. అందుకు కారణ మేమిటో విన్నవించుకొంటాను. నేనంటే నీకెందు కింత మంట? చెప్పు ప్రియతమా! ఎలాంటి పుస్తకాన్ని పంపించావు! ఈ లోకంలో కొందరు అందలం యెక్కి అనుభవించటానికీ, మరి కొందరు పెత్తనం చలాయించటానికీ, ఇంకొందరు నోరు మెదపకుండా ఆజ్ఞలు పాలించటానికి పుట్టారు. ఆయా వ్యక్తుల శక్తిసామర్థ్యాలను బట్టి ఆయా స్థాయిల్లో గౌరవమూ, అగౌరవమూ లభిస్తుంటాయి. ఇదంతా దైవాజ్ఞ. దైవాజ్ఞను ఉల్లంఘించడం యెవరితరం? అయినా, "ప్రభు వెక్కిన పల్లకీ కాదోయ్, అది మోసిన బోయీ లెవ్వరు?" అని గద్దించాడొక మహాకవి. నేను ముప్పయేళ్ళుగా ఆఫీసులో పని చేస్తున్నాను. నా ప్రవర్తనను, నా సేవానురక్తినీ వేలెత్తి చూపడం యెవరితరంకాదు. నేను నీతిని అతిక్రమించానని ఇంతవరకూ యెవరూ ఆరోపించలేకపోయారు. నే నెలాంటి వాడినో నీకు తెలుసు. నాలోని లోపాలేమిటో, సుగుణా లేమిటో కూడా నీకు తెలుసు. నా పై ఉద్యోగులందరూ, చివరకు హిజ్ హెక్సెలెన్సీ కూడా, నన్ను గౌరవిస్తారు. ఇంతదనుక హిజ్ ఎక్సెలెన్సీ నా విషయంలో యెలాంటి ప్రత్యేకాభిమానం చూపకపోయినప్పటికీ, నేనంటే ఆయనకు

సదభిప్రాయం కలదని మాత్రం గట్టిగా చెప్పగలను. పెద్దపెద్ద పాపా లేవీ చేయకుండా నాతల నెరసిపోతోంది. చిన్న చిన్న తప్పిదాలంటావా, వాటికి అతీతులైనవారు ఈ భూప్రపంచంలో యెవరూ లేరనే చెప్పవచ్చు. ఓ ప్రియతమా! నీతో సహా, ప్రతి ఒక్కరూ కొద్దో గొప్పో లోపాలు చేసినవాళ్లే. పోతే, అగౌరవంగా ప్రవర్తించటంగానీ, ధర్మసూత్రాలను అతిక్రమించటంగానీ, శాంతిని ఉల్లఘించటంగానీ నా యింటా వంటా లేదంటే నమ్ము. ఒక సందర్భంలో నాకు పెద్దగౌరవ ప్రదానం చేయాలనికూడా నిర్ణయించడమైంది. ఆ గొడవ కేమి వచ్చెగాని, ఇంతకీ చెప్పవచ్చే దేమంటే, ఈ విషయాలన్నీ నీవూ, ఆ రచయితా కూడా తెలుసుకోవాలి. సకల విషయాలను చిత్రించాలని నిర్ణయించుకొన్న వ్యక్తి, అన్ని విషయాలను గురించి సమగ్రంగా తెలుసుకోవాలి. నీవు యిలాంటిపని చేస్తావని నేను కలలోకూడా ఊహించలేదు. వరెంకా, నీవు ఇలాంటిపని చేయటమా!

ఒక మానవుడు తన గదిలో, తన మానాన తాను జీవించటానికి వీల్లేనట్టేనా? దైవభక్తికలిగి, పరులకు ఎట్టి హాని తలపెట్టని వ్యక్తిని హాయిగా జీవించనివ్వరా? ఇతరుల మెరమెచ్చులకోసం ఈ వ్యక్తి ప్రాకులాడటంలేదే? ఈవ్యక్తి ఆంతరంగిక విషయాలలో ఇతరులతలదూర్చనేల? నావ్యక్తిగత జీవితాన్ని అనుక్షణం సి. ఐ. డి. లాగా పరిశీలించే అధికారం మీకు ఎవరిచ్చారు? నేను ఎలాంటి బట్టలు ధరిస్తే మీకెందుకు? నేను ఎలాంటిబూట్లు తొడిగితే మీకెందుకు? నేను ఏమితింటున్నానో, ఏమి త్రాగుతున్నానో, ఏమి వ్రాస్తు

న్నావో, అవన్నీ ఇతరులకు పూర్తిగా అనవసరం. ఒకవేళ పూర్తిగా చెడిపోయిన పేవ్‌మెంట్‌పైన నడుస్తూ నా బూట్లు ఎక్కడ దెబ్బతిని పోతాయోనన్న భయంతో కాలి వేళ్ళ కొనలమీదే నడుస్తానుకోండి. అయితే మీ కొంపలు కొచ్చిన ముప్పేమిటి? ఈ మానవుడు ఒక్కొక్కప్పుడు టీ నీళ్ళకు కూడా నోచుకోడు అని ఆ రచయిత వ్రాయటంలో అర్థమేమిటి? ప్రతివాడూ విధిగా టీ సేవించాలని ఎక్కడ రాసిపెట్టి వుందేమిటి? నా పొరుగువాడు రోజూ నాలుగు కూరలతో భోజనం చేస్తున్నాడో లేక కారపు మెతుకులే తింటున్నాడో నేను ఎన్నడైనా దొంగతనంగా తొంగి చూశానా? నేను అట్టిపని చేశానా? చేశానని ఎవరైనా దేవునిపై ప్రమాణంచేసి చెప్పగలరా? అయినప్పుడు నాజోలి ఇతరుల కెందుకంట? వర్వారాఅలెక్సెయేనా, నేను చెప్ప దలుచుకొన్నది ఇది: ఒక వ్యక్తి ఉత్సాహంతో తన విధ్యుక్త ధర్మం నెరవేర్చవచ్చు; అతను పై అధికారి ప్రశంసలుకూడా పొందినవాడై వుండొచ్చు. అయినప్పటికీ దమ్మిడీకి కొరగాని వెధవ ఒకడు బయలుదేరి, ఆ కర్మవాదిని నలుగురులో పట్టు కొని అపహాస్యం పాల్జేస్తాడు. ఇది సత్యం. ఇది నిత్యం. ఈ సంగ తులన్నీ రచయిత కళ్ళకు కట్టినట్లు చిత్రించినమాట నిజమే. ఇలాంటి పుస్తకాలు మా అధికారి ఫ్యోడోర్ విచ్‌కు ఎలా నచ్చుతాయో నాకు అర్థంకాకుండావుంది. నిజానికి ఇలాంటి పుస్తకాలుచూసి, అతను మండిపడాలి; తన ప్రవర్తనను గట్టిగా సమర్థించుకొని వుండాలి. ఆయనకు ఇంకా యౌవ్వనం పూర్తి కాలేదు. ఈ పుస్తకంలోని పాత్రవలెనే, ఆయనకూడా

సందర్భ అసందర్భాలతో నిమిత్తం లేకుండా మాపై జులుం చలా యిస్తూ, తన పెద్దరికం, పెత్తనం ప్రదర్శిస్తుంటాడు. అయినా ఆయన మాపై అధికారం చలాయించటంతప్పా ఏమిటి? అడపా తడపా చురకలు అంటిస్తుండకపోతే మేము మాటవింటామా? పై అధికారులు క్రిందివారిని అదమాయించటం, గదమాయించటం ధర్మమే గదా? అదీగాక, నిజం చెప్పాల్సివస్తే మాలో అనేకమంది కేవలం జీతపురాళ్ళు తీసుకుంటూ, సోమరిపోతుల జీవితం గడుపుతున్నారు. వీపమెత్తు పని చేస్తేనట్టు. పైవాడు తనక్రిందివాడిని, క్రందివాడు తనకన్నా క్రిందివాడిని చెవులు మెలిపేస్తుండటం సామాన్యవిషయమేగా. ఇదే లోకనీతి, ప్రియతమా! ప్రతివాడూ యితరుల నెత్తిపై పెత్తనం చేయటానికి ప్రయత్నిస్తాడు. ఈ పద్ధతి ఉండబట్టే లోకం యిలాగు నిలుస్తున్నది. లేకపోతే ఏనాడో కూలిపోయి వుండేది.

ఇలాంటి సంగతులువ్రాసి ప్రయోజన మేమిటి చెప్పు. ఈ పుస్తకం చదివిన పాఠకుడు యెన్నడైనా నాకు కొత్త కోటు కొనిపెడతాడా? పోనీ కొత్తబూట్లు కొనిపెడతాడా? అలాంటివి ఎవడూ చేయడు, వరెంకా. ఈ పుస్తకం చదివేసి మడుస్తాడు. ఇలాంటి పుస్తకాలు యింకా కావాలంటాడు; అంతే. ఎవరికివారు తమ లోపాలను కప్పిపుచ్చుకోటానికే ప్రయత్నిస్తారు. నలుగురిలో నవ్వులపాలు కావటానికి ఎవరు సిద్ధపడతారు? లోకులు అసలే పలుగాకులు. గోరంతదానిని కొండంత చేస్తారు. పనీపాటా లేని వెధవలు! వ్యక్తిగత జీవిత విశేషాలన్నింటినీ బజారులోకడిగి, ఎండేస్తారు. అన్ని విష

యాలు బజారుకెక్కిన తర్వాత యిక బజారులో నలుగురి మధ్య తలెత్తుకు తిరగడం సాధ్యమా, చెప్పు? పోనీ, ఈ పుస్తకం ముగింపులోనైనా రచయిత కాస్త బుద్ధి తెచ్చుకొని, విషయాలను మరోకవిధంగా వ్రాసివుంటే బాగుండేది. బజారులో పదిమందీ అతనిపై చెప్పులు విసిరారు అని వ్రాసిన తర్వాత, ఈ విధంగా వ్రాసివుంటే యెంతో బాగుండేది: ఏమైనా అతను చాలా సద్గుణశీలి. అట్టివానిని తోటివారు అలా అవహేళన చేయటం బొత్తిగా బాగా లేదు. ఆతను పై అధికారుల ఆజ్ఞలను శిరసావహించాడు. (ఈ సందర్భంలో కొన్ని ఉదాహరణలుకూడా, అంతగా అవసర మనుకొంటే ఉటంకించవచ్చు). ఇతరులంటే అతనికి రాగ ద్వేషాలు లేవు. దైవభక్తుడు. అతని చావుకు (అతను తప్ప కుండా చచ్చిపోవాలి అని రచయితకూడా గట్టిగా పట్టుపడితే సుమా!) కుటుంబం, మిత్ర పరివారమూ కన్నీరుమున్నీరుగా దుఃఖించారు. పాపం, అతనిని చంపకుండావుంటేనే బాగుం టుందనుకో. అతని సేవానురక్తిని గుర్తించిన హిజ్ఎక్సెలెన్సీ అతన్ని పై ఉద్యోగానికి ప్రమోట్ చేశాడని వ్రాస్తే మరింత రమణీయంగా వుంటుంది. ఆ విధంగా సద్గుణాలు చివరకు రాణిస్తాయనీ, అవలక్షణాలకు శిక్ష తప్పదనీ ఋజువుచేసి వుంటే ఎంతో బాగుండేది. నేనైతే ఇలాగే వ్రాసివుండేవాణ్ణి. ఈ కథను ఈ పద్ధతిలో వ్రాసి, ఆ రచయిత సాధించినదేం పరమార్థం? రోజువారీ జీవితంలో, నిత్యానుభవంలోని ఒక సంఘటనను తీసుకొని ఉన్నదున్నట్టు చిత్రించాడు. అంతేగా? అయినా నీవు ఇలాంటి పుస్తకాన్ని ఎలా పంపించావమ్మా?

ఇది విషతుల్యమైన పుస్తకం, వరెంకా. కేవలం కవిత్వం. ఎందుకంటే అలాంటి గుమాస్తా కంచుకాగడా వేసి గాలించినా ఈ భూప్రపంచంలో కానరాడు. ఈ పుస్తకానికి వ్యతిరేకంగా ఫిర్యాదుచేయా లనుకొంటున్నాను, ఏమంటావ్ వరెంకా ?

విశ్వాసపాత్రుడైన నీ సేవకుడు,
మకార్ దెవ్రూష్కిన్.

జూలై, 27

ప్రియమైన మకార్ అలెగ్జెవిచ్,

ఈ మధ్య జరిగిన ఘటనలు, నీవు వ్రాస్తున్న ఉత్తరాలు, చూస్తుంటే నా హృదయంలో కలవరం, అమితాందోళన బయలుదేరుతున్నాయి. ఆశ్చర్య చకితురాల నవుతున్నాను. ఫెదోరా అన్నివిషయాలు విడమర్చి చెప్పిన తర్వాత, మనస్సు కొంత కుదటపడింది. నీవు అంత నిరాశ చెందట మెందుకు ? కృంగిపోవట మెందుకు ? నీవు చెప్పుతున్న కారణాలు నా కేమాత్రం సంతృప్తికరంగా లేవు. నేను ఆ ఉద్యోగం స్వీకరించివుంటే, ఎంతో బాగుండే దనిపిస్తోంది. ఇప్పుడు నీవుకూడా ఈ విషయంలో నాతో ఏకీభవిస్తావనే

తెలుస్తాను. ఈమధ్య జరిగిన ఘటన నన్ను భయకంపితురాలను చేసింది. ప్రేమానురాగంకొద్దీ అసలు విషయాలు నా దృష్టికి రాకుండా దాస్తున్నానని నీ వంటావు. నీకు ఋణపడి వున్నా నన్న భావం నన్ను అహర్నిశలు, ఆరుగాలం పట్టుకు పీడిస్తోంది. బ్యాంకులో నిల్వచేసుకున్న మొత్తాన్ని నాకోసం ఖర్చుచేస్తున్నానని నాచేత ఇంతకాలం నమ్మింపచేశావు. ఇంతకీ అసలు నీకు బ్యాంకు ఖాతాయేలేదని ఇప్పుడే తెలిసింది. నా దుస్థితిని చూచి జాలిచెందిన నీవు జీతాన్ని అడ్వాన్సుగా తీసుకొని, నాకోసం ఖర్చుచేస్తున్నావు. నాకు జబ్బు చేసినప్పుడు నీకున్న ఒక కోటునూ అమ్మేశావు. ఈ ఋణం నే నెలా తీర్చుకోగలను? ఏదో నాపై నీకు గల సానుభూతికొద్దీ, బంధుప్రీతికొద్దీ ఈపని చేశావు. నా పిచ్చి మకార్ అలెక్జెవిచ్, చేయరానిపని చేశావు. విలాసాలకు డబ్బును నీళ్లలాగా వాడేయటం మంచిదికాదు. నీవు సిసలైన మిత్రుడివికావు, మకార్ అలెక్జెవిచ్. అన్ని విషయాలు దాపరికంలేకుండా నీవు నాతో చెప్పలేదు. నా దుస్తులకోసం, మిఠాయికోసం, నాటకాల టిక్కెట్లకోసం, పుస్తకాలకోసం, నా వినోదాలకోసం డబ్బంతా తగలేశావు. అనాలోచితంగా నేను అన్నింటినీ స్వీకరించాను. ఇది క్షంతవ్యం కాదు (నీ అవసరాలేమిటో ఆలోచించకుండా నీవు పంపిన వస్తువు లన్నింటినీ నేను స్వీకరించానుకదా?). నాకేదో ఆనందం, సౌఖ్యం పంచిపెట్టాలన్న ఉద్దేశంతో నీవు యీ పను లన్నీ చేశావు. కాని, నీ ఆశలు ఫలించలేదు. దుఃఖం, విచారం మాత్రం నాకు మిగిలాయి. కొద్దిరోజులుగా నీవు

దిగులుతో వున్నావన్న సంగతి నాకు తెలుసు. అయినా యింతపని చేస్తావని కలలోకూడా ఊహించలేదు. అయ్యో రామ! నీలో ఆత్మనిగ్రహం అంతా ఏమైపోయింది? లోకులు ఏమనుకొంటారు! వినమ్రతకూ, విజ్ఞతకూ, కారుణ్యానికీ పేరుపొందిన నీవు, నలుగురి గౌరవమన్ననల నందుకొన్న నీవు అత్యంత నికృష్టమైన యిలాంటి దురలవాటుకు లోనుకావటమా? తప్పతాగి వీధుల్లో తూలుతూ, పేలుతూ వుంటే పోలీసులు నిన్ను పట్టుకొని, తెచ్చి యింట్లో పడేశారని ఫెడోరా చెప్పగా విన్నాను. నిజంగా నా చెవులను నేనే నమ్మలేకపోయానంటే నమ్ము. నాలుగు రోజులబట్టి నీవు నా గదికి రాలేదంటే, ఏదో అసాధారణమైనది జరిగివుంటుందని అనుకొన్నాననుకో. నాలుగు రోజులపాటు ఆఫీసుకు నీవు గైరుహాజరు కావటానికి అసలు కారణమేమిటో నీ పై అధికారులకు తెలిస్తే వారు ఏమనుకొంటారో వూహించావా?

అంతా నిన్ను చూసి నవ్వుతున్నారనీ, ఇరుగూపొరుగూ, ఊరూనాడూ ఏకమై మనిద్దరి నేస్తాన్ని గురించి చెప్పుకుంటూ, మనిద్దరినీ తూలనాడుతున్నారనీ వ్రాశావు. మకార్ అలెగ్జెవిచ్, దేవునియందు దయయుంచి, వాళ్ళమాటలను లక్ష్యపెట్టకు. స్థిమితం చేకూర్చుకో. పై అధికారులతో నీవు పేచీ పెట్టుకున్నావని తెలిసి, బాధపడ్డాను, భయపడ్డాను. ఏవో పుకార్లు కొన్ని అప్పుడే నా చెవిన పడ్డాయి. దాపరికం లేకుండా అన్ని విషయాలు నాకు తెలియజేయి, నీకు పుణ్యం వుంటుంది. నిజం చెప్పటానికి భయపడుతున్నట్టు వ్రాశావు. నిజం చెప్పితే నీతో స్నేహం చేయటం నేను మానేస్తానా? అదా నీ భయం?

నాకు ఆర్థిక సహాయం చేయలేని దుస్థితిలో పడిపోయినందుకు నీవు నిరాశ చెందుతున్నావా? నాకోసం పుట్టినచోటల్లా అప్పులుచేశావా? యింటియజమానురాలితో తగవుపెట్టు కొన్నావా? ఈ సంగతులన్నీ నాకు తెలియకుండా ఇంతకాలం ఎందుకు దాచిపెట్టినట్టు? దాస్నేమాత్రం నిజం దాగుతుందా? దాగిందా? చెప్పు. నీ కష్టాలన్నింటికీ కారకురాలను నేనే. నా మనస్సు క్షోభిస్తోంది. ఇది భరింపరాని బాధ, మకార్ అలెక్జైవిచ్. మిత్రమా, దురదృష్టం అంటుజాఢ్యంవంటిది! పేదలూ, నిర్భాగ్యులూ ఒకరినుంచి మరొకరు దూరంగా వుండటం మంచిది. హాయిగా బ్రతుకుతున్న నీకు నా మూలాన ఎన్ని కష్టాలు వచ్చిపడ్డాయో చూడు. ఈ భావన భరింపశక్యంకాని భారాన్ని నా గుండెలపై మోపుతోంది.

వాస్తవంగా ఏమిజరిగిందో నాతో చెప్పు. హృదయానికి ఊరటకల్గించే విషయమేదైనావుంటే వ్రాయి. స్వార్థబుద్ధితో నిన్నీవిధంగా కోరటంలేదు. మనిద్దరిమధ్య మైత్రి కారణంగానే ఈ కోర్కె వెలిబుచ్చుతున్నాను. నీనుంచి నన్ను వేరుచేయటం ఎవరితరం కాదు. నీ జవాబుకోసం కళ్లు కాయలు కాచేటట్లు ఎదురుచూస్తుంటాను. మకార్ అలెక్జైవిచ్, నా విషయంలో నీవు చేసినపని బొత్తిగా భావ్యంకాదు.

నీ అనురాగ మాలిక,

వర్వారా దొబ్రొస్యోలోవా.

వెలలేని ప్రియతమా, వర్వారా అలెగ్జెయేనా,

అయిందేదో అయింది, గతజల సేతుబంధనం నిష్ప్రయోజనం. అదీకాక, నా జీవితం ఎటుతిరిగీ మళ్ళీ ఒకదారిన పడుతోంది. నీకు నేనొక విషయం చెప్పదలచుకొన్నాను: ఇతరులు ఏమనుకొనిపోతారోనని నీవు లేనిపోని ఆందోళన చెందుతున్నావు. అందుకే నేనొక విషయం స్పష్టం చేస్తున్నాను. ఆత్మగౌరవానికి మించిన ప్రియతమమైనది నాకీ ప్రపంచంలో మరొకటి లేదు. నేను ఎదుర్కొన్న చిక్కులు, చీకు, చింతా, కష్టాలు - ఇవేవీకూడా పై అధికారుల దృష్టిలో నా ఉనికిని వీసమెత్తుకూడా దిగజార్చలేవు; దిగజార్చలేదు. ఇతఃపూర్వంవలెనే ఇప్పుడూ వారు నన్ను గౌరవపూర్వకంగానే చూస్తున్నారు. ఇక ఇంటి యజమానురాలి గొడవ సంగతా, నీవు పంపిన పదిరూబుల్స్ నోట్ దాని మొఖాన కొట్టేశాను. దాంతో దాని రణగొణధ్వని గొణుకుడిలోకి దిగింది. నోరు కాస్త కట్టడింది. ఇక ఇతరుల సంగతంటావా; అసలు వాళ్ళ మాటలను నేను లక్ష్యపెట్టితేగా. నేను వాళ్ళను అప్పులడగకుండావుంటే, వాళ్ళతో అసలు ఎట్టి యిబ్బందీ లేనేలేదు. కాగా, పోగా నిన్నుగురించి నీలాపనిందలు ప్రచారం చేస్తున్నవారినిగురించే నా బాధంతా. ప్రియతమా, ఒక్క వాక్యంలో నా హృదయాన్ని విప్పి చెప్పేస్తా: ఈ ప్రపంచంలో కలకాలం కోరుకోతగ్గదీ, నేను

కోరుకొంటున్నదీ నీ అనురాగం మాత్రమే. నీ అనురాగం నాకు లభిస్తున్నంతకాలం ఎన్నికష్టాలొచ్చినా, నష్టాలొచ్చినా భరించగలను; వహించగలను. దేవుని దయవల్ల తుపాను హోరు తగ్గిపోయింది. నేను కపటమిత్రుడిని కాదనీ, స్వార్థపరుణ్ణి కాదనీ, నిన్ను మోసగించలేదనీ, నష్టేట ముంచలేదనీ ఇప్పటికైనా నీవు గ్రహించివుంటావు. నీతో ఎడబాటు సహించలేకనే కొన్ని అబద్ధాలు ఆడాను. రెట్టించిన ఉత్సాహంతో నేను ఇప్పుడు పనిలో చొరబడ్డాను. బాధ్యతలను కడు సమర్థవంతంగా నిర్వర్తిస్తున్నాను. నిన్న యవ్ స్టఫీ ఇవనొవిచ్ ప్రక్కగా నేను వెళ్లుతుంటే, అతను నన్నుచూసి ఏమీ అనలేదు. అప్పులభారంతో నేను కృంగిపోతున్న మాట నిజం. నీముందు నిజం దాచనేల? అయినా ఫరవా లేదు. అప్పులను గురించి ఆందోళన చెందకు. నీవు పంపిన డబ్బు నా హృదయాన్ని రెండుగా చీల్చిందంటే నమ్ము. చివరకు పరిస్థితి ఇలా పరిణమించినదన్నమాట. ఈ తెలివి తక్కువ దద్దమ్మ నీకు సహాయం చేయటంలేదు. నీనుంచి సహాయం పొందుతున్నాడు. తెలిసిందా? ప్రస్తుతానికి డబ్బు వచ్చేదారి కన్పించటంలేదు. ఒకవేళ అనుకోకుండా చేతికొస్తే వెంటనే నీకు తెలియజేస్తా. లోకుల ప్రచారంవుంది చూశావ్. అదే నన్ను వేధిస్తోంది. సెలవు. నీ చిట్టివ్రేళ్ళను ముద్దెట్టుకొంటూ, నీకు ఆయురారోగ్యాలు చేకూర్చాలని భగవంతుడిని ప్రార్థిస్తుంటాను. తొందరగా ఆఫీసుకు బయలుదేరవలసిన అవసరం వుంది. అందుచేత ఇంతకన్నా దీర్ఘమైన లేఖను వ్రాయలేను. నా నిర్లక్ష్యానికి మన్నించవలసిందిగా వేడు

కొంటున్నాను. ఈవేళ సాయంత్రం అన్ని విషయాలు విన రిస్తూ మళ్ళీ జాబు వ్రాస్తాను.

నీ ఆప్త మిత్రుడు,
మకార్ దెవ్రూష్కిన్.

జూలై, 28

అవును, వరెంకా!

సిగ్గుపడవలసింది నీవే, నేనుకాదు. నీవుచేసిన పాపం కలకాలం నీ హృదయాన్ని పట్టుకు పీడిస్తూనే వుంటుందిలే. గతసారి నీవు వ్రాసినలేఖ నా పాలిట పిడుగుపాటులా వచ్చి పడింది. ఆత్మపరిశోధన చేసుకొన్నాను. నే నేమైనా తప్పిదం చేశానా అని యోచించాను. నా తప్పిదం ఈషణ్మాత్రం లేదని ధ్రువపడింది. నీ వంటే నా కెంతో యిష్టం. నిజమే. నీ వంటే నేను చచ్చిపోతాను. నీవులేనిదే క్షణంసేపు బ్రతకలేను. ఇది కూడా తప్పేనా, చెప్పు. నీకు తెలియదు ప్రియతమా, నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలియదు. నిన్ను ప్రేమించ కుండా నేను వుండలేను. ఇది నీవు గ్రహించివుంటే, ఆ ఉత్తరం అలా వ్రాసివుంటావా? నాకు తెలుసు. ఆ ఉత్తరం వ్రాసింది

నీ హృదయంకాదనీ, నీ మెదడు మాత్రమేననీ నాకు తెలుసు. నీ హృదయాన్ని తట్టి అడిగితే, కథ మరొకలాగా వినిపిస్తుంది.

నిజం చెప్పాలంటే, నాకు, ఆ అధికారులకు మధ్య ఏమి జరిగిందో కూడా సరిగా గుర్తు లేదు. దేవునిమీద ప్రమాణంచేసి మరీ చెప్తున్నాను. నా మాట నమ్మ ప్రియతమా. నేను యిబ్బందులలో వున్నమాట నిజం. నెల రోజులబట్టి, నా పరిస్థితి అస్తుబిస్తుగానే వుంటోంది. ఇది చాలా అసహ్యాకరమైన పరిస్థితే మరి. వాస్తవిక విషయాలు నీకుగానీ, నా యిరుగు పొరుగు వారికిగానీ తెలియకుండా దాచిపెట్టుతూ వచ్చాను. అయితే మా యింటి యజమాను రాలు వుంది చూశావు, అది నానా రభస చేసింది. దానిని నేను లక్ష్యపెట్టలేదనుకో. ఆ ముసలిముండ నోరు నొప్పిపెట్టే దాకా, తిట్టుకొని వూరుకొంటుందనే నేను నోరు మెదపలేదు. ఏమైనా ఆ తిట్లు నలుగురిలో నగుబాటే కదా. ఆ ముండ అంతటితో ఊరుకొందా? ఎలా పసిగట్టిందోగాని దాని దుంపతెగ, మనిద్దరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొంటున్న సంగతి తెలుసుకొంది. నానామాటలు అంది. ఘోరమైన ఆ మాటలు వినలేక చెవులు మూసుకొన్నాను. నేనైతే చెవులు మూసుకొన్నానుగాని, దురదృష్టవశాత్తు పరు లెవ్వరూ చెవులు మూసుకోలేదు సరికదా, చెవులు నిక్క బొడుచుకొని మరీ విన్నారు. ఇప్పటికీ నా తల తీసేసినట్టుగానే బాధపడుతున్నాను......

దురదృష్టపరంపర నన్నీ విధంగా నాశనం చేసింది. దీనికితోడు, ఎవడో ఒక ముండాకొడుకు నీ యింటికొచ్చి

హేయమైన ప్రతిపాదనలు చేశాడని ఫెడోరా చెప్పగా విని బాధపడ్డాను. దానికి నీ వెంతగా బాధపడివుంటావో నేను తేలిక గానే ఊహించగలిగాను. దానితో నాకు మనస్థిమితం తప్పింది. ఆనాటి నా పరిస్థితి యేమనిచెప్పేది, వరెంకా! నాహృదయం తొక్కతొక్కిన త్రాచువలె బుసకొట్టసాగింది. నిగ్రహించుకో లేకపోయాను. సరాసరి ఆ త్రాష్టుడియింటికి ఉరికాను. ఎందు కెళ్ళుతున్నానో నాకే తెలియదు. నా ముద్దులకూనకు, నా మురిపాల మూలకు జరిగిన అవమానానికి సహించ లేక పోయాను. ఎటుచూసినా విచారమే, విషాదమే. అందు లోనూ ఆ రోజున జోరున వాన కురుస్తోంది. రోడ్లన్నీ బురద బురదగా వున్నాయి. రోడ్లపై నడుస్తుంటే, ఎక్కడ జారిపడ తానో అన్నంత భయంవేసింది. ఇక లాభంలేదు, ఇంటికి తిరిగిపోదాం అనుకున్నాను. ఇంతలోకి కాలు జారాను: దారిలో యెమెల్యా అంటే యెమెల్యాన్ ఇల్యిచ్ కనిపించాడు. అతనూ ఒక గుమాస్తా. అంటే పై అధికారులు బర్తరఫ చేసేదాకా అతనూ ఒక గుమాస్తాగా పనిచేశాడు. బర్తరఫ అయినప్పటినుంచి అతను ఎలా బ్రతుకుతున్నాడో నాకు తెలియదు. మే మిద్దరం ఒకే దిశగా నడిచిపోతున్నాం. అన్నట్టు నీ మిత్రుని బాధామయ విషాదగాధ చదువుతూ నీవు పొందగలిగే ఆనందం ఏమిటి వరెంకా? మూడో రోజు సాయంత్రాన, యెమెల్యా పోరుపడలేక, ఆ అధికారి యింటి కెళ్ళి, బయటకు రమ్మని బిగ్గరగా అరిచాను. అసలు చాలా రోజులబట్టి ఆ అధికారి వాలకం జాగ్రత్తగా కనిపెడుతూనే వున్నాను. వాడు వట్టి బటాచోరులాగా కన్పించాడు. నేను

ఆ అధికారి యింటికెళ్ళి, కేక లేసినప్పుడు కొంతవరకు నిషాలో వున్నాను. చేసిన పాపం చెప్పుకొంటే పోతుందంటారు. నేను వెళ్ళేసరికి ఆ అధికారి గదిలో అనేకమంది ఉద్యోగు లున్నట్టు నా కంటికి కనిపించింది. ఆవేశం పట్టలేక అనవలసిన మాట లన్నీ అనేశాను. అప్పుడు వాళ్ళంతా నా మెడపట్టు కొని గది బయటకు నెట్టేశారు. మెట్లపైపడి క్రిందకు దొర్లాను. ఆ తర్వాత నేను యింటికి ఎలా చేరానో నీకు తెలుసు కదా. ఇంతకన్నా నేను చెప్పవలసింది యింకేమీ లేదు. నా ఆత్మాభిమానం దెబ్బతిన్నమాట నిజమే. అయితే, ఈ దృశ్యం ఎవరూ చూడలేదన్న సంతృప్తి నాకు మిగిలింది. అంటే కొత్తవాళ్లెవరూ చూడలేదన్నమాట. పోతే, ఈసంగతి తెలిసిందల్లా నీకు మాత్రమేకనుక, అసలు ఇది జరగలేదనే భావించుకోవచ్చు. అవును కదూ, వరెంకా ? ఇక నేను వాదిం చను, వరెంకా. వాదించగలిగిన సాహసం నాకులేదు. నేను పతనం చెందాను. అధోగతి పాలయ్యాను. ముఖ్యంగా నీ దృష్టిలోనే నేను పతనం చెందాను. ఇదంతా ఆ భగవం తుని ప్రేరణ. బ్రహ్మరాతనుంచి తప్పించుకోవటం ఎవరితరం చెప్పు? నా జీవితగాథకు సంబంధించిన అరణ్యాపర్వ విశేషా లన్నింటినీ నీకు తెలియజేశాను. ఈ విశేషాలు ఎంతమాత్రం చదవదగినవికావు. నా ఆరోగ్యం ఏమంత బాగా లేదు, ప్రియతమా ! సదా నిన్ను గౌరవిస్తూ, ప్రేమిస్తూ నీపై అను రాగం చిలికిస్తూ వుంటాను. సెలవు.

నీ శ్రేయోభిలాషి,
మకార్ దెవూష్కిన్.

జూలై. 29

ప్రియమైన మకార్ అలెగ్జెవిచ్,

నీవు వ్రాసిన రెండు లేఖలూ చదివి, నిర్విణ్ణురాలనయి పోయాను. మిత్రమా, నీ మానసికాందోళనకు హేతుభూత మైన అనేక విషయాలను ఇంకా నీవు కప్పిపుచ్చ ప్రయత్ని స్తున్నట్టున్నావు ... లేదా ... నిజం, మకార్ అలెగ్జెవిచ్. నీ జాబులు చదువుతుంటే, నీ బాధలు, గాధలు పూర్తిగా నాకు తెలియజేయటంలే దనిపించింది. ఒకసారి మా యింటికి నీవు తప్పకుండా రావాలి. వీలుంటే భోజనానికి ఇక్కడికే రా. నిత్యమూ నీ జీవితం ఎలా గడుస్తున్నదో చెప్పావుకాదు. ఇంటి యజమానురాలి పోరు, హాసు తగ్గిందా? ఇదంతా కావాలనే చెప్పకుండా దాచిపెట్టినట్టున్నావు. మిత్రమా, మరి సెలవు. తప్పకుండా వస్తావుకదూ! వీలుంటే భోజ నానికికూడా ఇక్కడికే రా. వంటలు చేయటంలో ఫెదోరా సిద్ధహస్తురాలన్న సంగతి నీకు తెలుసుగా, సెలవు.

నీ

వర్వారా దొబ్రొస్యాలోవా.

ఆగష్టు, 1

వర్వారా అలెక్సెయేవ్నా, ఓ నా సొంపమా,

దేవుని దయవల్ల నీవు సంతోషంగా వున్నావు. నాకు అదే చాలు. కరుణ రుణాన్ని కరుణతో తీర్చుకొన్నావు. నాకు తెలుసు; వరెంకా, నీ హృదయం వెన్నపూసవంటిదన్న సంగతి నాకు ఎప్పుడో తెలుసు. నీకు నా వేడికోలు ఒకటే: నీకు పుణ్యం వుంటుంది, నన్ను అనవసరంగా తిట్టకు — అంటే నిన్ను మందలిస్తున్నానని తలంచకు. ఒకప్రక్క వృద్ధాప్యంవచ్చి పడుతున్నా, ఉన్న ఆదరవు కాస్త కాలదన్నినందుకు మందలించకు. అవును, నీవు గట్టిగా అంటున్నావు కాబట్టి నేను చేసింది తప్పిదమేనని ఒప్పుకోక తప్పుతుందా? కాని నా చిన్నారి నేస్తం నోటినుంచి యిలాంటిమాట వినవలసిరావటం నా కెంతో పరితాపం కల్గిస్తోంది. ఇలాంటి మాటలంటున్నందుకు కోపగించకు. నా హృదయమంతా గాయాలమయమైపోయింది. ఇంతేలే పేదల బ్రతుకులు. పగిలిన కుండలు పేదల బ్రతుకులు. అదంతా వారి కర్మ. ఏనాడో యీ సంగతి గుర్తించాను. పేదవాడు ఎప్పుడూ సందేహభావుడే. అతను ప్రతిదానినీ సదా జాగ్రత్తగా పరిశీలిస్తూనే వుంటాడు ఇతరులు తనను గురించి ఏమనుకొంటున్నారో అతను జాగ్రత్తగా ఆలకిస్తూనే వుంటాడు. బహుశా లోకులు ఇలా చెప్పుకొంటారు: "వాడు పరమ దౌర్భాగ్యుడు. నిర్భాగ్యశిఖామణి. అతనికి అంతకన్నా ఇంకా ఏమి చాతనవుతుంది?"

వరెంకా, నీకూ తెలుసుగా, వీధిలోని రబ్బిష్‌కన్నా నిరుపేద హీనుడు. అతన్ని ఎవరూ గౌరవించరు. ఇదే సత్యం. కఠోర నిత్యం. ఎందుచేత ? వాళ్ళదృష్టిలో డబ్బులేనివాడు ఎందుకూ పనికిరానివాడు. ఏమీ చేతకానివాడు. గౌరవింపదగిన అంశం అతనిలో ఏమివుందని వారి ప్రశ్న. ఆత్మగౌరవం సంగతా ? – అది నిర్భాగ్యుడికి అనవసరంలేదు ! ఈ మధ్య యెమెల్యా కనిపించి, చెప్పాడు. తనకు కొందరు చందా లిస్తున్నారని. చెల్లించిన ప్రతిపావలా చందాకు పాపం అతను జమాఖర్చులు చెప్పాల్సి వస్తున్నదట. చందాలిచ్చేవాళ్లు అతనికి ధర్మంచేస్తున్నట్టు భావిసున్నారు. ఈ రోజుల్లో దాన ధర్మాలు ఎలా రూపాంతరం పొందాయో చూశావా. లేదా ఇవి ఇంతకుముందూ ఇలాగే వున్నాయేమో ఎవరికి తెలుసు. మనకు గొప్ప గొప్ప విషయాలు తెలియక పోవచ్చుగాక. కాని, కావలసినంత జీవితానుభవం సంపాదించుకొన్నాం. హోటల్‌లోకి జొరబడుతున్న ఒక పెద్ద మనిషి వీధిలో కనిపించిన గుమ్మస్తానుచూసి తనలో అనుకొంటాడు : "ఈ దౌర్భాగ్యుడు ఈవేళ ఏమి తింటాడో ? నేను ఇవాళ మంచి కోడి ఫలావు భుజిస్తాను. బహుశా వీడు నాలుగు కారపు మెతుకులు నోట్లో వేసుకుని, చెంబుడు మంచి నీళ్ళు త్రాగి కడుపు నింపుకొంటాడు; దరిద్రగొట్టు." నేను ఏమి తింటానో వాడి కెందుకు చెప్పు ? అవును, వరెంకా, పెద్దమనుష్యు లంతా ఇలాంటివాళ్ళే. పేదవాళ్ళను అవహేళన చేయటమే వాళ్ళ పని. తమ చేతిలో కలం, కాగితం వున్నాయికదాఅని, పేదవాళ్ళ బ్రతుకులను ఎండేస్తూ వాళ్ళు

వ్రాసేస్తారు. డబ్బుందిగదాఅని ఆ వ్రాతలను అచ్చేస్తారు. అచ్చేసి అమ్ముకొంటారు. లాభాలు సంపాదించారు. అదీ వాళ్ళ తంతు. అవునుగానీ మహాశయా, నా కోటు మోచేతి వద్ద చిరుగు పట్టిందో లేదో ఆ ఆరాలన్నీ నీకెందుకయ్యా? మన్నించు, వరెంకా. మర్యాదను అతిక్రమించి మాట్లాడు తున్నాను. పెళ్ళికాని కన్యవలె పేదవాడు సిగ్గుపడుతుంటాడు. వీధిలో పదిమందిముందు నిలబడి నీవు దుస్తులు మార్చుకో వుగా? కొంచెం మొరటుగా చెప్పుతున్నందుకు క్షమించు. అలాగే ఇతరులు తన ఆంతరంగిక విషయాలు తెలుసుకోటం పేదవాడు సహించలేడు. అసలు సమస్య యిదే. శత్రువుల వల్ల నేను పొందుతున్న మానసిక వ్యథకు మూలం యిదే. వాళ్ళు నా పేరు ప్రతిష్ఠలను, ఆత్మగౌరవాన్ని నాశనం చేసేస్తున్నారు.

ఆఫీసులోకూడా నేను ముఖమెత్తుకొని తిరగలేక పోతున్నాను. అది తలచుకొన్నకొలదీ అవమానభారంతో తల కృంగిపోతోంది. ఏమిచేస్తానుచెప్పు, బట్టలన్నీ చిరిగిపోయి నప్పుడు, చేతిలో డబ్బులేనప్పుడు, చింపిరి బట్టలతోనే ఆఫీసు కెళ్ళాలి. అంతకుతప్ప వేరే గత్యంతరంలేదు. నా పేదరికాన్ని పట్టుకొని, ఇతరులు నన్ను ఎద్దేవా చేస్తుంటే నేను ఎలా సహించగలనుచెప్పు. వళ్లు మండిపోతోంది. నా ఆంతరంగిక జీవితాన్ని బజారులోపెట్టి, పానలాకు అన్నే రచయిత ప్రబుద్ధుల సంగతి వేరే చెప్పాలా? వాళ్ళకు నీతి నియమాలు వుండవు. దేనికైనా వాళ్లు సిద్ధమే.

ఈ పని చేసిందెవరో నాకు తెలుసు. ఇదంతా తప్పకుండా ఆ రతజీయేవ్‌గాడి పనే అయివుంటుంది. సందేహం లేదు. మా మంత్రిత్వశాఖలో వాడికి పరిచయస్థులుకూడా వున్నారు. అన్ని విషయాలు, మరికొన్ని కల్పించికూడా, వాళ్లకు వాడు చెప్పగలసమర్థుడు. ఏమైతేనేం, ఎక్కడచూసినా జనం గుల్లమల్లాలుపడుతూ మనలను గురించే చెప్పుకుంటున్నారు, వాళ్ళకు వేరే పనిఏమీ లేనట్టుంది. మొన్న నీ యింటికి భోజనానికి వచ్చినప్పుడు, ఈ యింట్లో జనమంతా కిటికీలలోగుండా తలలుదూర్చి, ఏదో వింత చూస్తున్నట్టు చూశారు. ఇంటి యజమానురాలు కూనిరాగంతో వ్యాఖ్యానం చేసింది: పాపం, ముక్కుపచ్చలారని పసిబిడ్డను యీ ముసలి వెధవ పట్టేశాడు, అంటూ నిన్ను నానారకాలుగా ఆడిపోసింది. రతజ్‌యేవ్ చేసిన ఘోరంతో పోల్చితే, ఇదెంత నేరంలే? వాడు మనిద్దరి బ్రతుకులను పుస్తకంలోకి ఎక్కించాడు గదా. పైగా వ్యంగ్యోక్తిలో మనలను దెబ్బతీశాడుకూడా. ఈ ఘోర కలిని యిలా కొనసాగనివ్వాటమేనా? దానికి అంతం అంటూ లేదా? చెప్పు, ప్రియతమా, చెప్పు. ఏమిచేయాలో చెప్పు. భగవంతుడు మనలను యీ విధంగా ఎందుకు శిక్షిస్తున్నాడు? అది ఆ భగవంతుడికే తెలియాలి. ఆ పుస్తకం గురించి పట్టించుకోకు. అయినా మనలను ఆ పుస్తకం చేసేదేమిటి? వట్టి చెత్త. అసలు నవల అంటే ఏమిటి? పనిపాటలులేని సోమరిపోతులు ఉబుసుపోక వ్రాసే రొచ్చుగుంట వ్రాతలు. అంతేగా. జీవితానుభవంలో గ్రహించిన కఠోరసత్యం యిది. వాళ్ళు షేక్స్‌పియర్‌ను గురించి చెప్పి, "చూశావా, సాహి

త్యంలో కూడా షేక్స్పియర్ వున్నాడు" అంటే అనవచ్చు. అదంతా పచ్చి అబద్ధం. కేవలం కవిత్వం. నిండా ప్రచారం. అడ్డగాడిదలకు మాత్రమే అది తగిపోతుంది.

నీ

మకార్ దెవూష్కిన్.

ఆగస్టు. 2

ప్రియమైన మకార్ అలెగ్జెవిచ్,

లేనిపోని ఆందోళన, మనోవ్యథ పెట్టుకోకు. దేవునిదయ వల్ల అంతా శుభప్రదంగానే పరిణమిస్తోంది లే. ఫెడోరా కావలసినంత కుట్టుపని సంపాదించుకొచ్చింది. మే మిద్దరం ఊపిరాడకుండా పనిచేస్తున్నాం. గట్టి పట్టుదలతో పని ప్రారంభించాలేం. బహుశా పరిస్థితులన్నీ చక్కబడేసూచనలు కన్పిస్తున్నాయి. ఈ మధ్య నేను ఎదుర్కొంటున్న చిక్కులన్నింటికీ అన్నాఫ్యోడొరోవ్నాయే కారణమై వుంటుందని ఫెడోరా అనుమానిస్తోంది. కష్టాలకు కారకు లెవ్వరైనా, ఫలితం ఒకటేగా ? ఎందుచేతనోగాని ఈవాళ నేను మహాహుషారుగా వున్నాను. మళ్ళీ నీవు అప్పు చేయబోతున్నావని తెలిసింది. నీవు ఆ పనిచేయకుండా దేవుడు అడ్డగించుగాక ! అప్పులు

చెల్లించే సమయం వచ్చినపుడు, నీవు పడేతిప్పలకు అంతుండదు. నీవు మా ఆప్తమిత్రుడివన్న విషయం మనువకు. మీ యింటి యజమానురాలిమాటలకు లక్ష్యపెట్టక, తరచు మాయింటికి వస్తూండు. పోతే, మిగిలిన నీ శత్రువులగురించి నీవు వెలిబుచ్చిన భయాందోళనలకు ఆధారాలు కన్పించవు. నీ జాబులు చదువుతుంటే, అవకతవకలు జాస్తిగా కన్పిస్తున్నాయి. అంటే నీ కింకా మనస్థిమితం చేకూరినట్లులేదు. సెలవు, మళ్ళీ మనిద్దరం కలుసుకునేదాకా సెలవు. త్వరలో మా యింటికి రాగలవని ఆశిస్తున్నాను.

నీ
వి. డి.

ఆగస్టు, 3

వర్వారా అలెక్సేయేనా, నా చిన్నారి పయ్యారీ!

ఓ నా అనురాగమాలికా, నా హృదయంలో ఆశాలత ఏపుగా పెరుగుతోందన్న వార్త నీకు అందజేయాలని నా మనసు వేగిరపడుతోంది. కాని, అప్పుచేయవద్దని అంటావ్, ఎలా సాధ్యం చెప్పు? నా ముద్దులకూనా! అది పూర్తిగా అసాధ్యం. చేతిలో దమ్మిడీలేకుండా జీవితం గడపటం దుర్లభం.

నీ ఆరోగ్యం అసలే అంతంతమాత్రం. ఏక్షణంలో నీకు ఏమి జబ్బుచేస్తుందో ఎవరికి తెలుసు? అందుచేత అప్పుచేసి, చేతిలో డబ్బు సిద్ధంగా వుంచుకోటం చాలా అవసరం. అయితే, అసలు విషయానికి వద్దాం:

వర్వారా అలెగ్జెయేనా, మొదట నీకొక విషయం చెప్పదలచాను. ఆఫీసులో యెమెల్యాన్ ఇవనొవిచ్ ప్రక్కనే నేనూ కూర్చుంటాను. ఇతను యింతకుముందు చెప్పిన యెమెల్యాన్ అనుకోనేవు; కాదుసుమా; ఈ యెమెల్యాన్ గుమాస్తాలందరిలోకి కడపటి తరగతికి చెందినవాడు. మా ఆఫీసులో బహుశా మేమిద్దరమే అందరికన్నా వయసులో పెద్దవాళ్ళం కావచ్చు. ఇతను దయాపరుడు; నిస్వార్థజీవి. కాని ఎప్పుడూ నోరువిప్పిన పాపానపోడు. మనలాగా మౌనముద్రలో వుంటాడు. అయినప్పటికీ కడు సమర్థుడు. ముత్యాలహారాన్ని మరిపించే దస్తూరీ, నిజంచెప్పాలంటే నా దస్తూరికన్నా ఏ విధంగానూ తీసిపోదు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఇతను అన్నివిధాలా యోగ్యుడు. నిజానికి మా యిద్దరిమధ్య ఎన్నడూ మిత్రత్వం లేదనే చెప్పాలి. ఏదో ఎదురుపడినప్పుడల్లా 'ఓహో అంటే ఓహో' అనుకుంటూంటాం. నాకు చాకు అవసరమైనప్పుడల్లా సహజంగానే నేను ఇతనిని అడుగుతుంటాను: "యెమెల్యాన్ ఇవనొవిచ్, దయచేసి చాకు ఒకసారిస్తావా?"...కాని ఇవాళ ఎందుచేతనోకాని హఠాత్తుగా అన్నాడు: "మకార్ అలెగ్జెవిచ్, నీకు నాదొక చిన్న సలహా". అతను నా శ్రేయస్సును కాంక్షిస్తున్నాడనే భావించాను. అందుకే అరమరికలు లేకుండా సంగతులన్నీ చెప్పేశాను. అంటే అన్నీ చెప్పలే

దనుకో. చెప్పగలిగిన సాహసం లేకపోయింది. ఇబ్బందుల్లో వున్నానని మాత్రం చెప్పాను. "అయితే, మిత్రమా, ప్యోతర్ పెత్రోవిచ్ వద్ద కొంత మొత్తం అప్పుగా పుచ్చుకోరాదూ? అతను వడ్డీవ్యాపారం చేస్తున్నాడు. నేనూ అతని దగ్గరే అప్పులు తీసుకొంటుంటాను. వడ్డీరేటుకూడా ఏమంత ఎక్కువ కాదు. న్యాయంగానే వుంటుంది." నరెంకా, ఈ మాటలు నా చెవిన పడేసరికి, నా హృదయం చెంగున ఎగిరి గంతేసిందంటే నమ్ము. బహుశా దేవుడుకూడా పెత్రోవిచ్ చెవిలో వూదక మానడులే: నాకు అప్పు యివ్వాలని భగవంతుడు అతన్ని ఆదేశిస్తాడు. అప్పుడే లెక్కలుకూడా వేస్తున్నానులే. ఎవరెవరి బాకీలు ఎలా తీర్చాలో గుణిస్తున్నాను. ఇంటి అద్దె ఖాతాక్రింద ఎంత యివ్వాలో, నీకు ఎంత కేటాయించాలో బేరీజు వేస్తున్నాను. భయపడకు. నీకు తెలుసుగా. నా బట్టలు పూర్తిగా చినిగిపోయాయన్న సంగతి. నన్ను చూస్తేనే ఎవరికైనా అసహ్యమేస్తోంది. నన్ను ఏడిపించుకు తింటున్నవాళ్ళ హేళననుంచి త్వరగా విముక్తం కావాలి. అదీకాక హిజ్ ఎక్సెలెన్సీ తరచు నా ప్రక్కగానే పోతున్నాడు. ఆయన నా దుస్తులు చూస్తే ఏమనుకొంటాడోనని గుండెల్లో పీచు పీచు మంటూనే వుంది. దుస్తుల ధారణ విషయంలో ఆయన బహు నిక్కచ్చి మనిషి. ఎప్పుడొచ్చి నన్ను ఏ మాట అంటాడో, అంటే నేను ఏమైపోవాలో అని భయపడుతూనే వున్నాను. ఆయన చేత మాటపడి, ఇక తలెత్తుకు తిరగటం సాధ్యమా? అందుచేత అభిమానాన్ని చంపుకొని, అప్పుకోసం పెత్రోవిచ్

దగ్గరికి వెళ్ళక తప్పిందికాదు. అనుమానిస్తూనే వెళ్ళాను. చివరకు అనుకున్నంతా జరిగింది. నేను వెళ్ళేసరికి ఫెత్రోవిచ్ ఎవరితోనో మాట్లాడుతున్నాడు. నెమ్మదిగా వెళ్ళి, అతని ప్రక్కనే నిలబడి విషయం చెప్పాను. ముప్పయి రూబుళ్ళు అప్పుగా యివ్వమని అడిగాను. నేను చెప్పిందేమిటో మొదట అతనికి అర్థమైనట్లు లేదు. అందుచేత మళ్ళీ వివరంగా చెప్పాను. అతను నవ్వి వూరుకొన్నాడు. మళ్ళీ వివరించి చెప్పసాగాను. చివరికి అన్నాడు: "అప్పు తిరిగి చెల్లించగలవన్న గ్యారంటీ ఏమిటి?" అని అతను తన కాగితాలు చూసుకో సాగాడు. నా విషయం పూర్తిగా మరచిపోయినట్లే వ్యవహరించ సాగాడు. ఇది నాకు చాలా బాధ కల్గించింది. "లేదు, పెత్రోవిచ్, జీతంచేతికిరాగానే నీఅప్పు తీర్చేస్తాగా. నామాట నమ్ము". ఇంతలోకి అతనికోసం ఎవరో వచ్చారు. అతను బయటకువెళ్ళాడు. అతని రాకకోసం ఎదురుచూస్తూ నిల బడ్డాను. తిరిగివచ్చాడు. పెన్సిల్ చెక్కుకుంటూ, నేను అక్కడ వున్నానన్న విషయమే అసలు గమనించనట్లు అతను ప్రవర్తించాడు. మళ్ళీ అడిగాను. "పెత్రోవిచ్, ఏదో ఒకవిధంగా నాకు ఈ సహాయం చేసిపెట్టు". అయినా అతను విన్పించు కున్నట్లు కన్పించలేదు. మరికొంతసేపు నిలబడ్డాను. "ఏమంటావ్?" అని మళ్ళీ అడిగాను. సమాధానం లేదు. ఇక లాభం లేదనుకొని తిరిగి వొచ్చేశాను.

బహుశా యిలాంటివారంతా పెద్దమనుష్యులు, మహా యోగ్యులు కాబోలు. ఎంతటి గౌరవనీయులు! ఎలాంటి గర్వపోతులు!! అవును, వరెంకా, హా రెక్కడ, మన

మెక్కడ ? నాకలోకానికీ, నక్కకూ మధ్య వున్నంత ఎడం వుంది. ఈ విషయమే యెమెల్యాన్ ఇవనొవిచ్‌కు చెప్పితే, అతను నవ్వి తలపంకించి ఊరుకున్నాడు. అయితేనేం, తర్వాత ధైర్యవచనాలు పలికి, నన్ను ప్రోత్సహించాడు. చాలా మంచి వాడులే. అతను యోగ్యుడు కనుకనే నాకు సహాయం చేస్తానని మాట యిచ్చాడు. అతని ఎరుకలో ఎవరో ఒక ఉద్యోగి వున్నాడట. ఆ ఉద్యోగి వడ్డీకి డబ్బిస్తాడు. ఆ ఉద్యోగితో చెప్పి, గట్టిగా సిఫారసుచేసి, అప్పు యిప్పిస్తానని అతను హామీ యిచ్చాడులే. ఆ ఉద్యోగి తప్పకుండా అప్పు యిస్తాడని అతను ఘంటాపథంగా చెప్పుతున్నాడు. ఆ ఉద్యోగి దగ్గరకు రేపు వెళ్ళా లనుకొంటున్నాను. వెళ్ళమంటావా ? దేవుని దయ వల్ల నాకు అప్పు దొరికితే ఎంతబాగుండును: ఇంటి యజమానురాలి పోరు మహా ఎక్కువయింది. చివరకు కూడు కూడా పెట్టటం మానేసింది. ఇంట్లోనుంచి తన్ని తరిమేస్తానని బెదిరిస్తోంది. నా బూట్లుకూడా పూర్తిగా ఎందుకూ పనికి రాకుండా తయారయ్యాయి. చివరకు పాంటు గుండీలు సైతం ఊడిపోయాయి...అసలు నా జీవితమే ఊడగొట్టిన నాగటి దుంప చందమైంది! నన్నీ స్థితిలో అధికారులు చూస్తే ఏమవుతుంది ? మన బాధలకు, యాతనలకు అంతం కన్పించటంలేదు, వరెంకా !

మకార్ దెవూష్కిన్.

మిహాల్ అలెగ్జైవిచ్, ఆ ప్రమిత్రమా!

దయయుంచి ఎలాగైనా సరే త్వరగా అప్పు సంపాదించే మార్గంచూడు. ప్రస్తుత పరిస్థితులలో సహాయంచేయమని నిన్ను అడుగవలసింది కాదనుకో. అయినప్పటికీ, మా పరిస్థితులు విషమించాయి కనుక, గత్యంతరంలేక నోరువిప్పి అడుగుతున్నాను. ఇక ఈ కొంపలో ఒక్కరోజుకూడా ఉండలేము. నేను ఎన్ని యిబ్బందులకు లోనుకావలసి వస్తున్నదో బహుశా నీకు తెలియకపోవచ్చు. అనుక్షణం ఆందోళనతో జీవిస్తున్నాను. ఈవేళ ఉదయం ఎవరో ఒక మహానుభావుడు వచ్చాడు. అతనికి యాభై యేళ్ళు పైబడి వుంటాయి. వంటినిండా పతకాలు ధరించాడు. సరాసరి గదిలోకే వచ్చాడు. నేను చకితురాలనయ్యాను. అతను ఎందుకొచ్చాడో నాకు అర్థంకాలేదు. ఫెదోరాకూడా యింట్లో లేదు. బజారు కెళ్ళింది. "నీవు ఎలా జీవిస్తున్నావమ్మా" అంటూ ప్రశ్నించాడు. నా సమాధానంకోసం ఆగకుండా నే చెప్పసాగాడు : ఆ అధికారి మేనమామట. నా విషయంలో ఆ అధికారి ప్రవర్తన చాలా అసభ్యంగా వుందనీ, అందుకు తన మేనల్లుడిని గట్టిగా కూకలేసినట్లూ అతను చెప్పాడు. తన మేనల్లుని ప్రవర్తనమూలంగా తన కుటుంబానికే అపకీర్తి వచ్చినదని వాపోయాడు. తన మేనల్లుడు వట్టి ఆకతాయనీ, రౌడీ వెధవనీ, అతని బారినుంచి నన్ను కాపాడటానికి తాను సిద్ధంగా వున్నాననీ చెప్పాడు. యువ

కుల హావభావాలను, చిలిపిచేష్టలను, మాటలను లక్ష్యపెట్ట వద్దని నాకు సలహా యిచ్చాడు. తండ్రివలె నన్ను కాపాడుతా నని హామీ యిచ్చాడు. నేను సిగ్గుదొంతరలమధ్య వాలి పోయాను. ఏమి సమాధానం చెప్పాలో తోచిందికాదు. అయితే, తొందరపడి అతనికి ధన్యవాదాలు చెప్ప కూడదని మాత్రం నిశ్చయించుకొన్నాను. అతను వచ్చి నా చేయి పట్టుకొన్నాడు. నేను చేతిని వెనక్కు లాక్కోటానికి ప్రయత్నించాను. కాని, అతను నా చేతిని గట్టిగా పట్టుకొని వదలలేదు. నా బుగ్గలు నిమురుతూ అన్నాడు: "నీ అందచందాలు నన్ను మురిపిస్తున్నాయి". చివరకు నన్ను ముద్దెట్టుకోవాలని ప్రయత్నించాడు. తాను వయసుమీరిన వాడిననీ, కనుక తన కోర్కెను కాదనవద్దనీ బతిమాలుకొన్నాడు. (అతన్ని చూస్తేనే నాకు డోకువచ్చి నంత పనయింది.). ఇంతలోకి ఫెడోరా వచ్చింది. అతను కొంచెం కంగుతిన్నాడు. ఎట్లాగో తమాయించుకొన్నాడు. నాలోని వినయమూ, సద్బుద్ధీ అతనికి బాగా నచ్చాయట. తనను యిక ఆప్తుడుగా ఎంచుకోమని చెప్పాడు. ఫెడోరాను ప్రక్కకు పిలిచి, ఏదో మిషమీద కొంత డబ్బు యివ్వ బోయాడు. ఫెడోరా డబ్బు తీసుకోటానికి నిరాకరించినదనుకో. చివరకు వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ, మళ్ళీ వస్తాననీ, ఈ తడవ వచ్చేటప్పుడు నా చెవులకు లోలుకలు కొని తెస్తానని చెప్పి మరీవెళ్ళాడు. ఇంతకన్నా మంచి ఇంటికి మారమన్నాడు. కావాలంటే అద్దెతో నిమిత్తంలేకుండా ఇంటిని యిప్పిస్తా నన్నాడు. చివరకు మరొకసారి ఉద్ఘాటించాడు: నేనంటే

అతని కెంతో యిష్టమట. అందుకే మళ్ళీ హెచ్చరించాడు: పతనం చెందిన యువకుల పన్నాగాలలో పడిపోవద్దని హెచ్చరించాడు. ఆఖరికి చెప్పాడు; అన్నా ఫ్యోదొరోవ్‌నాతో తనకు పరిచయమున్నదనీ, త్వరలోనే ఆమె స్వయంగా ఇక్కడకు వచ్చి, పలకరిస్తుందని వెల్లడించాడు. అప్పటికి నాకు అర్థమైంది; కసి రేగింది. అనవలసిన నాలుగు మాటలు అతని మొఖానే అనేశాను. మెడపట్టి బయటకు గెంటివేసి నట్లు, అతన్ని నేనూ, ఫెదోరా కలిసి సాగనంపాము. ఇదంతా అన్నా ఫ్యోదొరోవ్‌నా పనే. లేకపోతే మా సంగతి అతనికి ఎలా తెలుస్తుంది?

అందుకే, మకార్ అలెక్సెవిచ్, నిన్ను మరీ మరీ వేడుకొంటున్నాను. ఈ ఆపత్సమయంలో నన్ను ఆదుకోవాలి. నన్నీ స్థితిలో వదిలేసి పారిపోవద్దు. వెంటనే యిక్కడనుంచి మకాం మార్చాలి. కనుక ఎలాగైనాసరే డబ్బు సంపాదించు. త్వరగా సంపాదించు. కనీసం పాతిక రూబుల్స్ పంపించు. తర్వాత యీ డబ్బు నీకు తిరిగి యిచ్చివేస్తాలే. స్వయంగా సంపాదించి, నీ అప్పు తీరుస్తాను. వడ్డీ ఎంత అయినా సరే, అప్పు తీసుకురా. నీ పరిస్థితే నికృష్టంగా వున్నప్పుడు నిన్ను యిబ్బంది పెట్టుతున్నాను. అందుకు నేనెంతో బాధపడుతున్నాను. అయినా మరొక మార్గంలేదు. నీవే నా ఏకైక ఆశారేఖవు. సెలవు, మకార్ అలెక్సెవిచ్, నా విషయం ఆలోచించు. శక్తికొలదీ సహాయం చేయి.

—వి. డి.

వెలలేని ప్రియతమా, పర్వీరా అలెగ్జియేనా,

తలవనితలంపుగా వచ్చిపడిన ఈ పిడుగులతో నేను తలక్రిందులై పోయాను. అశనిపాతాలకు అంతం లేదా? ఈ నీచులు, పరమ కిరాతకులు, రాడీకోరులు అంతాకలసి నీలో సత్తువను హరించి వేస్తారు. నీ జీవితాన్ని నాశనం చేస్తారు. ఓనా చిన్నారి వయ్యారీ, నీ కెన్ని యిబ్బందు లొచ్చిపడ్డాయి! వాళ్ళ మూలాన నేను చచ్చిపోయే రోజు దగ్గర పడింది. నీకు డబ్బు సంపాదించి పెట్టకపోతే, నేను బ్రతికి ప్రయోజనమేమిటి? చచ్చిపోతాను. ప్రాణంతీసుకొని చచ్చిపోతాను. నీకు డబ్బు సంపాదించి పెట్టినా, నాకు చావు తప్పనట్టేవుంది. నీ చేతికి డబ్బు యివ్వగానే, నీవు పతంగమై ఎగిరిపోతావు. గుడ్లగూబ లన్నీ ముప్పేట ముట్టడిస్తున్న ఈ గూటినుంచి తప్పించుకొని తుర్రున ఎగిరి పోతావు. అంతవరకు ఖాయం. అప్పుడు యిక నా గతేంకాను? ఇదే నన్ను వేధిస్తోంది, ప్రియతమా. నీవు ఆ పనిచేస్తావా? అది నీకు ధర్మమా? నీవు బాధపడుతున్నావు; వ్యధ చెందుతున్నావు. అదినాకు తెలుసు. బాధలూ, వ్యధలూ, చెరలూ ఎలావుంటాయో తెలిసిన నీవేనన్ను వాటికి గురిచేస్తావా? నేను యిచ్చే డబ్బును తిరిగి చెల్లిస్తా నన్నావు, నాపట్ల నీ కెందుకంత జాలి! కాలానికి వడ్డీగా నీ ఆరోగ్యాన్ని పణంగాబెట్టి, డబ్బు ఆర్జిస్తావన్నమాట. ఇలాంటి విషయాలు వ్రాసేముందు ఒకటి రెండుసార్లు ఆలోచించి

మరీ వ్రాయటం మంచిది. మరొకసారి ఆలోచించు. వరెంకా, బానిసలాగా బ్రతుకుతావా? కలకాలం కుట్టుపనిలో మునిగి తేలుతూ, నీ చిట్టిబుర్రను పాడుచేసుకొంటావా? మాధుర్యం తొణికిసలాడే నీ నయనాలను నాశనం చేసుకొంటావా? నీ ఆరోగ్యాన్ని మంటగల్పుకొంటావా? చెప్పు, వరెంకా, చెప్పు. నాకు తెలుసు, నే నెందుకూ పనికిరాని దద్దమ్మనన్న సంగతి నాకు తెలుసు. కాని, నేను సాధ్యమైనంత మేరకు నా జీవితాన్ని సార్థక్యం చేసుకోటానికే యత్నిస్తాను. ఎన్ని అడ్డంకులొచ్చినా, ఎన్ని అవరోధా లెదురైనా చలించను. ఆఫీసు పనికి తోడు అదనపు పని చేస్తాను. రచయితలకు కాపీలు వ్రాసిపెట్టుతాను. వాళ్ళదగ్గరికి వెళ్ళి అర్థిస్తాను; పని చూపెట్టుమని ప్రార్థిస్తాను. వాళ్ళకు కాపీలు వ్రాసిపెట్టేందుకు ఎటుతిరిగీ ఎవరో ఒకరు కావాలి. ఆ పని నాకే అప్పగిస్తారు. రేయింబవళ్ళూ పనిచేస్తూ, నీ ఆరోగ్యం పాడుచేసుకొంటూ వుంటే, నేను చూసి సహించలేను. ఉపద్రవకరమైన నీ ఉద్దేశాలు సాగటానికి వీల్లేదు. అందుకు నే నొల్లను. ఏమైనాసరే, ఎలాగైనా సరే, తల తాకట్టుపెట్టయినా సరే నా చిన్నారి మురిపాలమూలకు డబ్బు సంపాదిస్తాను. నీ కోర్కె తీర్చలేక పోయిన తర్వాత నే నింక బ్రతికేమి ప్రయోజనం? వడ్డీ ఎంతైనా సరే సందేహించవద్దని వ్రాశావు. నీ కా భయం అనసరంలేదు. నే నీ క్షణాన సందేహాలకు, ఆందోళనకు, అన్నింటికీ అతీతుణ్ణి. నలభై రూబుల్సు అప్పు చేయబోతున్నాను. అది ఏమంత పెద్ద మొత్తం కాదనుకో. ఆ మొత్తం సరిపోతుందా? నా మాటమీద నమ్మకం

వుంచి వాళ్లు అప్పు యిస్తారంటావా? చూచీచూడగానే ఎదుటివారిలో విశ్వాసం పుట్టించగలిగిన సామర్థ్యం నాకు ఉందంటావా? అంటే నా మొఖం చూడగానే వాళ్ళ హృదయాల్లో సదభిప్రాయం మెరుస్తుందంటావా? నీవే ఒక సారి నా ఆకారాన్ని ఊహామాత్రంగా దర్శించి, చెప్పు. నా ఆకారం వికారం కల్గించేది కాదుగా? చెప్పు. నా మనస్సు ఇప్పుడు స్థిమితంగా లేదు. ప్రాణహానికన్నా మాన హాని దుస్సహం అన్నారు. నేను అప్పుగా తెచ్చే నలభై రూబుల్సులోను, పాతిక రూబుల్స్ నీకు కేటాయిస్తాలే, నరెంకా, భయపడకు. ఇంటి యజమానురాలికి రెండు రూబుల్స్ ఇచ్చి సరిపుచ్చుతాను. మిగతా మొత్తం నా ఖర్చులకు అట్టిపెట్టుకొంటాను. ఇంటి యజమానురాలికి ఇంకా ఎక్కువ మొత్తమే ఇవ్వాలనుకో. కాని, నా అవసరాలు కూడా చూసుకోవాలిగదా. అందుకని ఆమెకు అంతకన్నా ఎక్కువ ప్రస్తుతానికి మంజూరు చేయలేను. వెంటనే కొత్త బూట్లు కొనాలి. పాతవి బొత్తిగా పనికిరాకుండా పోయాయి. నెక్ టై కూడా ఒకటి కొంటే బాగానేవుంటుందనుకో. ఇప్పుడు ఉపయోగిస్తున్న నెక్ టై కొని దాదాపు సంవత్సరమవుతోంది. అన్నట్టు నీ ఫ్రాక్ నుంచి చింపిన ముక్కతో నెక్ టై తయారు చేసి పెట్టుతానని చెప్పావుగా. అయితే, ఇంకేం. ఇక కొత్తది కొనవలసిన అగత్యమే లేదు. కనుక కొత్తబూట్లు, కొత్త నెక్ టై రేపోమాపో ధరిస్తానని చెప్పవచ్చు. అయితే ప్రియతమా. ఊడిపోయిన పాంట్ గుండీల సంగతి ఏమిచేద్దా మంటావు? కోటుగుండీలు కూడా పోయాయి. ఇవి హిజ్ ఎక్సెలెన్సీ కంట

పడితే ఏమవుతుంది ? హిజ్ఎక్సెలెన్సీ ఫుసాలున ఏదన్నా మాట అంటే నేను పిసుక్కు పిసుక్కు చావాలి. మాటపడటం మా యింటావంటా లేదు. తల నరికేసినట్టువుంది. కాగా పోగా మూడు రూబుల్స్ మిగులుతాయి. ఆ మొత్తంతో కాలం వెళ్ళబుచ్చాలి. అరపౌను పొగాకు కొనాలి. పొగాకు లేనిదే నేను బ్రతకలేను. తొమ్మిది రోజులైంది పొగపీల్చి. ఎంతకష్టమో నీవే ఆలోచించు, ప్రియతమా ? పొగాకు సంగతి నీతో చెప్పవలసిన పనిలేదనుకో. అయినా నీవు అన్నికష్టాలలో వుండగా, నీకు తెలియకుండా నేను భోగ లాలసాలతో మునిగితేలటం ధర్మంకాదు. వరెంకా, నా హృదయాన్ని నీ ముందు విప్పుతున్నాను. దాపరికం లేకుండా అన్నీ చెప్పేస్తాను. అయినా మనిద్దరిమధ్య దాపరికాలు ఏమిటిచెప్పు ? నేను చాలా ఇబ్బందుల్లో వున్నాను. ఇంటి యజమానురాలి దృష్టిలో నేను పురుగు కన్నా కనాకష్టమై పోయాను. తట్టెడు అవసరాలున్నాయి. పుట్టెడు అప్పులున్నాయి. ఆఫీసులో గుమాస్తాలపోరు పడ లేక చచ్చిపోతున్నాను. వాళ్ళకంటపడకుండా తప్పించుకు తిరుగుతున్నాను. ఒకవిధమైన అజ్ఞాతవాసంలో జీవిస్తున్నాను. నీ ముందుమాత్రమే మనసువిప్పి మాట్లాడటానికి సాహసిస్తు న్నాను. ఒకవేళ నాకు అప్పు పుట్టకపోతే, ఏమవుతుంది? వద్దు వరెంకా, వద్దు, ఆ విషయం అసలు ఆలోచించనేవద్దు. అలాంటి ఆలోచనలతో మన మనస్సును చిత్రహింసలపాల్జేసు కోటమెందుకు ? నీకిదే చెప్పుతున్నాను: అనవసరంగా లేని పోని మనోవేదనలు పెట్టుకోకు. నేనిప్పుడే బయలు దేరుతాను.

కాస్త గడ్డంగీక్కుని మరీ ప్రయాణమవుతాను. చూడటానికి కాస్త గౌరవనీయునివలె కన్పించాలిగా. ఒకసారి దైవప్రార్థన చేసి మరీ బయలుదేరుతాను.

ఎమ్. దెవూష్కిన్

ఆగస్టు, 5

*గౌరవనీయమైన మకార్ అలెక్జీవిచ్,*

నీవే నిరాశ చెందితే, ఇక మా గతేమికాను! నిరాశ చెందకు! మేము అసలే యిబ్బందుల్లో వున్నాం. నా దగ్గరున్న నాలుగు రూబుల్స్ పంపిస్తున్నాను. దయయుంచి, యింకా పంపమని మాత్రం అడక్కు. నేను పంపుతున్న డబ్బుతో ఎలాగోలాగు రెండు రోజులు గడుపుకో. ఫెదోరా వద్దగానీ, నాదగ్గరగానీ ఇక చిల్లిగవ్వకూడా లేదు రేపు ఎలా గడుస్తుందో తెలియకుండావుంది. మకార్ అలెక్జెవిచ్, చాలా విచారకరం. కాని, నీవు విచారించకు, నీ ప్రయత్నం నీవు చేశావు. అది విఫలమైంది. ఏమిచేస్తాం లే? ఇక్కడే వుండి పోదామని ఫెదోరా అంటోంది. మరొకచోటకు మారితే మాత్రం వాళ్ళు మనలను వదిలిపెడతారా అని ప్రశ్నిస్తోంది.

అయినప్పటికి మేము చోటు మార్చక తప్పదు. మరొకసారి వివరంగా వ్రాస్తాను. ఇప్పుడు మనస్సు ఏమీ బాగాలేదు.

మకార్ అలెగ్జివిచ్, నిజంగా నీవు చాలా వింత మనిషివి. లేకపోతేఏమిటి ? ప్రతిచిన్న విషయానికీ అంతగా బాధపడటమా ? అందుకే నీజీవితం దుఃఖభాజనం అవుతోంది. నీ వుత్తరాలను జాగ్రత్తగా చదువుతున్నాను. నీగురించికన్నా నాగురించేనీవు ఎక్కువగా ఇదవుతున్నావు. నీవేదో కరుణార్ద్ర హృదయుడవని ఇతరులంటారు. నేనూ అలాగే అనుకోవాలి! మకార్ అలెగ్జివిచ్, నీ మనస్సు నొచ్చుకోకపోతే, నీకు నేనొక చిన్న సలహా చెప్తాను. నాకోసం నీవుచేసిన త్యాగానికి నేను సదా కృతజ్ఞురాలనై వుంటాను. ఎన్నటికీ మరచి పోను. నావల్ల నీవు ఎన్నో బాధలకు, ప్రమాదాలకు లోనయ్యావు. నీ యాతనలకు నేను కారణభూతురాలనయ్యాను. నా సంతోషమే నీ ఆనందం, నా దుఃఖమే నీ విచారం. ఇలా గైతే ఎలాగు చెప్పు. అందుకే నీ బ్రతుకు విషాదమయంగా తయారైంది. నా అనురాగంకోసం నీవు ఇన్నితిప్పలు పడ నేల ? ఇవాళ ఆఫీసునుంచి వస్తున్న నిన్నుచూస్తే, నాకు విపరీతమైన భయమేసింది. నీరూపు మహాభయంకరంగా తయారైంది. ఎందుకంతగా తలక్రిందులు కావటం ? చేసిన ప్రయత్నం విఫలమైందనేగా ? అపజయాన్ని చిరునవ్వుతో స్వీకరించటం అలవర్చుకోవాలి. నీకు నేను ఇవ్వగల్గిన చిన్న సలహా ఇదే. వివేకభ్రష్టుడివి కావద్దు రోజు లెప్పుడూ ఇలాగే ఉండబోవు. మంచిరోజులు రాకమానవు. నీవేచూస్తావుగా.

సెలవు, మిత్రమా. నన్నుగురించి ఆందోళన చెందకు. నీకు ఇదే నా విన్నపం.

వి. డి.

ఆగస్టు 5

వరెంకా, నా ముద్దుల దానా,

బేష్, మురిపాల మాలా బేష్. డబ్బు సంపాదించలేక పోయినా ఫరవాలేదన్నావు. అయితే మంచిదే. నీవు ఈ మాటన్నందుకు నాకెంతో ఆనందంగా వుంది. ఆత్మస్థయిర్యం హెచ్చింది. ఉన్నచోటనే ఉండిపోతానని నీవు చెప్పటం మరీ సంతోషం. నిజం చెప్పాలంటే, నీ ఉత్తరం చదివి నేను పరమానంద భరితుణ్ణయ్యాను నా భావాలకు నీవు విలువిచ్చావు. అభిమానంకొద్దీ నేనా మాటలు చెప్పటంలేదు. నీవు నన్ను ప్రేమిస్తున్నావనీ, నా హృదయంలో పొటమరించిన భావాలను గౌరవిస్తున్నావనీ నాకు తెలుసు. నా హృదయం గురించి మాత్రమే చెప్పనేల? ఏమైనా నా హృదయం నా హృదయమేగా. హృదయాన్ని కోల్పోవద్దని నీవు సలహా యిచ్చావు. నిజమే, ప్రియతమా, హృదయంలో నీరసం. నైరాశ్యం పగవానికికూడా వద్దు. అయితే, నా చిన్నారీ,

దీనిసంగతేమిటి చెప్పు? నేను బూట్లను గురించి ఆలోచించాలా, వద్దా? రేపు ఏ బూట్లు ధరించి ఆఫీసుకెళ్ళాలి? ఇందులోనే వుంది చిక్కంతా. ఇలాంటి వెతలే మానవులను సర్వనాశనం చేస్తాయి. ఈ మనోవేదనకు కేవలం నేనే కారణంకాదు. నామట్టుకు నాకు బూట్లు లేవన్న చింత లేదు. కొరుక్కుతినే చలిలోనైనా, కాళ్ళంటుపోయే ఎండలోనైనా వట్టి కాళ్ళతో నడవటానికి నేను సిద్ధమే. దానివల్ల నా కొచ్చిన నష్టమేమిటి? నే నేమంత గొప్పవాణ్ణికాదు. నేను సాధారణ జీవిని. కాని కాళ్ళకు బూట్లులేకుండా నడుస్తున్న నన్ను జూసి లోకులు ఏమనుకుంటారు? నా శత్రువులు ఏమంటారు? వీడి మొఖానికి చివరకు బూట్లూ లేవూ; కోటూ లేదూ అనిపోరూ! నేను కోటు ధరించినా, చివరకు బూట్లు వేసుకొన్నా వారి కోసమే? చూడు వరెంకా, నా గౌరవము నిలుపుకోవాలన్నా, మానం కాపాడుకోవాలన్నా బూట్లు వేసుకోక తప్పదు గదా. చిరిగిన బూట్లు తొడిగితే గౌరవమూ నిలువదు; మానమూ దక్కదు. నిజం, ప్రియతమా. అనేక సంవత్సరాల అనుభవంలో గడించిన గుణపాఠం ఇది. లోకం అంటే ఎలాంటిదో, లోకులు ఎలాంటివారో జీవితానుభవంతో తల నెరుస్తున్న నాకు తెలుసు. కాలాన్ని నిచ్చెనగా జేసుకొని పైకివచ్చిన చవటల మాటలుగానీ, రాతగాళ్ళ కూతలుగానీ ఈ విషయంలో విశ్వసించకు.

అన్నట్టు చెప్పటం మర్చిపోయాను. ప్రియతమా, ఈవేళ ఏమిజరిగిందో తెలుసా? నేను ఇవాళ ఎన్ని బాధలు

పడ్డానో తెలుసా? ఇవాళ నా తల బాగా బొప్పి కట్టింది. కనీసం సంవత్సరంలోపల దీనిని మర్చిపోలేను. జరిగింది ఇది: తెల్లవారకముందే లేచి, అప్పుకోసం వాడింటికి బయలు దేరాను. మళ్ళీ ఆఫీసు కెళ్ళటం ఎక్కడ ఆలస్యమైపోతుందో నన్న భీతితో మసక చీకటిలోనే పయనమయ్యాను. జోరున వర్షం కురుస్తున్నది. ఎక్కడ చూసినా మోకాలులోతు నీళ్ళ మడుగులు, అయినా కాళ్ళీడ్చుకుంటూ వాడింటికెళ్ళాను. దారి పొడుగునా భగవంతుణ్ణి మనసులో ప్రార్థించాను; భగవంతుడా, కరుణించు; చేసిన పాపాలు మన్నించు; ప్రార్థనలు ఆలకించు. ఈ ఒక్కసారికి నాయందు దయయుంచి సాయపడు" చర్చి కన్పించగానే చేతులెత్తి దండం పెట్టాను. మళ్ళీ దేవుడిని వేడుకొన్నాను, నేను చేసిన పాపాలేమైనా వుంటే క్షమించు. దేవుని విషయంలో షరతులు పెట్టటం మంచిదికాదని గుర్తించినవాడినై, అక్కడితో ఊరుకొన్నాను. ఆలోచించుకొంటూ ముందుకు సాగాను. లోకం సంగతే పూర్తిగా మరచిపోయి, అప్పును గురించే ధ్యానిస్తూ, ధ్యాసంతా దానిపైనే లగ్నంచేస్తూ వాడి ఇంటికి వెళ్ళాను. వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. ఒకవేళ నాబోటి అభాగ్యులు ఒకళ్ళిద్దరు వీధుల్లో సంచరిస్తున్నా వారుకూడా నావలెనే తమసొంత గొడవల్లో పూర్తిగా లీనమైపోయినట్టున్నారు. అంత తెల్లవారుఝామున, అంత చలిలో, అంత హోరువానలో సంచరించేది నిర్భాగ్యులుకాక మరెవరు? పోగా పోగా కొందరు కూలీలు ఎదురు పడ్డారు. ఆ నీచులు నన్నుచూసి హేళనచేశారు. అకస్మాత్తుగా నాలో ఆందోళన

బయలుదేరింది. నేను ఇక అప్పుకోసం అంతగా ఆరాటపడ దల్చుకోలేదు. మరొక ప్రయత్నం చేసిచూద్దాం. ఫలిస్తే ఫలిస్తుంది. ఫలించకపోతే మాత్రం నాకొచ్చే నష్టమేమిటి? ఇందులో పోయేదేముంది కనుక. ఎట్టకేలక వాడి యింటిని సమీపించాను. తీరా అక్కడికెళ్ళే సరికి, నీళ్ళలో బాగా నానిన నాబూట్లు పూర్తిగా పీలికలు, పీలికలై పోయాయి. అవి కాళ్ళంట రానంటున్నాయి. ఏమిటి చేయటం? ఏమిటీ కర్మ? అలాంటి పరిస్థితుల్లో ఇంకా నేను ఎవరిదగ్గరికి పోగలను? కర్మంచాలక అప్పుడే గుమాస్తా వెధవ ఒకడు ఎదురయ్యాడు. నన్నుచూసి ఆగి, ఎగాదిగా చూడసాగాడు. పనిపాటలు లేని వెధవ. "కాఫీ ఇప్పిస్తావా?" అన్న భావం వ్యక్తంచేస్తూ మొఖం పెట్టాడు. "ని ఆరోగ్యం కాంక్షిస్తూ కాఫీ గటగట తాగేస్తాను" అన్నట్టు చూచాడు. "అలాగే, అబ్బీ, నా ఆరోగ్యం కాంక్షిస్తూ నీవు కాఫీ గటగటా తాగేయ్" అని మనసులో అనుకొంటూ, ముందుకు సాగాను. కాళ్ళు ముందుకు సాగటంలేదు. బాగా అలిసిపోయినట్టున్నాను. కాసేపు విశ్రాంతితీసుకొన్నాను. మళ్ళీ నడక ప్రారంభించాను. ఏమీ పాలుబోక అటూ ఇటూ పరికించసాగాను. దృష్టిని మళ్ళిస్తే మనస్సులో బాధపెట్టుతున్న భావాలన్నీ మార్పు చెందుతాయోమోనన్న ఆశతో. బాధమాత్రమే మిగిలింది. కొత్త భావమేమీ జొరబడలేదు. దిక్కులుచూస్తూ నడుస్తున్నానేమో, గుంటలో కాలేశాను. బట్టలనిండా బురద చిమ్మింది. నా ఆకారంచూస్తే నాకే కళ్ళంట నీళ్లు తిరిగాయి. ఏడుపు పొర్లుకొచ్చింది. అమ్మయ్యా, ఎట్లా

గ్గై తేనేం, అప్పిచ్చువాని యింటికి చేరాను. అప్పిచ్చువాని ఇల్లు-మార్కోవ్ ఇల్లు - ఇది అవునాకాదా అన్న జంఝూటన తోనే ఆ ఇంటి ఆవరణలో అడుగుపెట్టాను. ఇది ఎవరిల్లని భయపడుతూ అడిగాను. "మార్కోవ్ ఇల్లు" అని ఎవరో - బహుశా కాపలావాడై వుండవచ్చు - చాలా నిర్లక్ష్యంగా జవాబు ఇచ్చాడు. చివరకు కాపలాకాసే వెధవకుకూడా ఎంత నిక్కో చూశావా! మనసులో పీచుపీచుమంటూనే వుంది. లోపలకువెళ్ళి అప్పు అడగటమా, మానటమా అని నాలో నేను పలుమారులు తర్కించుకొన్నాను. "నోరు తెరిచి అడిగినా అతను అప్పు యివ్వటం కల్ల" "ముక్కూ మొఖం ఎరుగని నాకు, చూస్తేనే వికారం పుట్టించే ఈ ఆకారంలోవున్న నాకు అతను అప్పు యిస్తాడా? బ్రహ్మరాత ఎలా వుంటే అలాగే జరుగుతుంది. అదృష్టం వుంటే అప్పు యిచ్చినా యివ్వవచ్చు. అప్పు అడిగినంతమాత్రాన పోయేదేముంది? నన్ను నమలకుండా మింగడుగదా?" అనుకొంటూ పిల్లిలాగా లోన ప్రవేశించాను.

ఇంతలోకి భంయ్‌మంటూ ఒక కుక్కవచ్చి నా పైన ఉరికింది. ఏదో పరాకుగా వున్నప్పుడు అమాంతంగా కుక్క మొరుగుకుంటూ వచ్చి మీదపడితే యెవరైనా జడుసుకోకతప్పదు. నేను కంగుతిన్నాను. మనస్సంతా వికలమైపోయింది. జీవంగల ప్రాణివలెకాక, ప్రాణంపోయిన శవంవలె లోన ప్రవేశించాను. పోతూపోతూ ఎదురువస్తున్న ముసలిదాన్ని ఢీకొన్నాను. ఆమె చేతిలోని పాలబిందెకాస్త కిందపడిపోయింది. ఆమె నోటికొచ్చినట్లల్లా నన్ను తిట్టి

పోయింది. అన్నీ అపశకునాలే. "నీ విక్కడకు యెందుకొచ్చావ్?" అంటూ ఆ ముసల్ది గద్దించింది. వరెంకా, ఇదంతా నా కర్మ. ఈ గల్లంతు విని యింటి యజమానురాలు గదిలోనుంచి బయటకు వచ్చింది. నేను వచ్చిన పనిని గురించి ఆమెకు నివేదించుకొన్నాను. అప్పుడు ఆ ముసల్ది తన కూతురును కేకేసింది. సన్నగా, పొడుగ్గా వున్న ఆడపిల్ల బయటకు వచ్చింది. "పోయి నాన్నను పిల్చుకురా. మేడపైన వున్నాడు. బాడుగ వాళ్ళతో మాట్లాడుతున్నాడు. వెంటనే రమ్మనిచెప్పు" అని ముసల్ది కూతురిని పురమాయించింది. నన్ను ఉద్దేశించి, "రండి, లోపలకు రండి" అంటూ ఆహ్వానించింది.

గదిలో కెళ్ళాను. గదంతా చక్కగా అలంకరణతో అలరారుతోంది. గోడలనిండా ఫొటోలు వేలాడుతున్నాయి. వాటిల్లో హెచ్చుభాగం సైనికయోధుల చిత్తరువులు. గదిలో ఒకసోఫా, ఒక గుండ్రటని బల్ల ఉన్నాయి. కిటికీలలో పూల కుండీలు ఉన్నాయి. మర్యాద చెడకముందే తిరిగి పోదామనుకొన్నాను. గడపదాకా వచ్చానుకూడా. నిజం, ప్రియతమా! మళ్లీ రేపు రావచ్చు ననుకొన్నాను. అప్పటికి వాతావరణం బాగుపడుతుంది. పాలు వలకటం అంటూ వుండదు. గోడలపై వేలాడే సైనికయోధులు కూడా నావంక అంత కోపంగా చూడకపోవచ్చు. ఇలా అనుకుంటూ గడపదాటి, కాలు బయటపెట్టే సమయానికి సరిగా అతను రానే వచ్చాడు. ఇప్పు డిప్పుడే తల నెరుస్తోంది. బాగా మురికి తేలిన దుస్తులు ధరించివున్నాడు. ఏం పనిమీద వచ్చారని

అడిగాడు. సంగతంతా చెప్పాను. యెమెల్యాన్ ఇవనొవిచ్ సంగతీ చెప్పాను. నలభై రూబుల్స్ అప్పుగా ఇవ్వమన్నాను. చెప్పవలసిన విషయాలు చెప్పటం పూర్తికాకుండానే అతను మధ్యలో అడ్డుతగిలాడు: "నీకు డబ్బు అంత అత్యవసరమా" అని ప్రశ్నించాడు.

అతని చూపుతోనే తేలిపోయింది. నా ప్రయత్నం కాస్త నిష్ఫలమైనట్లు అనుమానమేసింది. "అయితే ఇప్పుడు నావద్ద డబ్బేమీ లేదు. అయినా నీకు అప్పు యిస్తే, అది తిరిగి వస్తుందన్న హామీ ఏమిటి?" అనేశాడు. నేను విషయాలన్నీ విడమర్చి చెప్పాను. బతిమాలుకొన్నాను. ప్రాధేయపడ్డాను. యెమెల్యాన్ ఇవనొవిచ్ విషయం చెప్పాను. చాలా చిక్కులో వున్నానని నివేదించుకొన్నాను. అయినా వినిపించుకొన్నాడు కాదు. "నీ సోదంతా వింటూ కూర్చునే ఓపిక నాకు లేదు. ఇక దయచేయవచ్చు. నా వద్ద డబ్బులేదు" మూడు ముక్కలలో తేల్చేశాడు. డబ్బులేదంటే నేను నమ్మలేదు. మొదట్లోనే అనుకొన్నాను. అనుకొన్నట్టే జరిగింది; అవును, వరెంకా, ఈ ధరామాత నన్ను అప్పుడే తనలో లీనం చేసుకొనివుంటే ఎంత బాగుండునని పించింది. అయినా ఆశ ఇంకా చావక మళ్ళీ ప్రాధేయపడ్డాను. "నీకు డబ్బెందుకు" అన్నాడతను. డబ్బు అవసరమేమిటో విన్నవించబోయాను. వినిపించుకున్నాడు కాదు. "నా దగ్గర డబ్బు లేదు పొమ్మ"న్నాడు. అతని దగ్గర అంత డబ్బుంది. అందులో కొద్దిగా అప్పు ఇవ్వటానికి అతను నిరాకరించాడు. డబ్బున్నవాళ్ళ దగ్గర వున్నరోగం ఇదే. ఎంతో బాధపడ్డాను. అప్పుడు నీవు తలుపుకొచ్చావు. ఎంత

వడ్డీ అయినా చెల్లించటానికి సిద్ధమేననికూడా చెప్పాను. "వడ్డీ లేదు, గిడ్డీ లేదు. పొమ్మ"న్నాడు. ఆరి భగవంతుడా అను కొంటూ తిరుగుముఖం పట్టాను. కాళ్ళీడ్చుకుంటూ ఆఫీసుకు వెళ్ళాను. దుస్తులన్నీ ఖరాబుగా వున్నాయి. బ్రష్‌తో తుడుచుకుందామని ప్రయత్నించాను. ఆ బ్రష్ ఆఫీస్ దేమో, టాట్ వీల్లేదు పొమ్మన్నాడు కాపలాదారు. చూశావా, ప్రియతమా నేను అందరికీ ఎలా లోకువై పోయానో? డబ్బు లేదన్న చింతలేదు; కాని, ఇతరులు నన్ను చిన్నచూపు చూస్తే మాత్రం నేను భరించలేను. ఇదే నాబాధ. ఇతరులు నన్ను అవహేళన చేస్తున్నారు. నాపై నీచప్రచారం సాగిస్తు న్నారు. ఈ ప్రచారం ఆ నోటా ఆ నోటా చివరకు హిజ్ ఎక్సలెన్సీ చెవిని పడితే ఇంకా ఏమన్నా వుందా? నాకు దుర్దినాలు వచ్చిపడ్డాయ్.

ఇవాళ నీ ఉత్తరాలన్నింటినీ మళ్ళీ ఒకసారి చదివాను. వాటిని చదువుతూంటే పట్టరాని విచారం పొర్లుకొచ్చింది. ప్రియతమా, సెలవు. భగవంతుడు నీకు మేలు చేయుగాత!

ఎమ్. దెవూష్కిన్.

తాజా కలం: నా కష్టాలను హాస్యరూపంలో చిత్రిం చాలని ప్రయత్నించాను. ఆ ప్రయత్నంలో నేను నెగ్గలేక పోయాను. నిన్ను సంతోషపెట్టాలనుకొన్నాను. ప్రియతమా, వచ్చి నిన్ను కలుస్తాలే. రేపు తప్పకుండా వస్తాలే.

వర్వారా అలెగ్జియేనా, నా చిన్నారి ఎయ్యాంకే,

హాతోస్మి! మనిద్దరికి ఇక పుట్టగతులు లేవు. సర్వం నాశనం. నా గౌరవం, నా ప్రతిష్ట అన్నీ మంటకలిసిపోయాయి. నేను నాశనం అయిపోయాను. నాతోపాటు నిన్నూ నాశనం చేశాను, నీ నాశనానికి కారకుణ్ణి నేనే. వాళ్లు భూతాలై నన్ను వెంటాడుతున్నారు. వేధిస్తున్నారు. నన్ను అవహేళన చేస్తున్నారు. నాపై నీచప్రచారం సాగిస్తున్నారు. మా యింటి యజమానురాలు వీధినపడి నన్ను తిట్టిపోస్తోంది. నలుగురిలో నిలబెట్టి నన్ను అడిపోస్తోంది. తలెత్తుకొని తిరగలేకపోతున్నాను. రతజ్యేవ్ కొందరికి నిన్న అల్పాహారవిందు చేశాడు. ఆ విందులో ఎవడో ఒక రౌడీవెధవ నేను నీకు వ్రాసిన లేఖ చిత్తుప్రతిని తీసి బిగ్గరగా చదివాడు. ఆ చిత్తుప్రతిని పొరపాటున ఎక్కడో జారవిడిచినట్టున్నాను. బహుశా నా జేబులో నుంచి జారిపోయిందేమో. కర్మంచాలక అది ఆ రౌడీవెధవ చేతిలో పడింది. మనిద్దరిని ఎగతాళిచేస్తూ ఏవేవో కూతలు కూశారు. ఆ కారుకూతలను గురించి ఏమని చెప్పను! ఏమి పకపకలు, ఏమి వికవికలు! విద్రోహులు. ఉండబట్టలేక, సహించలేక. భరించలేక గబగబావెళ్ళి, వాళ్లందరినీ అక్కడే నిలబెట్టి, పూర్తిగా కడిగేశానులే! "ఓ రతజ్యేవ్, నీవు ఆ ప్తమిత్రునికి ద్రోహంచేసే పరమ విద్రోహివి. వెన్నుపోటుపొడిచే కిరాతకుడివి" అని తిట్టేశాను. అంటే

అతను ఊరుకున్నాడా? లంజను లంజంటే బజారు కెక్కి—"నీవు లంజ, నీ అమ్మ లంజ, నీ అమ్మమ్మ లంజ" అని కూసినట్టు నన్ను ఏమేమో మాటలన్నాడు. నేనే విద్రోహినట. మోసకారినట. దొంగనట. ప్రేమికుడినట. ఇప్పుడు అంతా నన్ను "మహాశయా, ప్రేమికా!" అంటూ హేళన పూర్వకంగా పిలుస్తున్నారు. దుస్సహం ప్రియతమా! వాళ్లకు అన్నివిషయాలు తెలిసిపోయాయి. మన రహస్యాలన్నీ లాగేశారు. చివరకు యింట్లో పనిచేసే ఫాల్డోనీకూడా నామాటను ఖాతరుచేయటంలేదు. నేను ఏపని చెప్పినా చేయను పొమ్మంటున్నాడు. "అదేమిట్రా" అంటే "నీ వేమన్నా మా అమ్మగారికి అద్దె చెల్లిస్తున్నావా?" అని ఎదురుప్రశ్న వేస్తున్నాడు. చివరకు ఈ వెధవతో కూడా మాటలు పడవలసివస్తోంది. సహించలేక "నీచుడా" అన్నాను. "నీకన్నా ఈ లోకంలో నీచులెవ్వరూ లేరులే" అన్నాడు. ఆమాట అన్నప్పుడు వాడు తప్పతాగి వున్నాడు. "ఓరి త్రాగుబోతు వెధవా! తప్పతాగి నోటి కొచ్చినట్లల్లా కూస్తావుగా" అన్నాను. "నీ డబ్బుతో తాగలేదులే. అయినా ఏగానికి కొరగాని నీవు, ఆడదాని దగ్గరనుంచి పావలా, బేడా తీసుకొనే నీవు వచ్చి నన్ను వెక్కిరించాలా" అన్నాడు. "ఏం పెద్దమనిషివయ్యా!" అన్నాడు కూడా. మనం యింతటిస్థితికి దిగజారిపోయాం, వరెంకా. నిత్యం యిలాంటి అవమానాలు పొందుతూ జీవించటం దుర్లభం. నన్ను మాలవాణ్ణి చూసినట్టు చూస్తున్నారు. ఎంతటి దురదృష్టం. అంతా సర్వనాశనం. ఇక లాభంలేదు.

ఎమ్. డి.

ఆగస్టు, 13

గౌరవనీయమైన మకార్ అలెగ్జీవిచ్,

మిడతలదండువలె వచ్చిపడుతున్నాయి కష్టాల పరంపర. ఏమిచేయాలో పాలుపోకుండా వుంది. నీ స్థితి ఏమికాను? ఇక నేను నీకు చేయగలిగిన సాయమేమిటి? ఈ వేళ రాయిపడి, నా చేయి నలిగిపోయింది. ఈ స్థితిలో నేను చేయగల్గిందేమిటి? ఏ పనీ చేయలేను. ఫెడోరా మూడు రోజులుగా మంచానపడి తీసికొంటోంది. అసలు లేనటమే లేదు. ఏమీ తోచకుండా వుంది. నాదగ్గరున్న చిల్లరకాస్తా పంపిస్తున్నాను. నావద్ద మిగిలిందింతే. నీకు సహాయం చేయాలనుకొంటున్నప్పటికీ. చేయలేకపోతున్నాను. నిజంగా ఏడుపు వస్తోంది. ప్రియమిత్రమా, సెలవు. సాయంత్రం నీవు ఒకసారి వచ్చి వెళ్ళితే సంతోషిస్తాను.

వి. డి.

ఆగస్టు, 14

మకార్ అలెగ్జీవిచ్,

నీకేమన్నా మతిపోయిందా? నీలో దైవభీతి పూర్తిగా నశించిందా యేమిటి? నీ వ్యవహారం చూస్తే నాకు

పిచ్చెత్తేట్టుంది. సిగ్గుపడవలసిన విషయం ఇది. చేజేతులా సర్వనాశనం కొని తెచ్చుకొంటున్నావు. నీ పేరు ప్రతిష్టలను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకో. అతిమర్యాదస్తుడివే, అత్యంత ఆత్మగౌరవం కలవాడివే. అలాంటి నీవు ఇలాంటి పని చేయటమా? ఈ విషయం ఆఫీసులో తెలిస్తే ఏమనుకొంటారో ఆలోచించావా? అవమానభారంతో తల దించేసుకోవలసి వస్తుంది! జీవితానుభవంతో నీ తల నెరుస్తోంది; దైవభీతిని విడనాడక! నీకు ఇక వచ్చినా సహాయం చేయనని ఫెడోరా అంటోంది. నేనూ అంతే. నీవు పిచ్చిపిచ్చిగా ప్రవర్తిస్తే, నేను చూస్తూ వూరుకొంటాననుకొన్నావా? నీ మూలాన నేను ఎన్ని బాధలు పడుతున్నానో ఆ భగవంతుడికే తెలియాలి. నేను కాలుతీసి బయటపెట్టితేచాలు, అంతా వింతగా నావంకే చూస్తున్నారు. సూటీపోటీమాట లంటున్నారు. నేను త్రాగుబోతుతో వుంటున్నానట. నిన్న వాళ్లు ఇంటికి మోసుకొచ్చినప్పుడల్లా "చూడండి, ఆ గుమ్మస్తాను మళ్ళీ మోసుకొచ్చారు" అని లోకులు అంటుంటే, ఆ మాటలు వినలేక చచ్చిపోతున్నాను. దుఃఖం పొర్లుకొస్తోంది. ఇక నేను ఇక్కడ బ్రతకలేను. ఎక్కడికన్నా వెళ్ళిపోతాను. చివరకు ఏ ఇంట్లోనైనా పనిమనిషిగా జేరి, పొట్టకింత సంపాదించుకొంటాను. అంతేకాని ఇక్కడ వుండటం ఇక నా వల్ల కాదు.

ఒకసారివచ్చి చూసి పొమ్మని ఎన్నోసార్లు చెప్పాను. అయినా నీవు రానేలేదు. నా వేడికోళ్ళూ, నా కన్నీళ్ళూ అంటే నీకు అసలు బొత్తిగా లక్ష్యమే లేకుండా పోయిందన్న మాట. ఇదేమి న్యాయం, మకార్ అలెక్సెవిచ్. అయినా

తాగి తందనాలాడటానికి నీకు డబ్బు ఎక్కడనుంచి వస్తూన్న దంట! దయచేసి, ప్రవర్తనను మార్చుకో. సర్వనాశనం తెచ్చుకోకు. ఎందుకొచ్చిన త్రాగుడు? ఇంటి యజమానురాలు నిన్ను ఇంట్లో అడుగుపెట్ట నివ్వటంలేదనీ, అందుచేత నీవు రాత్రిపూట వసారాలోనే కాలక్షేపం చేస్తున్నావనీ తెలిసింది. ఎంత అవమానకరం! ఎంత సిగ్గుచేటు! ఈ సంగతి విన్నప్పుడు నేను ఎంత ఇదైయ్యానని!

ఒకసారి వచ్చిపో. నీకు యిక్కడ సంతోషం, ఆనందం లభిస్తాయి. మనమంతా కలిసి కథలు చదువుకొందాం. గత స్మృతులు తలుచుకొంటూ ఆనందిద్దాం. ఫెడోరా తాను చూచివచ్చిన పవిత్రస్థలాలను గురించి అనేక విశేషాలు చెప్పుతుంది. నిన్ను నీవు నాశనం చేసుకోకు, నన్ను నాశనం చేయబోకు. దేవుని పేరిట నిన్ను ప్రార్థిస్తున్నాను. నీకోసమే నేను జీవిస్తున్నాను. నీకోసమే నేనిక్కడ వుంటున్నాను. గౌరవంగా బ్రతుకు. కష్టాలొచ్చినప్పుడే నిష్టగా బ్రతకాలి. పేదరికం పాతకం కాదన్నవిషయం గుర్తుంచుకో. అయినా నిరాశ చెందవలసిన అగత్యమేమిటి? పైన దయామయుడైన దేవుడు లేడూ? కష్టాలు కావటికుండలు. రోజు లెప్పుడూ యిలాగే వుండవు; మంచిరోజులు రాకమానవు. నావద్ద మిగిలిన చిల్లరడబ్బులు పంపిస్తున్నాను. దానితో పోగాకో, లేక యింకా నీకు అవసరమైన వస్తువో కొనుక్కో. అంతే కాని త్రాగుడికి తగలెయ్యకు. లేనిపోని ప్రతిష్ఠకోసం పెనగులాడక, చేసిన తప్పు ఒప్పుకొని, పశ్చాత్తాపపడటం వివేకవంతుని లక్షణం. దేవునియందు నమ్మకం ఉంచుకో. భగవంతుడే మేలు చేకూర్చుతాడు. వి. డి.

వర్వారా అలెగ్జియేనా, నా మధురమైన ఎయ్యంగనమా!

నిజం, నీ వన్నది నిజం. నీ వన్నట్టు అవమానభారంతో నా తల వంగిపోతోంది. అయితే అన్నట్టు ఇంతమాత్రంతోనే నిజంగా పుట్టి మునిగి పోయిందా? హమేషా కాకపోయినా, అడపాతడపా నిషా చెరుపు చేస్తూందంటావా? మనస్సుకు హుషారు అక్కర్లేదంటావా? ఇప్పుడు చెప్పులగొడవ, బూట్ల గొడవ పూర్తిగా మరచిపోగల్గుతున్నాను. కాళ్ళకింద పడేసి త్రొక్కే-వాటికి మంచేమిటి, చెడేమిటి? అదంతా కేవలం నాన్ సెన్స్. పూర్వం గ్రీసు దేశంలో మహా మేథావులంతా కాళ్ళకు చెప్పులు, బూట్లు లేకుండా నడవగాలేనిది, ఇప్పుడు మనకుమాత్రం అవెందుకు చెప్పు. అయినప్పుడు ఒనం నన్ను ఎద్దేవాచేయనేల? ఏడిపించనేల? ప్రియతమా, ఉత్తరంలో వ్రాయటానికి నీకు ఇంతకు మినహాయించి మంచి విషయాలే దొరకలేదా? నేను చెప్పానని ఫెడోరాతో చెప్పు. అది ఎందుకు పనికిరాని, పనికిమాలిన ముండ. పైగా శుద్ధ తెలివితక్కువ మొద్దు. పోతే నెరుస్తున్న నా జుత్తు విషయం. పొరపాటు బడుతున్నావు, వరెంకా. నేను నీవు అనుకొంటున్నంత ముసలి వాణ్ణికాదు. యెమెల్యా అభినందనలు అందజేస్తున్నాడు. నా మూలాన నీవు నాశనమైపోయినట్టూ, నాకోసం నీవు ఏడుస్తున్నట్టూ వ్రాశావు. నీవు అలా అంటే, నీ మూలానే నేను సర్వనాశనమైయ్యాననీ, అందుకే అఘోరిస్తున్నాననీ, వ్రాయ

వలసివస్తుంది. ఈ జాబును ముగించేముందు, నీకు దీర్ఘాయురారోగ్యాలు కల్గుగాక! నా మట్టుకు నేను ఆరోగ్యంగానే వున్నాను. ఉంటాను, చిన్నారి వయ్యారీ.

నీ స్నేహితుడు,
మకార్ దెవూష్కిన్.

ఆగస్టు, 21

*ప్రియమైన, గౌరవనీయమైన నేస్తమా, వర్వారా అలెక్సెయేవ్నా,*

చేసిన తప్పిదానికి పశ్చాత్తాపడుతున్నాను, ప్రియతమా. అయినా ప్రయోజన మేమిటి చెప్పు. ఇలాగే ఇంతకు ముందు తప్పులు చేసినప్పుడల్లా పశ్చాత్తాపడలేదనుకనా? నిజంగా తప్పుచేశానన్న భావం మనస్సును పట్టుకు పీకిస్తోంది. ప్రియతమా, నేను దుష్టుణ్ణికాదు; దురాలోచనా పరుణ్ణీకాదు. కటికవాణ్ణీకాదు. నీ మనస్సును బాధపెట్టేవాడు నిజంగా కర్కోటకుడై వుండాలి. కాని నేను లవలేశమూ కర్కోటకుణ్ణి కాదన్న సంగతి నీకూ తెలుసుగా. నాది తోడేలు మనస్తత్వం కాదు, మేకవంటి మనస్సు నాది. అందుచేత, ప్రియతమా, తప్పంతా నాదేనంటే మాత్రం నేను ఒప్పుకోను. తప్పు ఎవరిదో నేను వేరే చెప్పాలా? నీవు డబ్బులు పంపించావు.

ఒకసారి కాదు. రెండుమూడుసార్లు. ఆ డబ్బులు చూస్తుంటే నా గుండె తరుక్కుపోయింది. ఇది ఒక అభాగిని సొమ్ముకదా అన్న భావం నన్ను బాధించింది. నీ చేతికి గాయం అయింది. కొన్నాళ్లపాటు నీవు ఏపనీ చేయలేవు. అంటే పస్తులుతప్పవన్న మాట. అయినా నీ దగ్గరున్న కాస్తడబ్బు నాకు పంపించావు. పోగొట్టుకోకుమన్నావు. నేను ఏమి చేయాలి? నా అన్న వాళ్లు లేని ఒక అనాధని దోస్తూ జీవించనా? విపరీతమైన దిగులు, వేతనలకు లోనయ్యాను. నేను దమ్మిడీకి కొరగాని శుద్ధదద్దమ్మననుకొన్నాను. నాకన్నా చిరిగిపోయిన నా బూట్లే నయం. అందుచేత నేనేదో ఉద్ధారకుడ ననుకోవటం అవివేక మని నిర్ణయించుకొన్నాను. అంతేకాదు. నే నొక జీవ చ్ఛవాన్నని భావించాను. దానితో నాలో ఆత్మగౌరవం కాస్త అణగారిపోయింది; అదృశ్యమైంది. నా గుణగణాలు, నా ప్రయోజకత్వం, నా యోగ్యతా - అన్నీ మర్చిపోయాను. ఇదే నన్ను అధఃపతనానికి దిగజార్చింది. దీనినే బ్రహ్మరాత అంటారు. అది నీకూ తెలుసు. కాస్త అటువెళ్ళి మనస్సును హుషారెత్తింప చేద్దామని మొదట బయలుదేరాను. అటు తర్వాత ఘటనలు ఒకదాని తర్వాత మరొకటి వరుసగా సంభవించాయి; వాతావరణం బొత్తిగా బాగాలేదు. ఎటు చూసినా కటు నిరాశ. చలి పీక్కుతింటోంది. పైగా ఆ రోజున భోరున వర్షం కురుస్తోంది. దారిలో యెమెల్యాకన్పిం చాడు. అతను తన వస్తువు లన్నింటినీ, చివరకు బుట్టా తట్టా కూడా తాకట్టుపెట్టాడు. నిజం. వరెంకా. అతని ఆస్తి అంతా ఆ విధంగానే కరిగిపోయింది. రెండురోజులబట్టి అతను పస్తులు

వుంటున్నాడు. ఎవరో తాకట్టు పెట్టుకోని వస్తువులను యింకా తనవద్ద మిగిలినవాటిని, తాకట్టు పెట్టాలని అతను చూస్తు న్నాడు. నిజంచెప్పితే నమ్ముతావో లేదో కాని, వరెంకా, ఆ మానవుడిని చూసి జాలివేసి నేను త్రాగానుగాని, త్రాగా లన్న తృష్ణకొద్దీ నేను త్రాగలేదంటే నమ్ము. నా పతనం ఈ విధంగా సంభవించింది. మే మిద్దరం కలిసి, ఒకరిని చూసుకుంటూ మరొకరం కంటతడి పెట్టుకొన్నాం. నిన్ను తలుచుకొన్నాం. యెమెల్యా చాలా మంచివాడు. వెన్న వూసవంటి మనస్సు అతనిది. కరుణాశాలి. దయాపరుడు.

నేనూ అలాంటివాడి నే. అందుకే ఇలా జరిగింది. ఈ లోకంలో సున్నితమైన మనస్సు కల్గివుండటమే మహా నేరం. నేను నీ కెంతగా రుణ పడివున్నానో నాకు తెలుసు. తెలుసు ప్రియతమా తెలుసు. నీతో పరిచయమైన తర్వాతనే నేను అంటే ఏమిటో గ్రహించగలిగాను; నిన్ను ప్రేమించాను. అంతకుముందు ఈ విశాల ప్రపంచంలో నేను ఒంటరిగాణ్ణి. ఏకాకిని. నీతో పరిచయమేర్పడటానికి ముందు నేను జీవించా నని చెప్పటంకంటే నిద్రించానని చెప్పటమే ఉచితంగా వుంటుంది. ఆ రోజుల్లో యువకులు నా ఆకారాన్ని చూసి ఎద్దేవ చేసేవారు. నన్ను చూసి అసహ్యించుకొనేవారు. జీవితం మీద నాకు రోతపుట్టింది. భగవంతుడు నన్నెందుకు పుట్టిం చాడా అన్నంత బాధ కల్గింది. లోకులంతా కలిసి నన్ను మూర్ఖ శిఖామణిగా జమకట్టారు. చిత్రించారు. నిజమే కామోసు అనుకొన్నాను. కాని అదృష్ట దేవతవలె నీవు ఆకాశం నుంచి నాముందు ఊడిపడ్డప్పుడు అంధకార బంధురమైన నా

జీవితాన్ని తేజోమయం చేశావు. నా హృదయాన్ని విస్మయం కావించావు. కుంచించుకుపోయిన నా మనస్సును వికసింపచేశావు. ఎట్టకేలకు నాకు మానసిక ప్రశాంతత సిద్ధించింది. ఇతరులకన్నా నేనేమీ తీసిపోలేదన్న ఆత్మ విశ్వాసం నాలో పుంజుకొన్నది. ఆ నాజూకుతనం, ఆ పెద్ద మనిషితనం నాలో కొంతవరకు లోపించిన మాట నిజమే ననుకో. ఏది ఏమైనా నేనూ ఒక మానవుణ్ణే. నాకు హృదయమూ వుంది; మనస్సూ వుంది అనుకొన్నాను. కాని, ఇప్పుడో ? నేనొక చవట దద్దమ్మననీ, ఎందుకూ పనికిరాని వెధవననీ భావిస్తూ బాధపడుతున్నాను. నాలో ఆత్మగౌరవం నశించిపోయింది. దీనంతటికీ నే పడ్డ యాతనలే హేతువు. ఆత్మస్థయిర్యం పూర్తిగా అంతరించిపోయింది. మనస్సులో విషయాలన్నీ దాపరికం లేకుండా నీ ముందుంచాను. మళ్ళీ ఆ విషయం ప్రస్తావించకు. కనుకొలకుల్లోనుంచి కన్నీటి బిందువులు జలజల రాలుతున్నాయి. ఇదే నీకు నా కటపటి వీడికోలు. విచారభారంతో హృదయం బద్దలై పోతోంది.

గౌరవ పురస్సరంగా సెలవు.

నీ నిరంతర ఆప్త మిత్రుడు,
మకార్ దెవుష్కిన్.

సెప్టెంబరు, ౩

మకార్ అలెగ్జివిచ్,

క్రిందటి లేఖను నేనింకా పూర్తిచేయనే లేదు. లేఖ వ్రాయటం చాలా కష్టమనిపించింది. ఒక్కొక్కప్పుడు ఏకాంత జీవితం యెంతో మధురంగా వుంటుంది. విచారంతో తదేకంగా వుండిపోవటంలో అదొక రకమైన ఆనందం పొందవచ్చు ననిపిస్తుంది. ఈమధ్య యిలాంటి ఆలోచనలు తరచు నాలో బయలుదేరుతున్నాయి. గత స్మృతులను గుర్తుకు తెచ్చుకొని, వాటినిగురించే తెంపూ, తెరిపీ లేకుండా ఆలోచిస్తూ, గంటలు తరబడి గడిపేస్తుంటాను. అందులో విచిత్రమైన, అనిర్వచనీయమైన అనుభూతిని పొందుతాను. గత జీవితానికి సంబంధించిన ఏ ఘటనా, ఏ అనుభూతీ నా హృదయంలో బలంగా ముద్రితంకాలేదు. అయినప్పటికీ ఆ స్మృతులు, ముఖ్యంగా చిన్ననాటి స్మృతులు జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా, నేను సమాధి అవస్థలో పడిపోతుంటాను. బయట ప్రపంచాన్నే పూర్తిగా మరచిపోతుంటాను. ఆ సమాధి అవస్థలోనుంచి బయటకు రాగానే, చెప్పనలవికాని బాధా, విచారమూ నన్ను ఆవహిస్తాయి. దుర్బలమైపోతాను. సమాధి అవస్థవల్ల అలసిపోతాను. ఏమైతేనేం, నా ఆరోగ్యం అంతకంతకూ, అనుక్షణం క్షీణిస్తోంది.

కాని ఎందుచేతనో ఈ వేళ ఉదయం మనస్సు మహా హుషారుగా వుంది. ఈమధ్య ఇంత హాయిగా నే నెన్నడూ

గడపలేదు. సత్తువ, సంతోషమూ నాలో పెల్లుబుకుతున్నాయి. హేమంతం అరుదెంచింది. హేమంతం అంటే నా కెంతో యిష్టం. పల్లెపట్టులో వున్నప్పుడు హేమంతం రాగానే నేను కేరింతలు కొట్టుతుండేదాన్ని. అప్పటికి నేను చిన్నపిల్లని. అయినా హేమంతకాలపు సంధ్యాకాలం ఎంత ఆహ్లాదకరంగా వుండేదో ఇప్పటికీ నాకు గుర్తే. మా యింటికి అల్లంతదూరాన, కొండ వెనుక ఒక సరస్సు వుంది. ఆ దృశ్యాలన్నీ యిప్పుడు నా మనోనేత్రంలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ సరస్సు విశాలంగా, దేదీప్యమానంగా చూడ ముచ్చటగా వుండేది. ఆ సరస్సు ప్రక్కనే ఠీవిగా నిలబడి చూస్తూన్న చెట్లు మరింత అందంగా కన్పించేవి. చల్లనిగాలి వీస్తుండేది. మంచు రేణువులు పచ్చగరికను అలంకరించేవి. ఇళ్ళ కిటికీల్లో నుంచి దీప కాంతి కన్పిస్తుండేది. గొల్లలు మందలతో ఇళ్లకు తిరిగొస్తుండే వారు. అలాంటి సమయంలో నేను మా అమ్మ కన్నుగప్పి సరస్సు దగ్గరికి పారిపోతుండేదాన్ని. ఇంటినీ, వంటినీ, అంటినీ పూర్తిగా మరచి, ఆ సరస్సు ప్రక్కనే కూర్చొని, వడ్డునే జాలరులు వేస్తున్న మంటల వెలుగు నీటిపై ప్రసరిస్తూంటే, గాలి అలలకు నీటి ఉపరితలం ఓలలాడుతుంటే, నేత్రానందకరమైన ఆ దృశ్యం తిలకిస్తూ ఎంతోసేపు గడుపుతూండేదాన్ని. అక్కడ ఎంత ప్రశాంతంగా వుండేదని! పక్షుల రెక్కలధ్వని, నీటిలో చేపల కదలిక ధ్వనికూడా విన్పించేవి. నెమ్మదిగా మంచు తెరలు ఆకాశంలో నుంచి నేలమీదకు దిగుతుండేవి. దూరపు వస్తువులు ఆ మంచు తెరల మరుగున పడిపోయిన దృష్టిపథంనుంచి మటుమాయమయ్యేవి.

బాగా పొద్దుపోయిన తరువాత ఇంటికెళ్ళేదాన్ని. ఇవి నా చిన్ననాటి అనుభవాలు. ప్రకృతి సౌందర్యం పరికిస్తూ, ఏమిటో చెప్పటానికి వీలు లేని ఆనందం పొందుతుండేదాన్ని.

అవును. హేమంతాన్ని నేను అమితంగా ప్రేమించాను. నిజం. హేమంతం చాలా మంచిది. రాత్రి పొద్దుబోయేదాకా నిర్జన ప్రదేశంలో తిరుగాడుతూ హేమంతం అందచందాలను పరిశీలించాను.

హేమంతం వచ్చేసరికి రైతుల పొలం పనులు పూర్తి అవుతాయి. రైతులు గుంపులుగుంపులుగా ఏదోఒక గుడిసెలో జేరి, కబుర్లు చెప్పుకొంటూ పాటలు పాడుతూ కాలక్షేపం చేస్తుంటారు. శీతాకాలం రాకకోసం ఎదురు చూస్తుంటారు. తర్వాత క్రమేణా వాతావరణం మారిపోతుంది. శీతాకాలం వస్తుంది.

శీతాకాలంలో బయట తిరగటం బాధనిపించేది. అప్పుడు ఇంట్లో కూర్చొని, మా ముసలి ఆయా ఉల్యానా చెప్పే పేదరాసి పెద్దమ్మ కథలు వింటూంటే, ఎంతో కమ్మగా వుండేవి. ఉల్యానా కథలు చెప్పతుంటే, మధ్య ఏదో చప్పుడయ్యేది; ఎవరైనావచ్చి తలుపు తట్టుతున్నారేమో? కాదు; ముసల్ది ఫ్రొలొనోవా రాట్నం వడుకుతున్న చప్పుడది. మేమంతా విరగబడి నవ్వుకొనేవాళ్లం. రాత్రిపూట నాకు నిద్రసరిగా పట్టేదికాదు. ఏదో ఒక కలతో నిద్రాభంగం కలిగేది. తెల్లవార్లూ అలా మేలుకొని వుండేదాన్ని. అయినా మరుసటిరోజు ఉదయాన బద్ధకం అనిపించేదేకాదు. అప్పుడే వికసించిన పుష్పంలాగా తయారయ్యేదాన్ని. కిటికీల్లో గుండా

పంట పొలాలను చూస్తూంటే ఎంతో హాయిగా వుండేది. ఏదో బండి వెళ్ళుతున్న చప్పుడు విన్పించేది. ఆనందంతో గడిచి పోయిన రోజులవి. ఆ రోజులే వేరు.

ఇవన్నీ గుర్తుకొస్తే నాకు ఏడుపు వస్తోంది. తనివితీరా ఏడుస్తాను. గతమంతా తేజోమయం. వర్తమానం బాధా మయం. భవిష్యత్తు అంధకార బంధురం. ఆరి భగవంతుడా, ఈ కథను ఎలా ముగిస్తావో? నీకు తెలుసా, వచ్చే హేమంతంలో నేను తప్పకుండా చచ్చిపోతానని అనుకొంటు న్నాను. చావు తప్పదు. నా ఆరోగ్యం పూర్తిగా చెడిపో యింది. రాబోతున్న చావునుగూర్చి తరచు తలపోస్తున్నాను. ఇక్కడ చావటం నాకు యిష్టం లేదు. గత వసంతకాలంలో వలే మళ్ళీ పడకబెట్టక తప్పదేమో ననిపిస్తున్నది. అసలు అప్పటినుంచి నేను పూర్తిగా కోలుకోనేలేదు. ఇప్పుడు సుస్తీ చేసినట్టుగానే వుంది. స్వస్థత కన్పించదు. పగలంతా ఫెడోరా ఎక్కడికో వెళ్ళింది. ఒంటరిగా నే నొక్కడా న్నే ఇంట్లో కూర్చున్నాను. ఒక్కొక్కప్పుడు ఒంటరిగా వుంటే, ఎందుకోగాని నాకు విపరీతమైన భయం వేస్తుంది. గదిలో నాతోపాటు అదృశ్యవ్యక్తీ, శక్తీవున్నట్టూ, నాతో మాట్లాడు తున్నట్టూ అన్పిస్తుంది. చాలా విచిత్రం! అందుకే ఇంత దీర్ఘ మైన లేఖ వ్రాస్తున్నాను. వ్రాత కార్యక్రమంలో నిమగ్న మైతే, భయం అదృశ్యమై పోతుంది. ఈ లేఖను ఇంతటితో ముగించక తప్పదు. ఇంకా దీనిని పొడిగిద్దామన్నా, కాగితం కూడా అయిపోయింది. ఇంట్లో డబ్బు బొత్తిగా లేదు. అదీ గాక తొందర పనికూడా వుంది. ఇంటి యజమానురాలికి

నీవు కొంత డబ్బు చెల్లించావని తెలుసుకొని సంతసించాను. పోనీలే, మరికొంత కాలంపాటు ఏగొడవా లేకుండా నీవు ఇంట్లో వుండిపోవచ్చు.

సెలవు మిత్రమా, నేను చాలా బలహీనంగా వున్నాను. ఇక్కడి పుల్లతీసి అక్కడ వేస్తే అలసిపోతున్నాను. అలుపూ సొలుపూ పిలిస్తే పలుకుతున్నాయి. ఇలాంటి స్థితిలో నేనేమి పనిచేస్తాను? ఈ ఆలోచనే ఆశాలతను కాస్తా పుటుక్కున త్రెంచేస్తుంది.

వి. డి.

సెప్టెంబరు. 5

ప్రియమైన వరెంకా,

ఈవేళ నీకు తెల్పవలసిన విషయాలెన్నో వున్నాయి. మొదటి విషయం: ఇవాళ నాకు తలనొప్పి వచ్చింది. ఆ నొప్పినుంచి తప్పించుకుందామన్న ఆశకొద్దీ అటు కాలువ వైపు షికారుకు బయలుదేరాను. అప్పుడే మసక పడుతోంది. వర్షం లేదనుకో; అయినా మంచు తెరలు వాన జల్లులకన్నా దుర్భరం. ఆకాశమంతా కారుమేఘాలతో ఆవృతమైవుంది. కాలువగట్టున జనం అటు ఇటూ హడావిడిగా

పోతున్నారు. ఏ మొఖాన్ని చూసినా, ఆందోళన, మనఃక్లేశం కొట్టొచ్చినట్టుకనిపిస్తున్నాయి. నాకిదేదో విచిత్రంగాతోచింది. రైతులు తప్పత్రాగి, తూలుతూ, సోలుతూ పోతున్నారు. వాళ్ళ కాళ్ళకు చెప్పులు లేవు. ఫిన్నిష్ మహిళామణులు చక్కగా అలంకరించుకొని తయారయ్యారు. కార్మికులు, నా కోవకు చెందిన గుమస్తాలు, సైన్యంనుంచి తొలగించ బడిన సైనికుడు కన్పించారు. వీళ్ళందరికీ దొరికేసమయం ఇదే కాబోలు. కాలువ చూడటానికి అందంగానే వుంది. ఆ కాలువలో అన్ని పడవులకు చోటెట్లా దొరికిందో! వంతెనల పైన అటుఇటూ స్త్రీలు నూనెతో తయారుచేసిన పకోడీలు, కుళ్ళిపోయినపళ్ళు పెట్టుకొని అమ్ముతున్నారు. వాళ్లను చూస్తేనే పరమఅసహ్యమేసింది. షికారుకు పోవటానికి ఈ కాలువ ఏమాత్రం తగిందికాదు; అంతా కచాడీగా వుంది.

బాగా చీకటిపడింది. పెద్ద బజారులో గుండా నడుస్తు న్నాను. ఆ బజారు కిరునైపులా బహు అందమైన షాపులు పసందైన వస్తువులతో నేత్రాలకు ఆనందం గొలుపుతూ అలరారుతున్నాయి. దీపాల కాంతితో ఆ వీధి అంతా దేదీప్యంగా వెలుగుతోంది. ధనైక జీవిత విశ్వరూపం అక్కడ సాక్షాత్కరించింది. ఆ అలంకరణంతా కేవలం అందంకోసమేనా అనిపించింది. విలువైన ఆ వస్తువులను తమ పెళ్లాలకోసం ఖరీదుచేసే మహానుభావులుకూడా వున్నారన్న మాట. అది ధనవంతుల వీధి; ధనం ఆ వీధిలో సదా ప్రవహి స్తుంది. జర్మన్ వ్యాపారులంతా ఈ వీధిలోనే నివసిస్తున్నారు అంటే వాళ్లంతా కుబేరులై వుండాలి. ఆ వీధిలో చాలా

వాహనా లున్నాయి. ఆ వాహనా లన్నింటినీ ఆ వీధి ఎలా భరించగల్గుతున్నదో? ఆ వాహనాలు ఎంత ఆడంబరంగా వున్నాయని! బంగారం పొదిగి, తయారుచేశారా అన్నట్లు తళ తళ లాడుతున్నాయి. దృష్టిని కేంద్రీకరించి ఆ వాహనా లన్నింటివంక అదేపనిగా చూశాను. సన్నని తెరల మరుగున ఉన్న తరుణీమణులు ఎవరై వుంటారా అని పరీక్షగా చూశాను. బహుశా ధనిక కుటుంబాలకు చెందిన ఆ వనితా జనతా పరి వారం సందె చీకటి నృత్యాలకోసం నృత్యశాలలకు పోతున్నట్టు న్నారు. ధనిక స్త్రీలను బాగా సమీపించిచూస్తే బాగుంటుంది. ఎంతో ఆహ్లాదం చేకూరుతుంది. ఏదో అడపా తడపా వచ్చే పోయే గుర్రపు బళ్లలో తెరల మరుగునఉన్న ధనిక స్త్రీలను చూసే భాగ్యం మాత్రమే నాకు లభించింది. ఎదురు బొదురుగా నిలబడి ఆ మగువల ముఖారవిందాన్ని, దేహాలంకరణను, అంగ ప్రదర్శనాన్ని తిలకించే మహద్భాగ్యం నాకు ఇంకా అబ్బలేదు. అప్పుడు నీవు నాకు గుర్తుకొచ్చావు, ఓ ప్రియ తమా, నిన్నూ, నీ పేదరికాన్నీ తలుచుకొని నేను బాధ పడ్డాను. నరెంకా, నీ వెందుకింత విచారంగా వున్నట్టు? నా అందాల మాలికా, చిన్నారి నయ్యారీ, ఇతరులకన్నా, నీ వేవిధంగానూ తీసిపోవు. నీలో కరుణ, అందం, చదువు అన్నీ వున్నాయి. అయినా నీ జీవితం ఇలా దుఃఖభాజనం కావటానికి కారణ మేమిటి? మంచివాళ్ళకు ఇవి రోజులు కావా? కలిమితో కొందరు కులుకుతుంటే, లేమితో ఎందరో కుందగనేల? ఇలాంటి ఆలోచనలు మంచివి కాదన్న సంగతి నాకూ తెలుసు. స్వేచ్ఛాభావనకు

ఇలాంటి యోచనలు విఘాతం కల్గిస్తాయి. ఏది ఏమైనా కొందరు ఆగర్భ శ్రీమంతులుగాను, ఎందరో గర్భ దరిద్రులుగాను జన్మిస్తున్నారు; అదృష్ట దేవత కొందరినే వరించనేల? ఇదేమి న్యాయం? ఇదేమి ధర్మం? దరిద్రుడుగా పుట్టినవాడు దరిద్రుడుగా కడతేరవలసిందేనా? కట్టుకథలలో వలె, అదృష్ట దేవత ప్రమాదవశాత్తున పిచ్చిపుల్లాయిలను వరించిన ఉదంతాలు ఉంటే ఉండవచ్చు. అదృష్ట వశాత్తున వచ్చిపడే అదృష్టం! కొందరి తాతముత్తాతలు సంపాదించి పెట్టిన ఆస్తిపాస్తులకే ముదనష్టాలుకూడా జతవుతాయి. కొందరు తేనెలు జుర్రుతుంటే, మరికొందరు తిండిలేక, కండలేక, ఎండిపోయిన తమ పెదిమలు చప్పరించుకొంటూ జీవిస్తారు. అది వారి అదృష్టం! ఇది వీరి కర్మ. ఇంతేలే పేదల గుండెలు, ఇంతేలే పేదల బ్రతుకులు, పేదలు పుట్టిందీ ఇందుకే, బ్రతుకుతున్నదీ ఇందుకే. ఇలా ఆలోచించటం మహాపాపమే కావచ్చు. అయినా ఈ ఆలోచనలు వద్దన్నా, కద్దన్నా హృదయాంతరాళంలోనుంచి బయలుదేరుతూనే వున్నాయి. శ్రీమంత కుటుంబాలలో పుట్టిన పడతివలె నీవూ అందాలు అలంకరించుకొని, విందులతో, వినోదాలతో ఎందుకు కాలక్షేపం చేయలేక పోతున్నావు? నాబోటి బికారి పకీరుతో కాకుండా, మరొక శ్రీమంతునిబిడ్డ సరసన కూర్చొని, సరససల్లాపాలు సాగించేందుకు నీవెందుకు నోచుకోలేక పోతున్నావు? ఆ స్థితికి నీవు చేరగల్గితే, చింపిరిగుడ్డలు కప్పుకొన్న నీ శరీరంపై వెండిబంగారాలు తొడిగితే నీవు ఇంత సన్నగా, సున్నితంగా, బక్క-సల్చగా వుంటావా: అసంభవం! రబ్బరు

బొమ్మలాగా, ముద్దుమురిపాలు చిలికిస్తూ, దబ్బపండువలె తయారవుతావు. నీ ఛాయను కాంచటంకోసం నీవెక్కి ప్రయాణంచేసే బండి వెండితెరల సందుల్లోనుంచి ఏ గొందుల్లోనో నిలబడి నేను చూడవలసివస్తుంది. ఆనంద లోకంలో, అందాల వీధుల్లో, స్వర్గధామంలో తూలిపోయే, సోలిపోయే నిన్నుచూస్తే, ఆహా ఎంత మహదానందంగా వుంటుందో చెప్పు, ప్రియతమా, నా ప్రేమ పతంగమా! కాని మనం ఈనాడు జీవిస్తున్న లోకం మాటేమిటి? ఊహాజగత్తునుంచి వాస్తవిక జగత్తులో పడితే మనకు కన్పిస్తున్న దేమిటి? బాధలు, వ్యధలు, యాతనలు; కిరాతకుల చేతుల్లో చెరలు. అసలే గాయపడిన హృదయం; దానికితోడు గాయంపై కారంచల్లే నీచులు తయారు. మనకు మనశ్శాంతి లేదు. మిగిలిందల్లా మనఃక్లేశాలే. ఒక వెధవ నీకేదో ఖరీదైన చీరెకొని పెట్టగల్గిన స్థితిలో వున్నంతమాత్రాన, వాడొచ్చి యిష్టమొచ్చినట్లు పేలుతుంటే చూస్తూ ఊరుకోటమేనా? అలా పేలే అధికారం వాడి కెవ్వడిచ్చాడు? అయినా అధికారం ఒకళ్లిచ్చేదికాదు; స్వయంగా పుచ్చుకొనేది! వాళ్లు ఆడింది ఆట; పాడిందిపాట. మనం కాదనటానికి వీల్లేదు. ఎందుకంటే మనం దౌర్భాగ్యులం; నిర్భాగ్యులం. అండదండలు లేవు. ఒక అనాథ యువతిపై అత్యాచారంచేసే వాడు అసలు మనిషేనా? వాడు మనిషికాదు; పశువు. మానవాకారంలో వున్న మృగం. ఇది సత్యం ఎవరూ కాదనలేని నగ్నసత్యం. ఇలాంటి వాడికన్నా వీధుల్లో బరువులు మోస్తూ జీవించే కూలీనయం. వాడు చెమటోడ్చి సంపాదించుకొని జీవిస్తు

న్నాడు. ధనవంతుల సరుకులుమోస్తూ జీవిస్తున్నాడు అతను. "నా గతింతేలే. మీరు మాత్రం విలాసాలతో జీవించండి. మీ బరువులుమోస్తూ నేను తనువుచాలిస్తా" అనుకొంటాడు. ఇలా కష్టపడి జీవిస్తున్న శ్రమజీవులు ఈ ధరాతలంపై అసంఖ్యాకంగా ఉన్నారు సఖీ. ఆ కోవకు చెందినవాణ్ణే నేనూ. శక్తికొలదీ కష్టించి పనిచేస్తూ జీవిస్తున్నాను. అంత కన్నా నేనింకా ఏమిచేయగలను చెప్పు?

ఎందుచేతనో ఈ వేళ నాలో ఎన్నో ఆలోచనలు రేగుతున్నాయి. ఇంతకు ముందెన్నడూ లేనంతగా నేనివ్వాళ నా పేదరికాన్ని తలుచుకొని బాధపడుతున్నాను. పెద్దబజారులో హార్మోనియంపెట్టె పట్టుకొని, పాటపాడుతూ అడుక్కొంటున్న వ్యక్తిని చూశాను. అతను పగలల్లా పరుల మనసులను ఉల్లాసపర్చేందుకు ఊపిరితిత్తులు పగిలిపోయేటట్లు పాడుతూ, భిక్షాటన చేస్తాడు. అతన్ని గురించి తలపోస్తున్నకొలదీ పరిపరి విధాలైన ఆలోచనలు నాలో చెలరేగుతున్నాయి. అతని పాటవింటూ నేను అలా కొంతసేపు, నిలబడిపోయాను. నా ప్రక్కనే ఒక యౌవ్వని నిలబడి వుంది. మరొకప్రక్కన ఆలనాపాలనా లేక గాలికి పెరుగుతున్న మరొక పిల్ల నోట్లో వేలేసుకొని పాటవింటూ నిలబడింది. ఆ భిక్షుకుడు ఎవరో ఒక మహానుభావుని కిటికీ నీడన నిలబడి పాట పాడుతున్నాడు. పదేళ్లకుర్రాడు కడు ఆసక్తితో పాట ఆలకిస్తున్నాడు. ఆ కుర్రాడి అందచందాలకు లోటులేదు. అయితే సరియైన పోషణలేక బాగా చిక్కి, శల్యావశిష్టంగా వున్నాడు. మొలకు లాగుకూడా లేదు. చలిలో గడగడ వణికిపోతూ, గుడ్లప్పగిచ్చి

ఆలకిస్తూ చిరిగిపోయిన చొక్కా అంచును నములుతూ నిల్చున్నాడు.

ఆ కుర్రాడు నన్ను చూశాడు. పాట వినటంమానేసి గబగబా పరుగెత్తుకుంటూ నావద్ద కొచ్చి ఏదో కాగితం నా చేతి కిచ్చాడు. తీరా మడతవిప్పి చదివితిని గదా, అది విజ్ఞప్తి పత్రం: అనాథ బాలుడనీ, ఆర్థికసహాయం చేయాలనీ, ఎవరో వ్రాసిపెట్టిన మహాజరు పత్రం. ఆ కుర్రాడి మొఖం చూస్తేనే ఆ విషాదగాథంతా అవగతమైపోతుంది. ఈ పత్రం ప్రత్యేకించి చదవవలసిన అగత్యం లేదు. అయినా ఆ కుర్రాడికి యివ్వటానికి నా జేబులో ఏమైనా వుంటేగా? చివరకు చిల్లి కానీకూడా లేదు. చాలా విచారమేసింది. పాపం, ముక్కుపచ్చలారని బాలుడు; అనాథ; ఆకలితో బాధపడుతున్న జీవి. అతను అబద్ధమాడుతున్నాడనుకోవలసిన పనిలేదు. అసలు అతనికి అబద్ధమాడటం చేతకాదు. అదంతా నాకు తెలుసు. కాని, కొందరు మహాతల్లులుంటారు. వాళ్ళు తమబిడ్డలను ఇలా భిక్షాటనకు పంపిస్తారు. వంటినిండా మస్తులేనా లేకుండా, చలిలోకి పసికందులను తోలేస్తారు. బహుశా ఈ కుర్రాడి తల్లికూడా ఆ బాపతుకు చెందినదే కావచ్చు. బ్రతుకు తెరువుకు ఇతర దారులులేక ఈ మార్గం చేపట్టి వుండవచ్చు. లేదా, ఆమె నిజంగానే జబ్బుపడి వుండవచ్చు. అయితే మాత్రం, ఈ పద్ధతి చేపట్టటం బొత్తిగా బాగా లేదు. ఇంత చిన్నవయస్సులో వున్న కుర్రాడిని భిక్షాటనకు పంపించటమా? ధర్మం కోసం యాచించేవారిని కసురుకొనే ప్రబుద్ధులు ఈ లోకంలో ఎంత

మంది లేరు కనుక; "ఛో! వెధవా, నీ దొంగవేషాలు నా దగ్గరా సాగేది" అంటూ తిట్టుతారు. ఈ తిట్లు, ఈ యాచన పాట్లు, ఈ అగచాట్లు ఆ కుర్రాడి మనస్సును గాయపరుస్తాయి. ఆ గాయం ఎన్నటికీ మానదు. అతనికి ఏదో ఒక జబ్బు లంకించుకుంటుంది. ఆదుకొనే నాథులు లేక, అతను నీరసించి కృశించి, చిట్టచివరకు కన్నుమూస్తాడు. అతని బ్రతుకుకు అదే ఆఖరు. కొందరి బ్రతుకులు ఇంతే, నరెంకా. "దేవుని పేరిట యాచిస్తున్నా, కష్టాలలో వున్న నాకు సాయం చేయండి" అంటూ ప్రార్థించే భిక్షగాళ్లు వుంటారు. "దేవుడే సాయం చేస్తాడులే" అనే సమాధానాలు వినిపిస్తాయి. నారు పోసిన వాడు నీరుపోయక పోతాడా అని వేదాంతం వల్లిస్తారు. అడుక్కొనే వాళ్ళను చూస్తే కొందరికి మహా మంట. శివా లెత్తినట్లుంటుంది. అన్నార్తుల ఆక్రందనాలు హంసతూలికా తల్పాలపై పవళించిన ప్రబుద్ధుల చెవులుసోకేదెప్పుడో గదా?

ప్రియసఖీ, నిజం చెప్పాల్సివస్తే, నా హృదయ భారాన్ని తగ్గించుకొనేందుకే యిదంతా వ్రాస్తున్నాను. అదీ కాక, నా శైలి ఎంతగొప్పదో నీకు నిరూపించటానికి కూడా ఈ లేఖ వ్రాస్తున్నాను, నీవే చూస్తున్నావుగా ఈమధ్య నా శైలి నిర్దిష్టరూపం ధరిస్తోంది. నా ఆలోచనలను సానుభూతితో చూడగల్గిన స్తోమతకూడా నాకిప్పుడు లేదు. అంతగా దిగజారి పోయాను. సానుభూతివల్ల సాధించే ప్రయోజనం లేనిమాట నిజమేననుకో. అయినా తనను తాను సానుభూతితో చూసు కోవాలి కదా? కొందరిలో నమ్రత మెండు, అలాంటివారు తమ శక్తిసామర్థ్యాలను చాలా తక్కువగా అంచనా వేసు

కొంటారు. కనీసం పైకి అలా కన్పిస్తారు. సరిగా నాస్థితీ అదే. అడుక్కొనే ఆ కుర్రాడి స్థితికన్నా హీనమైన దీనావస్థలో నేనూ ఉన్నాను. క్షమించు, వరేంకా. ఇలా వ్రాస్తున్నందుకు కోపగించకు. రోజూ ఉదయానే ఆఫీసు కెళ్లుతూ, ఈ నగరాన్ని, వీథులనూ, ఆకాశంలో కమ్మిన పొగలను, మహా జనాన్ని చూస్తూంటే, నాకు అనిపిస్తుంటుంది: ఈ మహా సముద్రంలో నేనొక నీటి బిందువుని. అంతేగా. కాని నిజానికి అంతేనా? సరేగాని, ఆకాశాన్నంటే మహా భవనాలలో, నాలుగు గోడలమధ్య శయ్యాగారాలలో జరిగే చిత్ర విచిత్రాలు గురించి నీకేమైనా తెలుసా? అది ఒక లోకం. మురికి కూపాలను మరపించే అద్దెకొంపలలో నివసించే జనం మరొకరకం. అద్దెకొంపలలో జీవించే కష్టజీవులు కనే కలలు యెలాంటివో తెలుసా? రేపు ఎలా గడుస్తుంది? అదే అతను కనే కలలకు మూలం. ఆకలిగొన్న భార్య, మంచాన తీసుకొంటున్న బిడ్డ, అప్పులవాళ్ళ బాధ–ఇవీ అతనికి కలలోకూడా కన్పించే దృశ్యాలు. ఎంతటి వ్యత్యాసాలు. ఒకే నగరంలో రెండు నగరాలు. స్వర్గమూ, నరకమూ. ఒకదాని సరసనే మరొకటి వున్నాయి. రాత్రిపూట ధనికులు కలలు కంటారు. పేదలు కలలు కంటారు. అయితే ధనికుల కలలు మధుర స్వప్నాలు. పేదలకలలు పాడుకలలు. అంతే తేడా. ఉన్నవాడి స్వార్థం సామర్థ్యానికి తార్కాణం; లేనివాడి స్వార్థం కడుపు ఆరాటానికి సాదృశ్యం. ఒకేదానికి రెండు కొలబద్దలు. చివరికి ఒకమాట; ఇదంతా ఏదో పుస్తకంలోనుంచి సంగ్రహించి వ్రాశానని అనుకొనేవు. ఇదంతా కేవలం నాసొంతం.

ఇతరుల సొమ్మును దొంగిలించేవాడినికాదు. పరుల సొమ్మునే దొంగిలించని నేను పరుల భావాలను సంగ్రహిస్తానా ?

విచారభరిత హృదయంతో యింటికి చేరాను. స్టావ్ వెలిగించి, టీనీళ్ళు పెట్టాను. ఇంతలోకి గోర్షికోవ్ అకస్మాత్తుగా ప్రత్యక్షమయ్యాడు. పాపం, వట్టి అభాగ్యుడు. ఈ వేళ ఉదయం భయపడుతూ, బిడియపడుతూ, నన్నూ, ఆ కొంపలో అద్దెకున్న ఇతరులనూ కలుసుకోనేందుకు ప్రయత్నించాడు. ఈ సందర్భంలోనే ఒకమాట. నా జీవితంకన్నా అతని బ్రతుకు మరింత దుర్భరంగా వుందని చెప్పకతప్పదు. దుర్భరం కాకఏమిటి చెప్పు? భార్య, పిల్లలు, అంతాజీవించటంఎలామరి? నేనే గోర్షికోవ్ స్థితిలోవుంటే ఏమి చేసేవాడినో నాకే తెలియదు. గోర్షికోవ్ నా గదిలో ప్రత్యక్షమయ్యాడు. యధాప్రకారం కళ్ళంటనీరు చిమ్ముస్తూ, నేల చూపులు చూస్తూ, నోరు విప్పకుండా వచ్చినవాడు వచ్చినట్టే నిలబడిపోయాడు. నా గదిలో విరిగిపోయిన కుర్చీ తప్ప మరొకటి లేనందున, దానినే చూపించి, కూర్చోమని చెప్పాను. త్రాగమని అర కప్పు టీ యిచ్చాను. మొదట్లో చాలసేపు నిరాకరించాడు. చివరకు ఎలాగైతేనేమి టీ సేవించాడు. టీ చాలా బాగుందని మెచ్చుకొన్నాడు. ఆహా! దారిద్ర్యం అన్నది వ్యక్తులను ఎంత వినమ్రులుగా మారుస్తుంది ! "సరేగాని, మిత్రమా, కుటుంబం ఎలా గడుస్తోంది" అంటూ కుశల ప్రశ్నలు ప్రారంభించాను. "నీకు పుణ్యం వుంటుంది; ఏదో కష్టాలలోవున్న నిర్భాగ్య కుటుంబాన్ని కాపాడావన్న పేరుంటుంది; మకార్ అలెక్జెవిచ్. నాకు సహాయం చేద్దూ. మా యింటావిడ, పిల్లలు,

అంతా నీకు తెలుసుగా, తినటానికి తిండి లేదు. త్రాగటానికి చివరకు గంజికూడా లేదు. మలమలమాడిపోతూన్నారు. తండ్రినైన నేనేమో ఏమీ చేయలేని కడు నిస్సహాయ స్థితిలో వున్నాను" అంటూ ప్రాధేయ పూర్వకంగా చెప్పుకుపోతున్నాడు. మధ్యలో అడ్డంకొట్టి, నేనేదో చెప్పబోయాను. నా మాట విన్పించుకోకుండా, మళ్ళీ మొదలెట్టాడు : "ఈ ఇంట్లో అద్దెకున్న వాళ్ళను చూస్తే నాకు మహాభయం, మకార్ అలెగ్జెవిచ్. భయమంటే భయంకాదనుకో బిడియం. అసలు వాళ్ళతో నా బాధ చెప్పుకోటానికి సాహసించలేను. సిగ్గుపడతాను. వాళ్ళంతా పరాయివాళ్లుగా ప్రవర్తిస్తారు. నన్ను ముట్టుకు నా మాలకాకి అన్నట్టు వ్యవహరిస్తారు. అసలు దగ్గరికే రానివ్వరు. పోతే మిగిలిన మిత్రుడివీ, శ్రేయోభిలాషివీ నీవే. నిన్ను యిబ్బంది పెట్టాలని నేను కలలోకూడా తలచలేదు. నీవూ యిబ్బందుల్లో వున్నావన్న సంగతి నాకు తెలుసు. అంతగా సహాయం చేయగల్గినస్థితిలో లేవన్న విషయం నేను గుర్తించకపోలేదు. కాని ఏంచేస్తాను! నోరువిప్పి అడగక తప్పలేదు. నీవద్ద ఏమైనా డబ్బుంటే సర్దు. అప్పుగా యివ్వు. ఇలా అడుగుతున్నందుకు వేరే అనుకోకు. గత్యంతరం లేకపోబట్టి నీదగ్గరికి వచ్చాను. నీ మనస్సు వెన్నపూసవంటిదని నేను ఎరుగుదును. ఎదుటివాడి కష్టాలుచూసి, నీగుండె ద్రవించిపోతుంది. నావలెనే నీవూ కష్టాలలో వున్నమాట నిజమేననుకో. అయినా విపత్తులోవున్న నన్ను నీవు ఆదుకోక తప్పదు. మరొక దిక్కులేదు." ఇలా అడుగుతున్నందుకు ఒకటికి పదిసార్లు క్షమాపణలు చెప్పుతూనే డబ్బివ్వమంటూ

కూర్చున్నాడు. నిజానికి అతనికి సహాయం చేయటంకన్నా నాకు సంతోషదాయకమైన సంగతి మరేముంది? కాని చేతిలో ,చిల్లిగవ్వకూడా లేదు. నిజం. రాగికాని ఉంటే నట్టు. "మకార్ అలెగ్జవిచ్, మిత్రమా, నిన్ను అంత పెద్ద మొత్తం అడగదల్చుకోలేదు" అంటూ మళ్ళీ ప్రార్థన మొదలెట్టాడు. అసలు విషయం ఏమిటంటే: (అని కొంచెంసేపు ఆగిపోయాడు. ముఖం కందగడ్డలా ఎర్రబారింది) నా భార్య, పిల్లలు, నీకు తెలుసుగా, ఆకలితో అలమటించి పోతున్నారు. పది కోపెక్ లుంటే సర్దు. నీకు పుణ్యం వుంటుంది" ఇది దుస్సహంగా పరిణమించింది. నిజమే అతను నాకన్న మరింతకష్టదశలో వున్నాడు. అతని స్థితికన్నా నా పరిస్థితే కాస్త మెరుగు. అబద్ధం ఎందుకుచెప్పాలి కాని నావద్ద అతను అడిగిన మొత్తానికి రెట్టింపు ఉన్నమాట నిజం. ఇందులో సగం అతనికిచ్చేస్తే, రేపు నా గతేమికాను చెప్పు? "లేదు. వీల్లేదు" అని ఖండితంగా చెప్పేశాను. ఎందుకు సర్దలేకపోతున్నానో విడమర్చి చెప్పాను. "కాని మకార్ అలెగ్జవిచ్, నీవు నన్ను ఏమన్నా అను; ఏమన్నా చేయి కాని, పది కోపెక్ లుమాత్రం యివ్వు. యివ్వక తప్పదు." నిజంగానే తప్పలేదు. పర్సు తీసి, నా దగ్గరవున్న మొత్తమంతా ఇచ్చేశాను. అది ఏమంత పెద్ద మొత్తం కాదనుకో. అయినా అదీ ధర్మమేగా? కాదంటావా, వరేంకా? ఎంతటి కటికి దారిద్ర్యం? తర్వాత మేమిద్దరం చాలాసేపు ఎన్నో విషయాలు ముచ్చటించుకొన్నాం. ఇంతటి నికృష్ట దారిద్ర్యం అనుభవిస్తూ, అంత అద్దె ఎలా చెల్లిస్తున్నావయ్యా అని అడిగాను. ఆర్నెల్ల క్రిందట ఈ ఇంట్లో

అద్దెకు వచ్చినట్టూ, మూడు నెలల అద్దె అడ్వాన్సుగా ఇచ్చి నట్టూ అటు తర్వాత తనపరిస్థితులు మరింత విషమించటమూ అన్నీ పూసగుచ్చినట్లు చెప్పుకొచ్చాడు. ఎవడో ఒక వ్యాపారి మోసంజేసి, ప్రభుత్వ సొమ్ము అపహరిస్తే ఆ నేరం కాస్త ప్రభుత్వశాఖలో గుమాస్తాగా పనిచేస్తున్న గోర్షికోవ్ పైకి వచ్చిపడింది. ఈ కేసు కొన్ని యేళ్ళతరబడి న్యాయస్థానాలలో నానుతోంది. "అమ్మతోడు; నేను ఎట్టి పాపము ఎరుగను. నేను నిరపరాధిని. మోసము చేయలేదు; దొంగతనం చేయలేదు." అంటూ గోర్షికోవ్ నెత్తీనోరూ కొట్టుకొన్నాడు. అయితేనేం జరగవలసినదంతా జరిగిపోయింది. అతను అపకీర్తిపాలయ్యాడు. 'దొంగ' 'మోసగాడు' అంటూ నలుగురూ అతనిని వేలెత్తి చూపసాగారు. మొత్తంమీద ఆ వ్యాపారి తిమ్మిని బొమ్మి, బొమ్మిని తిమ్మిజేసి గోర్షికోవ్‌ను సర్వనాశనం చేశాడు; తాను మాత్రం తప్పించుకొన్నాడు. పెద్దమనిషిలాగా చలామణీ అవుతున్నాడు. గోర్షికోవ్ స్థితిని చూసి నేను జాలి చెందుతున్నాను. అతని స్థితి చూస్తూంటే ఎంతో బాధకలుగుతోంది. ఉద్యోగమూ లేదు; అతను సంపాదించుకొన్న పేరువల్ల, అతనికి ఎవరూ ఇక ఉద్యోగం యివ్వరు. అంతవరకు ఖాయం. ఇంట్లో వస్తువులన్నింటినీ తెగనమ్మేశాడు. తినటానికి తిండిలేక పోయినా, సంతుకు లోటులేదన్నట్లు, మళ్ళీ అతనికి బిడ్డలు కల్గారు. పురుడన్న తర్వాత ఎంతో కొంత డబ్బు ఖర్చు తప్పదుగా. పైగా బిడ్డకు జబ్బుచేస్తే మందులకు డబ్బుకావాలి. కష్టకాలంలోనే కలగాలా సంతానంకూడా? అతని భార్య రోగిష్ఠి. అతని ఆరోగ్యమూ అంతంతమాత్రమే. మొత్తంమీద

ఒక్క మాటలో, చెప్పాలంటే, నరకయాతనలు అనుభవించాడు. ఇన్ని కష్టాలు అనుభవించాకకూడా అతనిలో ఆశ ఇంకా చావనేలేదు. ఉజ్వల భవిష్యత్తు ఉరకలు పెట్టుకుంటూ తనవైపు పరుగెత్తుకొస్తున్నట్టు అతను ఇంకా కలలు కంటూనే వున్నాడు. ఆ కలలే అతని బ్రతుక్కి ఆధారం. చూశావా, వరెంకా, అతని దీనావస్థ? శాయశక్తులా అతనిని ఓదార్చటానికి ప్రయత్నించాను. నేను చేయగల్గింది చేశాను. నాకదే సంతృప్తి. సరే వరెంకా, మరి ఇక సెలవు తీసుకోనా? అన్నట్టు నీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకో. దేవుడు సదా నిన్ను ఆదుకొంటూ వుండుగాక! ప్రియతమా వరెంకా! నిన్ను తలిస్తే చాలు, మండిపోతున్న నా గుండె చన్నీటి జల్లుల్లో జలకమాడి నట్టుంటుంది. నేను పడుతున్న బాధంతా నీ కోసమే. నీవు లేనిది నేను లేను.

నీ ఆప్త మిత్రుడు
మకార్ దెవూష్కిన్

సెప్టెంబరు, 9

వర్వారా అలెక్సెయెవనా! నా ప్రియతమా,

నిజం. నామతి గతులుతప్పింది. అతి భయానకమైన ఘటన జరిగింది. నాతల తిరిగిపోతోంది. అసలు ఈ భూగో

ళమే తలక్రిందులై పోతున్నట్టనిపిస్తోంది; నేను చెప్పబోతున్నది దేనినిగురించో నీవు చస్తే ఊహించలేవు. అలాంటి ఘటన జరుగుతుందని మనం కలలోకూడా అనుకోలేదు. కాని జరిగింది. ఇలా జరుగుతుందని నేను ముందే పసికట్టాను. ఏదో ఒకరోజున ఇలాంటి ఘటన జరగక తప్పదని ముందే నా అంతరాత్మ ఘోషించింది.

అనుకొన్నంతపని జరిగింది. చేతకాని నా రాతలోనే, నా కలం ఎలా నడిస్తే అలా, జరిగినదంతా సవివరంగా చిత్రిస్తాను. యథాప్రకారం ఈవేళ ఉదయాన ఆఫీసు కెళ్లాను. నా యథాస్థానాన్ని అధిష్టించాను రాత కార్యక్రమం మొదలెట్టాను. ప్రియతమా, ఈ సందర్భంలో నీ కొక విషయం చెప్పాల్సి వుంది. నిన్న తిమోఫీ ఇవనొవిచ్ స్వయంగా నా దగ్గర కొచ్చి "ఇదిగో, సాధ్యమైనంత త్వరలో సాధ్యమైనంత చక్కని దస్తూరీతో ఈ కాగితం కాపీ తీసిపెట్టు. దానిపై హిజ్ ఎక్సలెన్సీ ఈవేళే సంతకం చేయవలసి వుంది." అన్నాడు. నిజంచెప్పొద్దూ, నిన్న నా మనస్సు బొత్తిగా బాగా లేదు. మనస్సులో దిగులు దిగులుగా వుంది. ఆ దిగులంతా నా ఆరాధ్యదేవతవైన నిన్నుగురించేసుమా. సరే, ఇవనొవిచ్ చెప్పినట్టు జాగుచేయకుండా ఆ కాగితం కాపీ వ్రాశాను. కాని నా కర్మ కాలింది; బ్రహ్మరాత అలాగుంది కాబోలు. కాపీచేయటంలో పొరపాటున ఒక పంక్తి ఎగిరిపోయింది. ఆ పంక్తి పోవటంతో అసలు భావమే తలక్రిందులైపోయిందట. ఒక పంక్తి పోయినంతమాత్రాన అసలు భావం ఎలా తలక్రిందులైపోతుందో ఆ భగవంతునికే

తెలియాలి; అసలు భావం అన్నది వుండిపడి స్తే సుమా. నిన్న ఆఫీసు టైమ్ అయిపోయిందికాబోలు దానిపై హిజ్ ఎక్సలెన్సీ సంతకం పడలేదు. ఆ కాగితంపై ఆయన ఇవాళ సంతకం చేశాడు. మామూలుగానే ఇవాళా ఆఫీసుకెళ్ళి, నాసీటులో నేను కూర్చున్నాను. యెమెల్యాన్ ఇవనొవిచ్ ప్రక్కనే నా సీటువుంది. ఈ సందర్భంలోనే నీకొకవిషయం తప్పక చెప్పాలి. ప్రియతమా, ఎందుచేతనోగాని కొంతకాలంగా ఆఫీసులో నేను తలెత్తుకొని ధీమాగా తిరగలేకపోతున్నాను. తప్పు చేసినవాడిలాగా, సిగ్గుపడుతూ, బిడియపడుతూ తల వంచుకొని, నాపని నేను చూసుకొంటున్నాను. కుర్చీ కదిలిన చప్పుడైతే చాలు, నాగుండెలు దడదడ కొట్టుకొంటున్నాయి. ఇవాళకూడా తాబేలువలె తలను కుంచింపచేసుకొని, నిర్జీవ ప్రతిమలా కుర్చీలో కూర్చున్నాను. (శూలాల్లాంటి వ్యంగ్యోక్తులు విసరటంలో ప్రపంచంలోకల్లా మొనగాడైన) యెఫిమ్ అకిమొవిచ్ అందరికీ వినపడేటట్టు బిగ్గరగా అన్నాడు: "ఏమోయ్ మకార్ అలెక్జివిచ్, ఏమిటి ఇంకా ఆ కుర్చీలో కూర్చున్నావే?" అంటూ హేళన ప్రారంభించాడు. ఆఫీసులో వాళ్ళంతా విరగబడి నవ్వారు. నేను కళ్ళూ చెవులూ మూసుకున్నాను. అసలు ఆ గొడవే పట్టించుకోనట్లు నటించాను. ఇదే వాళ్ళకు సరియైన మందు అనుకొన్నాను. ఇంతలోకి అల్లంత దూరాన ఏదో సంచలనం ప్రారంభమైంది. ఎవరో నన్ను పిలుస్తున్నారు. నేను నమ్మలేకపోయాను. నన్నే, నా పేరుపెట్టి కేకేస్తున్నారు. నా గుండె ఆగిపోయినంత పనయింది. అంతగా ఎందుకు భయపడ్డానో నాకు తెలియదు.

నా జీవితంలో ఇంతకుముం దెన్నడూ అంతగా భయపడి ఎరుగను. నేను కుర్చీలోనుంచి కదలలేదు. ఆసలు పిల్చేది నన్ను కాదులే అన్నట్టు కుర్చీకి అంటిపెట్టుకొని కూర్చున్నాను. "దెవ్రూష్కిన్, దెవ్రూష్కిన్ ! దెవ్రూష్కిన్ ఎక్కడ ?" అంటూ కేక విన్పించింది. తలెత్తిచూశాను. యెఫిమ్ ఇవనొవిచ్ నన్ను ఉద్దేశించి చెప్పాడు: "మకార్ అలెక్జెవిచ్, హిజ్ ఎక్సెలెన్సీ నిన్ను పిలుస్తున్నాడు. ఆ డాక్యుమెంటును నీవు కరాబుచేశావట" అంతే. అంతకుమించి అతను ఒకముక్క చెప్పలేదు. అయినా అది చాలదా? నా వొళ్ళంతా చల్లబడి పోయింది. స్పృహతప్పినంత పనయింది. నేను కుర్చీలోనుంచి ఎలా లేచానో, ఎలా నడిచివెళ్ళానో నాకే తెలియదు. ఆ క్షణంలో నేను ఏమి ఆలోచించానో కూడా చెప్పలేను. ఒక గదితర్వాత మరొక గదిని దాటుకుంటూ వెళ్ళానన్నంతవరకే గుర్తుంది. చిట్టచివరకు హిజ్ఎక్సెలెన్సీ గదిలో ప్రవేశించాను. హిజ్ ఎక్సెలెన్సీముందు హాజరయ్యాను. హిజ్ ఎక్సెలెన్సీతో పాటు ఇతరులుకూడా ఆ గదిలో వున్నారు. అక్కడున్నవా రందరికీ వందనాలు పెట్టాలన్న సంగతికూడా మర్చిపోయాను. నా కాళ్ళు వణికిపోతున్నాయి. పెదిమలు అదురుతున్నాయి. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. దీనికి తగిన కారణం వుంది, ప్రియతమా. నాకు కుడివైపున గోడకు వేలాడగట్టిన అద్దం ఒకటి వుంది. ఆ అద్దంలో నా కంటికి కన్పించిన దృశ్యం ఎవరినైనా పిచ్చివానిగా మార్చివేస్తుంది. అందులో సందేహంలేదు. ఇది మొదటి కారణం. పోతే రెండవ కారణం: అసలు నేను హిజ్ ఎక్సెలెన్సీ కంటపడకుండా

ఇంతకాలంగా తప్పించుకు తిరుగుతున్నానాయె. అయినప్పుడు ఆయన సమక్షాన హాజరు కావటం అంటే మాటలా, చెప్పు? దెవూష్కిన్ అనే నామధేయుడు ఒకడు ఈ మంత్రిత్వశాఖలో పనిచేస్తున్నాడని ఎవరైనా చెప్పగా హిజ్ ఎక్సెలెన్సీ విని వుంటే వుండవచ్చు, అంతేగాని, ఆయన ఎన్నడూ నన్ను చూసి వుండలేదు.

"దీని అర్థం ఏమిటి? చెప్పు" అంటూ హిజ్ ఎక్సెలెన్సీ హుంకరించాడు. "కాస్త వళ్ళు దగ్గరెట్టుకొని వ్రాయవద్దా? ఇదేమో చాలా అత్యవసరమైన డాక్యుమెంటు. దానినికాస్తా నీవు ఇలా పాడుచేశావు" అంటూ గద్దించాడు. తరువాత హిజ్ ఎక్సెలెన్సీ యెకొస్తఫీ ఇవనొవిచ్ వైపు తిరిగి ఏదో అన్నాడు. ఆయన మాటలు నాకు పూర్తిగా విన్పించలేదు. కొన్ని మాటలు మాత్రమే నా చెవిని పడ్డాయి. "ఎంత అశ్రద్ధ... చేసిన పనే మళ్ళీ చేయాలి...లేనిపోని శ్రమ..." క్షమాపణ వేడుకొందామని పలుమార్లు నోరు విప్పాను. కాని గొంతులోనుంచి మాట పెగిలితే వట్టు. అక్కడనుంచి పారిపోదామా అనిపించింది. కాని దానికీ సాహసించలేక పోయాను. ఇంతలోకి జరగవలసినదంతా జరిగింది. జరిగిన సంగతులు రాయాలంటేనే సిగ్గేస్తోంది. భరింపరాని అవమానం. సగం తెలిపోయిన కోటుగుండీ దారం కాస్తా పూర్తిగా తెగిపోయి, ఆ గుండీ క్రిందపడి, చెంగుచెంగున గంతులేస్తూ, గెంతుకుంటూ పోయిపోయి హిజ్ ఎక్సెలెన్సీ పాదాలవద్ద పడింది. అందులోను చీమచిటుక్కుమన్నా విన్పించేటంత నిశ్శబ్దం తాండవమాడుతున్నసమయంలో ఇది సంభవించింది.

క్షమాపణ చెప్పుకోవాలనుకొంటుండగా ఇది జరిగింది. హిజ్ ఎక్సెలెన్సీకి నేను ఇచ్చిన సమాధానం అదే. దీని ఫలితాలు ఎంత దారుణమైనవో వర్ణింపనలవికాదు. హిజ్ ఎక్సెలెన్సీ దృష్టి నా పైకి మళ్ళింది. నా వేషాన్ని నా ఆకారాన్ని ఆయన శ్రద్ధగా పరికించసాగాడు.

అద్దంలో కన్పించిన దృశ్యం గుర్తులేకపోలేదు. ఊడిపోతున్న, పారిపోతున్న గుండీని పట్టుకోవాలని ప్రయత్నించాను. అయినా అది నాకు చిక్కుతేగదా? అది అందకుండా నన్ను తప్పించుకొని, పారిపోయింది. ఆ క్షణంలో నాలోని వివేకం కాస్త అదృశ్యమైపోయింది. సర్వస్వం చేయిజారిపోయింది. పేరుప్రతిష్టలు గౌరవమర్యాదలు అన్నీ పూర్తిగా మంటగలిసిపోయాయి. నా మెదడులో రకరకాల దృశ్యాలు మెదిలాయి; నా చెవుల్లో రకరకాల ధ్వనులు, మాటలు విన్పించాయి. ఫాల్దోని అరుపులు, థెరెస్సా కేకలు, వేయి గొంతుకులు వేస్తున్న నిందలు విన్పించాయి. ఎట్టకేలకు ఆ గుండీని ఎలాగైతేనేం పట్టుకోగలిగాను. లేచి, నిటారుగా నిలబడ్డాను. అలాగే నిలబడివుంటే పోయేది. జరిగిందేదో జరిగిపోయింది అని వూరుకుంటే బాగుండేది. కాని, నేను అలా వూరుకోలేకపోయాను. తెగిపోయిన దారాలతో గుండీని మళ్ళీ అతకాలని ప్రయత్నించాను. ఎంత ప్రయత్నిస్తేమాత్రం, అది కుదటపడుతుందా? చిరునవ్వు చిలికిస్తూనే నేనీ ప్రయత్నం చేశాను, నిజం. నవ్వుతూనే ఆ పని చేశాను. హిజ్ ఎక్సెలెన్సీ తల ప్రక్కకు తిప్పాడు. మళ్ళీ నావంక చూశాడు. యెవస్తఫీ ఇవానొవిచ్‌తో

అన్నాడు ; "ఏమిటిదంతా? ఇతనివంక చూడు. ఎలా వున్నాడో? ఇతని కొచ్చిన ఇబ్బందు లేమిటి?" చూశావా, సఖీ, నీవే ఆలోచించు : "ఇతనికి వచ్చిన యిబ్బందు లేమిటి?" నాకు విశిష్టస్థానం లభించింది. అవునుకదూ? అప్పుడు మన స్తఫీ ఇవానొవిచ్ జవాబిచ్చాడు : "పనిపాటల విషయంలో మచ్చ అన్నది మచ్చుకైనా లేదు. ప్రవర్తన అమోఘమైనది. శేట్లనుబట్టి వేతనం." "సరే, ఏదోవిధంగా అతనికి కాస్త సహాయం జరిగేటట్టు చూడు. పోనీ అడ్వాన్సుగా కొంత మొత్తం ముట్టజెప్పు" అన్నాడు హిజ్ ఎక్సెలెన్సీ. "కాని ఈ నెల జీతమంతా ఇప్పటికే తీసేసుకొన్నాడండీ. ప్రవర్తనలో ఎట్టిలోపం లేకపోయినా, పనిపాటల విషయంలో ఎట్టి మచ్చ లేకపోయినా, పరిస్థితుల ప్రభావంవల్ల పాపం ఇతని స్థితి ఇలా దిగజారిపోయింది. ఇతనిలోపం ఏమీ లేదండీ" నేను చెప్పితే నీవు నమ్ముతావో, నమ్మవో కాని ప్రియతమా, నరకంలో సలసలకాగే నూనెలో నన్ను ముంచెత్తినంత పనయిందంటే నమ్ము. నాకువినబడేటట్లుహిజ్ ఎక్సెలెన్సీ చెప్పాడు : "సరే; సరేగాని, ఈ డాక్యుమెంటును సాధ్యమైనంత త్వరగా తిరిగి కాపీచేయమను. దెవూష్కిన్, ఇలారా. ఈ డాక్యుమెంటును తప్పులు లేకుండా కాపీచేయి. తర్వాత..." అని హిజ్ ఎక్సెలెన్సీ ఆగిపోయాడు. చుట్టుప్రక్కల వున్నవారందరినీ బయటకు పంపించివేశాడు. ఇక ఆ గదిలో మేమిద్దరమే మిగిలాం. హిజ్ ఎక్సెలెన్సీ జేబులోనుంచి పర్సుతీసి, వంద రూబుళ్ళనోటు ఒకటి నా చేతిలో పెట్టుతూ చెప్పాడు : "ఇదిగో, తీసుకో...ఊరికే తీసుకోటానికి యిష్టం లేకపోతే,

పోనీ అప్పుగానే తీసుకో. ఏదోవిధంగా నీకు సహాయం చేయాలని నాకు బుద్ధిపుట్టింది." ఆ మాటలు నాకు విస్మయం కల్గించాయి; నిజం, సఖీ. నా కళ్లను, నా చెవులను నేనే నమ్మలేకపోయాను. ఇది కలా, లేక నిజమా అన్నంత సందేహం కల్గింది. నేను అతనిచేతిని తీసుకొని ముద్దెట్టుకోవా లన్నంత బుద్ధిపుట్టింది. కాని, ఆ మానవోత్తముని ముఖం ఎర్రబారింది. నేను చెప్పుతున్నదానిలో ఈషణ్మాత్రం అతిశయోక్తికూడాలేదు, వరెంకా. హిజ్ ఎక్సలెన్సీ అసహ్యమైన నా చేతిని స్వయంగా తీసుకొని, నేనేదో అతని హోదాకు సరితూగే వ్యక్తిననుకొని, కరస్పర్శ చేశాడు. "సరే, ఇక వెళ్లు. ఇంతకన్నా నేను నీకు సహాయం చేయలేకపోయినందుకు చింతిస్తున్నాను. మళ్ళీ ఎన్నడూ పొరపాట్లుచేయకు. జరిగిన పొరపాటుకు వచ్చే చివాట్లను మనమంతా సమానంగా పంచుకొందాంలే" అంటూ ఊరడించాడు.

కనుక నా వాళ్ళయిన నిన్నూ, ఫెడోరాను వేడికొంటు న్నాను: దయచేసి, హిజ్ ఎక్సలెన్సీ దీర్ఘాయుష్మంతుడు కావాలని ప్రతిరోజూ దేవుడిని ప్రార్థించండి. నిజంగా నాకే బిడ్డలు అంటూవుంటే వాళ్ళకూ ఇదేమాట చెప్పేవాడిని: మీ తండ్రికన్నా మిన్నగా హిజ్ ఎక్సలెన్సీ ఆయురారోగ్యాల కోసం దేవుడిని ప్రార్థించడర్రా. నిజం, సఖీ. నేనీ మాటలు ఆషామాషీగా చెప్పటంలేదు. నా చిన్నారిముద్దులకూనా, ఈమధ్య నీకు సహాయం చేయలేకపోయానన్న బాధ నన్ను అమితంగా పీడించిందంటే నమ్ము. ఏమైతేనేం, ఇప్పుడు

నా వద్ద వందరూపాయల్లు వున్నాయి. అయితే, ఈ డబ్బుకన్నా నా హృదయాన్ని ఉన్నతస్థాయికి కొనిపోయిన మరొక విశేషం వుంది సుమా? హిజ్ ఎక్స్‌లెన్సీ నాతో కరస్పర్శ చేశారు. ఎందుకూ పనికిరాని వెధవను, త్రాగుబోతును అయిన నాతో ఆయన కరస్పర్శ చేశారు. దానితో నేనూ మానవుణ్ణే అన్న విశ్వాసం మళ్ళీ నాలో చిగిర్చింది. నీళ్ళు లేక ఎండవేడితో మాడిపోయిన లేతలతకు ఆయన ఇంత నీరుపోసి పుణ్యంకట్టుకొన్నారు. నా జీవితాన్ని శాశ్వతంగా మధురమయం కావించాడు. నేను పాపాలు చేసినవాడినే కావచ్చు; అయినా హిజ్ ఎక్స్‌లెన్సీ దీర్ఘాయుష్మంతుడు కావాలని నేను చేసే ప్రార్థనలను దేవుడు ఆలకించగలడన్న గట్టి నమ్మకం నాకు వుంది.

ఏ రెంకా, నా మనస్సు ఇంకా స్థిమితపడలేదు. ఆలోచనలు పరిపరివిధాల పరుగెడుతున్నాయి. గుండెలను చీల్చుకొని నా హృదయం లంఘిస్తోంది. నేను చాలా బలహీనంగా వున్నాను. నీకు నలభైయైదు రూపాయల్లు పంపిస్తున్నాను. పోతే, మరొక ఇరవై రూపాయల్లు ఇంటిఅద్దెకు చెల్లించుతాను. ఇక ముప్పయియైదు రూపాయల్లు మిగులుతాయి. అందులో ఇరవై రూపాయల్లు పెట్టి నా దుస్తులు బాగుచేయిస్తాను. కాగా, ఇతర అవసరాలకు పదిహేను రూపాయల్లు మిగులుతాయి. ఈవేళ ఉదయం జరిగిన ఘటనలతో నాహృదయం అదోమాదిరిగా వుంది. ఇక నిద్రపోవటం మేలనిపిస్తోంది. నాహృదయంలోఆందోళన సమసి పోయింది; మనస్థిమితం ఏర్పడింది. అయితే నా హృదయంలో, హృదయాంతరాళంలో అప్పు

డప్పుడు మాత్రం కలకవేస్తోంది. ఆ కలకతో నా హృది తల్లడిల్లుతోంది. తల్లడిల్లే హృదయం స్పందన నా చెవుల్లో గింగురుమంటోంది. తర్వాత నీ యింటికివచ్చి, ఆ విషయం నీతో స్వయంగా మాట్లాడుతాను. ఇప్పుడు నాస్థితి తాగిన వాడి పరిస్థితిగా వుంది. పొద్దుటి ఘటనలమైకంలోనుంచి ఇంకా పూర్తిగా బయటపడలేదు. అన్నిటికీ పైన దేవుడే వున్నాడు. అంతేగా, వెలలేని ప్రియతమా! చిన్నారీ వయ్యారీ, సెలవు.

నీ స్నేహితుడు,
మకార్ దెవూష్కిన్.

సెప్టెంబరు, *10*

*ప్రియతమమైన మకార్ అలెగ్జెవిచ్,*

ఎట్టకేలకు నీ అదృష్టం పండింది. శుభవార్త విని పొంగి పోయాను. మీ హిజ్ ఎక్సెలెన్సీ ప్రదర్శించిన కరుణాభావం ప్రశంసనీయం. ఆయన దాతృత్వాన్ని నా మనస్సులో మెచ్చు కున్నానుకూడా. ఇక నీవు నిశ్చింతగా జీవించవచ్చు. అయితే దయచేసి, చేతికి డబ్బు చిక్కిందిగదాయని తగలెయ్యకు. సాధ్యమైనంతవరకు ప్రశాంతమైన, నిరాడంబర జీవితం గడప

టానికి ప్రయత్నించు. నిత్యమూ ఎంతో కొంత మూటగట్టు. దురదృష్టం అకస్మాత్తుగా సాగించే దాడులను తట్టుకొని, నిలదొక్కుకోనేందుకు ఇప్పటనుంచి జాగ్రత్తపడు. మమ్మల్లను గురించి వ్యాకులత చెందకు. ఫెడోరా, నేనూ ఎలాగో ఒక లాగు బ్రతకలేకపోము. మకార్ అలెగ్జెవిచ్, నీ పిచ్చి కాక పోతే, ఎందుకంత డబ్బు పంపించావు? మాకు ఇప్పుడు డబ్బేమీ అవసరం లేదే. మాకున్న దానితో మేము హాయిగా జీవించ గల్గుతున్నామే. అన్నట్టు మరొక యింటికి మకాం మార్చితే, అప్పుడు డబ్బు అవసరమైతే కావచ్చు. అయినా ఏదో పాతబాకీ వసూలు అవుతుందని ఫెడోరా భరోసా యిస్తోంది. అనుకోకుండా వచ్చిపడే అవసరాలకోసం ఇరవై రూబుళ్ళు వుంచుకొని, మిగతా మొత్తం నీకు తిప్పి పంపు తున్నాను. నీ డబ్బును నీవు జాగ్రత్తపర్చుకో, మకార్ అలెగ్జెవిచ్. మరి సెలవు, నీకు చింతలనుంచి నేటికి విముక్తడ వయ్యావు. హాయిగా, సుఖంగా జీవించు. వంట్లో ఓపిక లేదు గాని, వుంటే ఇంకా దీర్ఘమైన జాబే వ్రాసేదాన్ని. నిస్సంతా మంచంమీదనుంచి కాలు క్రిందకు దించితే వట్టు. మా యింటికి వస్తానని వాగ్దానం చేశావు. అందుకు కడు సంతోషం. తప్పకుండా రా.

వి. డి.

పర్వారా అలెగ్జెయేనా, ఓ నా ప్రేమ పతంగమా,

నే నిప్పుడు సంతోషంగా, సంతృప్తికరంగా జీవిస్తున్నాను. ఇట్టి స్థితిలో నన్ను వీడి, వెళ్ళిపోకు. ఫెడోరామాట వినకమ్మా. నీవు కోరిందల్లా నేను తెచ్చిపెట్టుతాలే. నీవు చెప్పినట్లే నడచుకుంటాను. నీవు గీసిన గిరి దాటితే వట్టు, సక్రమంగా ప్రవర్తిస్తాను. కనీసం హిజ్ ఎక్సెలెన్సీకోసమైనా నా నడవడికను తీర్చి దిద్దుకొంటాగా. మళ్ళీ మనిద్దరం ఇంతకుముందులాగానే సంతోషం చిందించే ఉత్తరాలు వ్రాసుకొంటూ, ఒండొరుల ఆనందాన్ని, ఒకవేళ యిబ్బంది లెదురైతే వాటినీ పరస్పరం పంచుకొందాం. సామరస్యం, శాంతి, సంగీతం జాలువారే సెలయేరులమధ్య హాయిగా జీవిద్దాం. మళ్ళీ సాహితీప్రపంచంలో ప్రవేశిద్దాం. నా జీవితంలో అరణ్యపర్వం సమాప్తమై, సౌఖ్యపర్వం ప్రారంభమైంది; నిజం వరెంకా, ఇంటి యజమానురాలు నేస్తుగా మారింది. థెరెస్సా తెలివితేటలు మెండైనవి; చివరకు ఫాల్దోనీకూడా కుక్కినపేనై పోయాడు. రతజ్ యేవ్‌తో పొరపొచ్చాలన్నీ మటుమాయమయ్యాయి అతనిహృదయం చాలామంచిది, ప్రియతమా. అతనినిగురించి ఇతరులు చెప్పిన చెడు సంగతులన్నీ కేవలం కల్పితాలు; చెత్తా చెదారంతప్ప వేరుకాదు. మన జీవితాలను గ్రంథస్థ మొనర్చాలన్న దృష్టి అతని కెన్నడూ ఏకోశాన లేదు. ఈ మాట అతనే

నాతో చెప్పాడు. అతని క్రొత్త రచనలు చదివి విన్పించాడు. "ప్రేమికుడు" అంటూ క్రొత్తపేరు నాకు తను ఎందుకు తగిలించాడో వివరించాడు.

"ప్రేమికుడు" అన్న పదం చెడ్డదేమీ కాదట; అసహ్యాకరమైనది అసలే కాదట. అది అసలు ఒకానొక విదేశీభాష నుంచి సంగ్రహితమైనదట. దాని అసలు అర్థం "సునిశితమేధాశక్తి గల వ్యక్తి" అని చెప్పాడు. ఇంకా స్పష్టంగా, అందరికీ సుబోధకమయ్యేటట్లు చెప్పాలంటే, "ప్రేమికుడు" అంటే అర్థం "తెలివి తేటలు గల యువక మహాజనుడు" అనట; అంతే. అందుచేత అది అమాయకత్వంతో ఉపయోగించిన హాస్యోక్తి దేవకన్యా. అయితే దానిని అర్థంచేసుకోలేకపోయిన ఈ చవటవున్నాడు చూశావూ. వీడు అపార్థం చేసుకొన్నాడు. అందుకు క్షమాపణ వేడుకొన్నానులే. అన్నట్టు ఈవేళ వాతావరణం బహు రమణీయంగా వుంది. మనస్సునను గిలిగింతలు పెట్టిస్తున్నది. ఇవ్వాళ పొద్దున పొగమంచు దట్టంగా పట్టినమాట నిజమే ననుకో. అయినా మంచుతో కలిసినగాలి నవనీతంగా మారింది. నేను ఇవాళ అందాలుచిందే చెప్పులజోడు కొన్నాను. అవి తొడుక్కొని నెవ్‌స్కీవైపు షికారుకు బయలుదేరాను. కాలువ ఒడ్డున కూర్చొని వార్తాపత్రిక తీసి, ఆసాంతం చదివేశాను. అన్నట్టు చెప్పటం మర్చిపోయాను. ఇవాళ హిజ్‌ఎక్సెలెన్సీను గురించి యెమెల్యాన్ ఇవనొవిచ్‌తోను, అల్‌సెంటి మిఖైలొవిచ్‌తోను చెప్పాను. నా విషయంలోనే కాదట. యింకా అనేక మంది విషయంలో కూడా హిజ్‌ఎక్సెలెన్సీ ఉదారంగానే

వ్యవహరించారట. ఈ విషయం నా కివాళే తెలిసింది. హిజ్ ఎక్సెలెన్సీ కరుణార్ద్రహృదయుడన్న సంగతి లోక విదితమేనట. అనేకమంది ఆయనను మహాపొగిడారు. లోగడ ఒకసారి ఆయన దిక్కులేని పిల్లను దగ్గరకుతీసి, పెంచి పెద్దదాన్నిచేసి, బాగా ఉన్నవాడు, ఉన్నతోద్యోగి అయిన వ్యక్తిని చూసి ముడిపెట్టాడట. ఒకప్పుడు ఒక విధవరాలు కొడుకుకి ఉద్యోగ మిచ్చాడట. ఇవేగాక, యింకా అనేక మంచిపనులు చేశాడని ప్రతీతియట. హిజ్ ఎక్సెలెన్సీ మంచితనం గురించి అంతా తలొక కథ అల్లి చెప్తూంటే, నేనూ ఊరుకోలేక, నా గాథను చెప్పేశాను. జరిగింది జరిగినట్టు దాపరికంలేకుండా చెప్పేశాను. అందుకు అంతాకలిసి నన్ను గేలిచేశాడు. అవమానపర్చారు. అయినా అట్టి సందర్భంలో అవమానానికి ఆస్కారం ఎక్కడుంది చెప్పు! హిజ్ ఎక్సెలెన్సీ మంచితనం గురించి అందరికీ విన్పించేటట్టు ఎలుగెత్తి చాటటం తప్పా? చెప్పు. నా మనస్సు ఉప్పొంగింది. ఆ ఉప్పెనలోపడి కొట్టుకుపోయాను. సిగ్గు, బిడియం దూదిపింజాలై మటుమాయమైపోయాయి. వాస్తవం చెప్పినందుకు నేను సిగ్గుపడటంలేదు. పైగా గర్విస్తున్నాను. అన్ని విషయాలు చెప్పేశాను. (అయితే నీ సంగతి మాత్రం చెప్పలేదులే). మాయింటి యజమానురాలి సంగతీ, ఫాల్డోనీ వ్యవహారమూ, రతజ్యేవ్ సంగతీ, నా చెప్పుల విషయమూ, మార్కోవ్‌ను గురించీ, ఒక మాటలో చెప్పాలంటే, సకల విషయాలు ఏకరువుపెట్టాను. కొందరేకాదు, అందరూ వెకిలిగా నవ్వారు. నవ్వనీ, నవ్వీన నాపచేనే పండుతుందన్నారు

పెద్దలు. బహుశా నా ఆకారాన్నిచూసి, నా చెప్పులను కాంచి వారు నవ్వి వుంటారు. ఆఁ, రైట్. వాళ్ళు తప్ప కుండా నా చెప్పులనుచూసే నవ్వివుంటారు. వాళ్ళ నవ్వు హేళనపూర్వకమైనది కాకపోవచ్చు. వాళ్ళకేఁ వాళ్ళంతా యువకులు. బాగా జరుగుబాటు గలవాళ్ళు. వాళ్ళకు దురుద్దేశమేమీ లేకపోవచ్చు. అయినా హిజ్ ఎక్సెలెన్సీని గురించి వాళ్ళు ఎలా ఎగతాళి పట్టించగలరు? హేళన చేయ గలరా, చెప్పు వరెంకా!

గతంలోని వెతలనుంచి నే నింకా పూర్తిగా కోలుకో లేదు. జరిగిన ఘటనలు నన్ను గందరగోళంలో ముంచెత్తాయి. ఇంతకీ మీ యింట్లో వంటచెరకు తగినంత వుందా లేదా? వరెంకా, జాగ్రత్తమ్మా. చలిలో, తడిలో తిరగకు; జలుబు చేస్తుంది. అవును ప్రియంతమా, విచారభరితమైన నా ఆలోచనలు నా హృదయాన్ని ఆఘాతి పరుస్తున్నాయి. ఆ విషయం గురించే సదా నేను దైవాన్ని ప్రార్థించు తున్నాను. చలిగాలి సుకుమారమైన నీ వంటిని తాక కుండా, సోకకుండా జాగ్రత్త తీసుకొంటున్నావా? అవసర మైన ఉన్ని దుస్తులు సంపాదించావా? ఈ ముసలివాడిపట్ల దయయుంచి, నీ కేమికావాలో చెప్పు. ఒక్క ఉత్తరముక్క వ్రాస్తే చాలు. దుర్దశ దాటిపోతుంది. మహోజ్జ్వలమైన భవిష్యత్తు మనవైపు పరుగెత్తుకొస్తోంది.

మనం కష్టాలను అనుభవించినకాలం లేకపోలేదు. కష్ట కాలం, దుష్టకాలం గతించిపోయింది. కాలం గడిచేకొలదీ గతాన్ని తలుచుకొని మనం నిట్టూర్చకపోములే. నా చిన్న

నాటి రోజులు ఇప్పటికీ నాకు గుర్తుకొస్తూనే వుంటాయి. నాదగ్గర దమ్మిడీ అంటే దమ్మిడీ లేనిరోజులూ వున్నాయి. అయినా ఆరోజుల్లో ఆనందానికి కొదవ లేదు. అదే విచిత్రం. ఆరోజుల్లో నెవెస్కీ ప్రాంతంలో ఉదయాన ఓ అందమైన యువతి ముఖారవిందాన్ని తిలకిస్తే చాలు, ఆ రోజల్లా మనస్సు ఎంతో మనోహరంగా వుండేది. ఆ రోజులే అలాంటివి. అవును వరెంకా, జీవితం మధురమైంది; అందులోనూ సెంట్‌పీటర్స్‌బర్గులో జీవించటం మరింత ఆహ్లాదకరం. మనం కష్టాలతో కాపురంచేసిన రోజుల్లో నేను చేసిన పాపాలను మన్నించమని నిన్న కంట తడిపెట్టుకొంటూ దేవుడిని వేడుకొన్నాను: ఇది లేదనీ, అది లేదనీ గొణిగినందుకూ, పిచ్చి పిచ్చి ఆలోచనలకు పోయినందుకూ, దుర్వ్యసనాలకు లోనైనందుకూ క్షమించమని ప్రార్థించాను. ప్రార్థనాసమయంలో నీవు గుర్తుకొచ్చావు. నా హృది అనురాగ ప్రభంజితమైంది. నా వెన్నుతట్టి, దన్నుగా నిలచిందీ, నన్ను ఓదార్చిందీ, ఉచిత సలహాలిచ్చిందీ నీవే; ఈ విషయం జీవితపర్యంతం మర్చిపోలేను, ప్రియతమా. సెలవు, నా వరెంకా సెలవు. అన్నట్టు సర్వీసుకోటు ఏదో మన ఇరుగు పొరుగున ఎవరో అమ్మకానికి పెట్టారని తెలిసింది. నేను దానిని గురించి వాకబుచేయాలి కదూ? సెలవు, నా చిన్నారి దేవకన్యా, సెలవు.

అనురాగపూర్వకంగా,
మకార్ దెవూష్కిన్.

ప్రియతమమైన మకార్ అలెక్సెవిచ్,

నా గుండెలు వేగంగా కొట్టుకొంటున్నాయి. చెప్ప నలవికాని ఆందోళనలో పడి కొట్టుమిట్టాడుతున్నాను. అన్నీ అపశకునాలే. అసలు విషయం వున్నదున్నట్టు నీముందుంచు తాను. నీవే నిర్ణయించు: బైకోవ్ సెంట్‌పీటర్సుబర్గు లోనే వున్నాడు. అతను ఫెదోరాకు కన్పించాడు. మేలురకం గుర్రమెక్కి, స్వారీచేస్తూ, పోతూపోతూ, దారిలో ఫెదోరా కన్పించగానే, టక్కున గుర్రాన్ని ఆపుచేసి, గుర్రంపైనుంచి క్రిందకు దిగి, ఫెదోరాను సమీపించి కుశల ప్రశ్నలు ప్రారం భించాడు. ఎక్కడ వుంటున్నావని అడిగాడు. ఫెదోరా జవాబుచెప్ప నిరాకరించింది. అతను ఓ చిరునవ్వు విసిరి, "పిచ్చిదానా, నీవు చెప్పకపోతే మాత్రం నాకు తెలియదను కున్నావా, నీవు ఎవరితో కలిసి వుంటున్నావో నాకు తెలుసు" అనేశాడు. (అన్నాఫ్యోదోరోవ్‌నా అన్ని విషయాలు అతనికి చెప్పివుంటుంది.) దానితో ఫెదోరా నిగ్రహించుకోలేక పోయింది. నోటికొచ్చినట్టు కడిగేసింది. నీతిమాలినవాడివని తిట్టేసింది. నా కష్టాలన్నింటికీ కారణం అతనేనని అతని ముఖానే అనేసింది. దానికి అతను ఏమన్నాడో తెలుసా? "నిజమే. ఆమె జీవితం కష్టమయమే. చేతిలో డబ్బు లేకపోతే ఎవరి జీవితమైనా దుఃఖమయమే". దానిపై ఫెదోరా అన్న మాటలివి: "ఆమె తన జీవితానికి కావల

సింది సంపాదించుకోగల్గేదే; లేదా ఎవరినో ఒకరిని పెళ్ళి చేసుకొని వుండేది. లేదా ఏదో ఒక వృత్తిలో ప్రవేశించి వుండేది. కాని, నీపుణ్యమాఅంటూ ఆమె ఆరోగ్యంపూర్తిగా చెడిపోయింది. రేపో మాపో చచ్చిపోవటానికి సిద్ధంగా వుంది." దానికి అత నిచ్చిన సమాధాన మేమిటో తెలుసా? లోకజ్ఞానంలేని యువ్వని; పైగా తల బిరుసు జాస్తి. అంతే కాదు. ఆమె శీలం చెడిపోలేదని గట్టిగా చెప్పేందుకు వీల్లేదు." (అతని నోటినుంచి వచ్చిన మాటలనే యథాతథంగా ఇక్కడ ఉల్లేఖించాను). మేము నివసిస్తున్నచోటు అతనికి తెలిసి వుండదులే అని నేనూ, ఫెడోరా అనుకున్నాం. కాని, నిన్న సాయంత్రం అతను మా గదికి రానేవచ్చాడు. అయితే అదృష్టవశాత్తు నేను అప్పుడు గదిలోలేను. ఏవో వస్తువులు కొందామని బజారు కెళ్ళాను. నేను ఇంట్లోలేని సమయం చూసి రావాలనుకొన్నాడో ఏమో మరి! ఆ లెక్కన చూస్తే అతని ఉద్దేశం అదేనని పిస్తోంది. ఫెడోరాను ఎన్నో విషయాలు గుచ్చిగుచ్చి అడిగాడు. నన్నుగురించీ, నా జీవితంగురించీ ప్రశ్నించాడు. గదంతా జాగ్రత్తగా పరిశీలించాడు. నా అల్లిక పనితనం పరికించాడు. చివరకు అసలుప్రశ్న వేశాడు: "అయితే మీ యింటికి తరచు వస్తూపోతుండే ఆ గుమాస్తా ఎవరు?" సరిగా ఆ సమయానికే నీవు వాకిటిముందుగా పోతున్నావు. "అడుగో" నని ఫెడోరా వేలెట్టి చూపించింది. అతను నీవంక చూశాడు. చూసి చిరునవ్వు నవ్వాడు. ఇంట్లోనుంచి తక్షణం వెళ్ళిపొమ్మని అతనిని ఫెడోరా గదమాయించిందట. నా ఆరోగ్యం అసలే బాగా లేదనీ,

ఇట్టి స్థితిలో అతను కన్పించటం అంత మంచిదికాదనీ ఫెదోరా అతనికి గట్టిగా చెప్పిందట. దానికి అతనేమీ సమాధానం యివ్వలేదు. ఏదో కొంత మేలుచేయాలన్న తలంపుతో మాత్రమే వచ్చానని చెప్పాడు. జేబులో నుంచి పాతిక రూబుళ్ళు తీసి ఫెదోరాకు యివ్వబోయాడు. ఆ డబ్బును ముట్టుకోవటానికి ఫెదోరా నిరాకరించినదనుకో. అయినా ఈ గొడవంతా ఏమిటి? ఇందులో అంతరార్థమేమైవుంటుంది? అతను ఎందుకొచ్చినట్టు? మమ్మలను గురించిన సకల విషయాలు అతనికి ఎలా తెలిశాయి? ఏమీ అంతుబట్టకుండావుంది. నాకేమీ పాలుబోవటంలేదు. ఫెదోరా అంటోంది: మా యింటికి తరచు వస్తూ పోతుండే తన వదిన ఆక్సినియాకు చాకలి నటాసియాతో పరిచయం వుందనీ, ఆ నటాసియా బంధువెవరో అన్నాఫ్యోదొరోవ్‌నా మేనల్లుడు పనిచేసే మంత్రిత్వశాఖలో గేటుకాపలా దారుగా పనిచేస్తున్నాడనీ, వాళ్ళద్వారానే మా సంగతులన్నీ వాళ్ళకు తెలిసివుంటాయనీ ఫెదోరా వాదన. బహుశా వీళ్ళ ద్వారానే అన్నాఫ్యోదొరోవ్‌నా అన్ని విషయాలు ఆచూకీ తీసివుండవచ్చు; లేదా ఫెదోరాయే పొరబడివుండ వచ్చు. ఏమిచేయాలో పాలుబోకుండావుంది. అతను మళ్ళీ వస్తాడా? ఆ భావనే నన్ను భయకంపితురాలను చేస్తోంది. నిన్న ఫెదోరా ఈ సంగతంతా చెప్పినప్పుడు, నేను స్పృహ తప్పి పడిపోయినంత పనయింది. ఇంకా నా నుంచి అతను వాంఛించేదేమిటి? అసలు ఇక వాళ్ళ మొఖమే చూడను. ఒక అనాథ యువతిని వెంటబడి, అత నిలా ఎందుకు పీడి

స్తాడు? అనుక్షణం ఆందోళనతో, భయంతో జీవిస్తున్నాను. ఏ క్షణాన ఏమి జరుగుతుందో? ఈ క్షణాన బైకోవ్ మళ్ళీ ప్రత్యక్షమైతే ఏమికాను? నాగతేమిటి? మకార్ అలెక్సెవిచ్, ఈ జాబు చూసిన తక్షణం మా యింటికి ఒకసారి వచ్చిపో. తక్షణం బయలుదేరిరా. నీకు పుణ్యంవుంటుంది. వెంటనే రా.

వి. డి.

సెప్టెంబరు, *18*

*వర్వారా అలెక్సెయేనా, ప్రియతమా,*

ఈ రోజన మా యింట్లో హఠాత్తుగా ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఇలా జరుగుతుందని యెవరూ ఊహించ లేదు. మా అభాగ్య సహోదరుడు గోర్షకోవ్ నిర్దోషి అని ఇవాళ తీర్పు చెప్పారు. అతని నిర్దోషిత్వం చాలా రోజుల క్రితమే రుజువైంది. అయితే తుదితీర్పు మాత్రం యివాళ చెప్పారు. ఏమైతేనేం, అతని అదృష్టం పండింది. పాడు రోజులుపోయిమంచిరోజు లొచ్చాయి. బాధ్యతలు నిర్వహించ టంలో అతను ప్రదర్శించిన నిర్లక్ష్యాన్ని క్షమించి, అతనిని వదిలేశారు. ఆ వ్యాపారివద్దనుంచి పెద్ద మొత్తం గోల్లాడ

గొట్టి, వసూలుచేసి, పరిహారంక్రింద గోర్ష్‌కోవ్‌కు ముట్ట చెప్పారు. దీనితో అతని ఆర్థిక పరిస్థితులు బాగుపడ్డాయి. అతని పేరుప్రతిష్ఠలు నిలిచాయి. అన్నివిధాలా అతని పరిస్థితులు బాగుపడినట్టే: ఆశించినదంతా లభించింది. మధ్యాహ్నం మూడు గంటలవేళ, అతను తెల్లముఖం వేసుకొచ్చాడు; అతని పెదిమలు అదురుతున్నాయి. చిరునవ్వు మాత్రం రేఖామాత్రంగా అతని ముఖంలో మెరుస్తోంది. ఇంట్లో కాలు పెట్టుతూనే భార్యను అమాంతంగా కౌగలించు కొన్నాడు. పిల్లలను వళ్లోకి తీసుకొన్నాడు. మేమంతా గుంపుగా వారి గదిని ముసిరి, అభినందన పరంపరలను అంద జేశాం. అతని సంతోషానికి పట్టపగ్గాలు లేవంటే నమ్మండి. తనను అభినందించటానికి వచ్చిన పెద్దలందరికీ వంగి వంగి నమస్కారాలు పెట్టాడు. ప్రతివారితోనూ కరచాలనం చేశాడు. మొత్తంమీద అతను ఇవాళ బెత్తెడు యెత్తు పెరిగి నట్టున్నాడు. గూని ఎగిరిపోయింది. నిటారుగా నిలబడ్డాడు. అతని కళ్ళల్లో రోజూ కన్పించే పుసి మాయమైపోయింది. పాపం అభాగ్యుడు, ఎంతగా సంబరపడిపోయాడని. ఒక్క క్షణం ఒక చోట కాలునిలిస్తే నట్టు. కాలుగాలిన పిల్లిలాగా వూరికే అటూ ఇటూ అదేపనిగా తిరుగుతూ, ముసి ముసి నవ్వులు నవ్వుతూ, అందరికీ వంగి వంగి వందనాలు పెట్టుతూ, నోటికొచ్చినట్టల్లా వాగుతూ, పేలుతూ, తన [illegible]స్పతనం గురించి చెప్పుతూ......అప్పుడప్పుడు కంటతడికూడా పెట్టు కొన్నాడు. మాలో చాలామంది కళ్ళంటకూడా నీళ్ళు తిరిగాయి. బహుశా అతనిని ఉత్సాహపర్చాలన్న ఉద్దే

శంతో కావచ్చు, రతజ్ యేవ్ "మిత్రమా, గౌరవం, పేరు, ప్రతిష్టా యిత్యాదులవల్ల కలిగే ప్రయోజనమేమిటి? పొయ్యిలో పిల్లి లేచినప్పుడుగదా వాటి ప్రయోజనం. కడుపు నిండినప్పుడుగదా వాటి సార్థక్యం. అందుకే ధనం మూలం ఇదం జగత్. నీ చేతికి డబ్బు వచ్చింది. అందుకు సంతోషించు" అంటూ అతని వీపు తట్టాడు. దీనికి గోర్ష్కోవ్ ఎంతగానో నొచ్చుకొన్నట్టున్నాడు. అయితే ఆ విషయం అతను ప్రత్యక్షంగా వెల్లడించలేదనుకో. రతజ్ యేవ్ వంక ఒక కోరచూపు విసిరాడు. రతజ్ యేవ్ చేతిని తన వీపుమీద నుంచి కోపంగా త్రోసేశాడు. ఇంతకు ముందయితే అతను అలాంటిపని చేయటానికి సాహసించే వాడు కాదు. భిన్న భిన్న మనస్తత్వాలు. నేనైతే అలాంటి సంతోష సమయాలలో అంతటి గీర ప్రదర్శించేవాడిని కాదనుకో. అవును; కొన్ని సందర్భాలలో అతి వినయం ప్రదర్శించవలసే వుంటుంది. ఒకటికి రెండుసార్లు వంగి వంగి నమస్కారాలు పెట్టక తప్పదు. అవి సద్భావానికీ, సహృదయతకూ నిదర్శనం. సరే. నా గొడవ కేమి వచ్చెగాని, గోర్ష్కోవ్ అన్నాడుగదా: "అవును. డబ్బుచేదని నేను అనటంలేదు. దైవ బలంవల్లనే నాకీ డబ్బు వచ్చిందనికూడా నేను అంగీకరిస్తాను. అదే మాటను అతను పదేపదే వర్ణించాడు. అతని భార్య పప్పు భోజనం యేర్పాటుచేయించింది. ఇంటియజమానురాలు స్వయంగా వంటచేసింది. మా యింటి యజమానురాలు అదొకరకం మనిషి. పూర్తిగా చెడ్డదని చెప్పేందుకు వీల్లేదు. ఒక విధమైన దయ, కరుణ ఆమెలో లేకపోలేదు. పసందైన

విందుకోసం యెదురుచూస్తున్న గోర్ష్కోవ్ కాలుగాలిన పిల్లి లాగా అన్ని గదులు అదేపనిగా కలయతిరిగాడు. పనివున్నా, లేకపోయినా ప్రతి గదిలో ప్రవేశించి, ఒక్క చిరునవ్వు విసరి, లేదా కుర్చీలో క్షణంసేపు కూర్చొని, ఏదో ఒక మాట పలికి లేదా అసలు నోరు విప్పకుండాకూడా తిరిగి వచ్చేశాడు. నాకా ఉద్యోగి గదిలోమాత్రం అతనికి సాదర పూర్వకమైన ఆహ్వానం లభించింది. ఒక చేయి ఖాళీగా వున్నట్టుంది; చతుర్ముఖరామాయణ పారాయణంలోని ఆ ఖాళీని భర్తీచేయమని వాళ్ళు గోర్ష్కోవ్‌ను ఆహ్వానించారు. ఆహ్వానం అందటమే తడవుగా, అతను యెగిరి గంతేసి పేకాటలో కూర్చున్నాడు. ఒకటి రెండాటలు ఆడి, పూర్తిగా ఆటనంతా నానా ఖంగాళీచేసి చక్కా లేచివచ్చాడు; వస్తూ వస్తూ "ఆఁ. ఏదో రెండాటలు ఆడి లేచిపోదామని మొదట్లో అనుకొన్నాను" అంటూ సంజాయిషీ యిచ్చి మరీ చక్కా వచ్చాడు. పేకాటలోనుంచి లేచివస్తూ, దారిలో నా కగు పించాడు. నా రెండు చేతులు పట్టుకొని, నా రెండు కళ్ళ ల్లోకి తదేకంగా చూస్తూ, అతి విచిత్రమైన పద్ధతిలో నా చేతులను బలంగావత్తి, నోరు విప్పకుండా, చిరునవ్వు చిందిస్తూ వెళ్ళిపోయాడు. అతని నవ్వులో యెక్కడా జీవం కన్పించలేదంటే నమ్మండి. అతని భార్య సంతోషం పట్టలేక ఆనందబాష్పాలు రాల్చింది. అతని గదంతా మహా కోలా హాలంగా వుంది; పెద్ద పండుగ వాతావరణం ద్యోతక మైంది. విందు భోజనానంతరం అతను భార్యతో అన్నాడు: "సరే నేను కాస్త విశ్రాంతి తీసుకుంటా. కొంచెం

నడుం వాలుస్తా" కొంచెంసేపు మంచంపై మేను వాల్చి, ప్రక్కలోవున్న పసిపిల్ల తల నిమురుతూ పడుకొన్నాడు. ఇంతలోకి యేమి గుర్తుకొచ్చిందో ఏమో, భార్యవైపు తిరిగి ప్రశ్నించాడు: "అన్నట్టు మన పొటెంకా ఏడి? ఎక్కడున్నాడు? పాపం," ఆమె ఈ ప్రశ్నలతో నిర్విణ్ణురాలైపోయింది. "మన పొటెంకా చనిపోయాడుగా" అని జవాబిచ్చింది. "ఔనౌను. మన పొటెంకా స్వర్గంలో వున్నాడు. నిజమే" భర్తకు మతి స్థిమితం తప్పుతున్నట్లు భార్యా భయపడింది. మాట్లాడకుండా కాస్త నిద్రపొమ్మని గట్టిగా చెప్పింది. "నేను ఎటుతిరిగి ఆ పని చేస్తాలే. కాసేపు నిద్రపోతాలే" అంటూ ప్రక్కకు తిరిగి పడుకొన్నాడు. కాని, మళ్ళీ కొద్దిక్షణాలకే భార్యవైపు తిరిగి ఏదో చెప్పబోయాడు; ఆమెకు అదేమీ అర్థంకాలేదు. ఏమిటని అడిగింది. అతని నోటినుంచి జవాబు రాలేదు. అతను నిద్రపోయి వుంటాడని భావించిన భార్య ఇంటి యజమానురాలివద్దకు వెళ్ళి, ఆమాటా ఈమాటా చెప్పుకొంటూ గంటసేపు కాలక్షేపం చేసింది. గదికి తిరిగివచ్చి చూస్తే, అప్పటికీ భర్త యింకా నిద్రపోతూనేవున్నట్టు కన్పించాడు. తనపని తాను చూసుకోసాగింది. పని హడావుడిలోవున్న ఆమెకు అరగంట దాకా అతని తలపే లేకపోయింది. కాని, తీరా భర్తనుచూస్తే ఆమెకు గుండెలు ఆగిపోయినంత పనయింది. పడుకొన్నవాడు పడుకొన్నట్టే వున్నాడు. ఇటూ అటూ ఏమాత్రం కదలలేదు. ఆందోళనతో ఆమె అతని మంచందగ్గరకు వెళ్ళి, అతని వంటిపైన చేయి వేసింది. అనుకొన్నంత జరిగింది; అతను

చనిపోయాడు. పాపం, గోర్ష్కోవ్ అభాగ్యుడు. తనువు చాలించాడు. పిడుగుపాటుకు గురై మరణించిన వ్యక్తివలె చనిపోయాడు. అతని చావుకు హేతువేమిటో తెలియదు. ఈ విచిత్ర సంఘటన నాకు బొత్తిగా అంతుబట్టకుండా వుంది. ఆవిధంగా అసలు ఎవరైనా చనిపోతారా? నిర్భాగ్యుడు గోర్ష్కోవ్! అతని జీవితం ఏమిటి? అతని భార్య కన్నీరు మున్నీరుగా దుఃఖించింది. వాళ్ళ కూతురు ఒక మూలజేరి, ముడుచుకొని కూర్చున్నది. ఆ తర్వాత గదిలో పెద్ద గందర గోళం బయలుదేరింది. శవ పరీక్ష జరుగుతుందని ఎవరో చెప్పగా విన్నాను. నా విచారానికి మేర కానరావటంలేదు. ఆ ఘడియ ఎప్పుడొస్తుందో ఎవరు చెప్పగలరు?...ఇవాళ ఇక్కడ, రేపు ఎక్కడో గదా?

మకార్ దెవూష్కిన్.

సెప్టెంబరు, *19*

ప్రియమైన వర్వారా అలెక్సెయేనా,

నీ కొరకు విషయం వేగిరం తెలియజేయాలి. రతజ్యేవ్ నాకు కొంతపని సంపాదించిపెట్టాడు. ఒక రచయితకు నా పేరు సిఫారసు చేశాడు. ఆ రచయిత ఒక చిత్రగుప్తుని

చిత్తా చేతబట్టుకొని రతజ్యేవ్ వద్దకు వచ్చాడు. దేవుని దయవల్ల నాకు బోలెడుపని దొరికింది. ఆ చిత్తానంతా నేను కాపీ చేయాలి. కాని, దురదృష్టవశాత్తు ఆ రచయిత దస్తూరీ బొత్తిగా బాగా లేదు. నా కేమీ అంతుచిక్కకుండా వుంది. ఈ పని యెలా పూర్తిచేయాలో ఏమో తెలియకుండా వుంది. పైగా త్వరత్వరగా కాపీచేసి యివ్వాలట. అతని వ్రాత అర్థంపర్థం లేకుండా వుంది. ఒక్కొక్క పేజీకి 40 కోపెక్‌లు యిచ్చేటట్టు బేరం పైసలు అయింది. ఇంతకీ నేను చెప్పవచ్చేదేమంటే, అదనంగా డబ్బు నా చేతికి రాబోతున్నది. సెలవు, ప్రియతమా, ఇక నేను పనిలోకి దిగాలి.

నీ నిరంతర ఆప్తుడు,
మకార్ దెవూష్కిన్.

సెప్టెంబరు, *23*

*మకార్ అలెక్సివిచ్, ప్రియమిత్రమా!*

మూడు రోజులబట్టి నీకు ఉత్తరంముక్క వ్రాయలేక పోయాను. ఈ మూడు రోజులలోనూ నేను ఎన్ని యిబ్బందులకు, ఎంతటి హృదయాందోళనకు గురయ్యానో ఆ భగవంతు

డికే ఎరుక. నిన్న కాక మొన్న బైకోవ్ మళ్ళీ మా యింటి కొచ్చాడు. అప్పుడు గదిలో నేనొక్కదాన్నే వున్నాను. ఏదో పనిమీద ఫెదోరా బయటకెళ్ళింది. తలుపుతట్టిన చప్పుడు విని, లేచి వెళ్ళి తలుపు తీశాను. గుమ్మంలో బైకోవ్ ప్రత్యక్ష మయ్యాడు. పై ప్రాణాలు పైనే ఎగిరి పోయినంత పనయింది. కాలుకదపలేక పోయాను. బహుశా అప్పుడు నా ముఖం వివర్ణమై వుండనచ్చు. అతను ఎప్పటిలాగా ముసిముసి నవ్వులు వెదజల్లుతూ గదిలోకొచ్చి, కుర్చీపై కూలబడ్డాడు. అప్పటికి నా హృదయంకాస్త కుదుటపడింది. గదిలో ఒక మూలకుపోయి, కూర్చొని నేను కుట్టుపనిలో నిమగ్నమైపోయాను. అతను నా వంక తదేకంగా చూశాడు. అతని ముఖంలో మెరిసిన నవ్వు మటుమాయమై పోయింది. అతను వెలవెలబోయాడు. నేను బాగా చిక్కిపోయాను. శల్యావశిష్టంగా తయారైయాను. అదే అతని విచారానికి, విస్మయానికి హేతువు కావచ్చు. సంవత్సరం క్రితం నన్ను చూసిన వ్యక్తే, ఇప్పుడు చూస్తే బహుశా నన్నుగుర్తుపట్టలేక పోవచ్చు. అంతగా మారిపోయాను. అతను అలాగే కాసేపు కూర్చొని, నా వైపు దీక్షగా చూశాడు. అటుతర్వాత మళ్ళీ మందహాసం ప్రదర్శించాడు. అతను ఏదో అన్నాడు. నేనేదో జవాబు యిచ్చాను. అదంతా నాకు ఏమీ గుర్తులేదు. అతను మళ్ళీ నవ్వాడు. మా యింట్లో గంటసేపు ఉన్నాడు. గంట సేపూ మాట్లాడుతూనే వున్నాడు. ఏవేవో ప్రశ్నలు వేస్తూనే వచ్చాడు. అతను లేచి బయలుదేరి వెళ్ళబోతూ, వచ్చి నాచేతిని తన చేతిలోకి తీసుకొని అన్నాడు గదా (సరిగ్గా

అతనన్న మాటలనే ఇక్కడ వ్రాస్తున్నాను) “వర్వారా అలెగ్జె యేనా, నీకెంతో అన్యాయం జరిగింది. దీని కంతకూ కారణం, నీ బంధువూ, నా నేస్తు అయిన అన్నాఫ్యోడొరోవ్నా యే. ఆమె పట్టి దుష్టురాలు. మనిద్దరికీ ఆ దుష్టురాలు అడ్డగోడై నిలిచింది. ఆ పాపిష్టిది సామాను తప్పుడు మార్గంలోకి మళ్లించింది; నీ జీవితంలో నిప్పులు పోసింది. పోతే, నే నంటావా, పట్టి పశువులాగా ప్రవర్తించాను. అసలు పురుషులెప్పుడూ అంతే” అంటూ అతను విరగబడి నవ్వాడు. తాను అంత మంచి వక్తను కాదన్నాడు. ఏది ఏమైనా తన గౌరవాన్ని నిలుపుకోనేందుకు, కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకు నన్ను పెళ్ళాడి తీరుతాననని చెప్పాడు. నా శీలాన్ని కాపాడటానికి తనా పని చేస్తానన్నాడు. తనకు కావలసినంత ఆస్తి వున్నదనీ, పెళ్ళి చేసుకోగానే నన్నుకూడా తనతోపాటు తనవూరు తీసుకుపోతాననీ చెప్పాడు. ఆ గ్రామంలో చక్కగా వేటాడుకుంటూ హాయిగా జీవించవచ్చునన్నాడు. అసలు ఈ పాడు పీటర్స్‌బర్గు ముఖమే మళ్ళీ చూడబోనన్నాడు. ఈ నగరంలోనే తన మేనల్లుడు ఒక డున్నాడనీ, వాడు దమ్మిడీకి కొరగాని వెధవలాగా తయారయ్యాడనీ, అందుచేత అతనికి తన ఆస్తిలో ఇక దమ్మిడీకూడా ఇవ్వననీ, అందుకే తాను ఇప్పుడు పెళ్ళిచేసుకోటానికి నిర్ణయించుకొన్నాననీ చెప్పాడు. తనకు సంతానం కావాలన్నాడు. తరువాత నా జీవితం ఎంత నికృష్టంగావుందో వర్ణించాడు. డబ్బులేని జీవితం దుబ్బుకు కొరగాదన్నాడు. నా అనారోగ్యానికి కారణం దారిద్ర్యమే నన్నాడు. మరొక నెలరోజులు యిప్పు డుంటున్న మురికికూపంలోనే

నేను జీవించినట్టయితే, నాకు మరణం తప్పదని చెప్పాడు. అసలు సెంట్ పీటర్స్‌బర్గులో కొంపలన్నీ యింతే నన్నాడు. ఆఖరిమాటగా "నీకేమైనా డబ్బు అవసరముందా" అని అడిగాడు.

అతని ప్రతిపాదనతో నేను పూర్తిగా తలక్రిందులై పోయాను. ఏడ్చాను; ఎందుకో తెలియదు. నా కన్నీటిధారను చూసి, అది కృతజ్ఞతాభావానికి సాదృశ్యం అనుకొని, అతను సంపూర్ణవిశ్వాసం ప్రకటించాడు "నాకు తెలుసు. నీ హృదయం కరుణాప్రపూర్ణమైనది. లతకన్నా లేతనైనది. నీవు విద్యావంతురాలవు" అంటూ తెగపొగిడాడు. కాని, ఈక్షణం వరకు అతను నా గుణగణాలను, యోగ్యతలను విశ్వసించలేకపోయాడు. నన్ను గురించి ఎందరినో వాకబుచేసి తటపటాయించి, తటపటాయించి చివరకు ఈ నిర్ణయానికి వచ్చాడన్న సంగతి నాకు తెలుసు.

ఆ తర్వాత అతను నిన్ను గురించి తెలుసుకొనేందుకు కొన్ని ప్రశ్నలు వేశాడు. నీవు గౌరవనీయమైన నీతిమంతుడవని ఎవరో చెప్పగా అతను విన్నాడట. నాకు నీవు చేసిన సహాయానికి 500 రూబుల్లు నీకు రుణ పరిహారంగా యిస్తానని కూడా అతను చెప్పాడు. నాకు నీవుచేసిన సహాయం అమూల్యమైనదనీ, ఎంత చెల్లించినా నీ రుణం తీరదనీ నేను చెప్పగా అతను ఏమన్నాడో తెలుసా? "అదంతా నాన్‌సెన్స్. కేవలం నవలలోవుండే చెత్త. నీవింకా లోకజ్ఞానం తెలియని చిన్నదానివి. పాటలు, నవలలు చదవాలన్న తహతహ నీకుంటేవుండవచ్చు. అసలు యువతుల పతనానికి

హేతువు ఈ చెత్త పుస్తకాలే. పుస్తకాల మూలానే నీతి సూత్రాలన్నీ మంటగలిసి పోతున్నాయి. అందుకే అవంటే నాకు పరమ అసహ్యం. వయసు వచ్చేకొలదీ లోకజ్ఞానం పెరుగుతుంది. అప్పుడు నీకూ అవగత మవుతుంది. ఏ వ్యక్తి ఎలాంటివాడో తెలిసినస్తుంది" అంటూ చిన్న ఉపన్యాసం దంచాడు. తన ప్రతిపాదనను గురించి తాపీగా ఆలోచించమని కోరాడు. తొందరపడి, ఈ ప్రతిపాదనను తిరస్కరిస్తే ఉత్తరోత్తరా చాలా యిబ్బందులు ఎదుర్కోవలసి వస్తుందని నన్ను భయపెట్టాడు. తొందరపాటు, అనాలోచిత నిర్ణయాలు యువకుల నాశనానికి హేతుభూతా లన్నాడు. "నీవు కనుక నన్ను వివాహ మాడటానికి అంగీకరించకపోతే, నేను విధిలేక మాస్కోలోని ఒక పెద్ద వ్యాపారి కూతురిని పెళ్లాడవలసి వస్తుంది. ఎందుకంటే ఏమైనా నా ఆస్తి నా మేనల్లుడికి దక్కకుండా చేయాలని నిశ్చయించుకొన్నాను" అని చెప్పి అతను వెళ్లిపోతూ, వెళ్లిపోతూ ఎంత వద్దని చెప్పినా వినక, 500 రూబుళ్లు తీసి, టేబుల్పై పెట్టి మరీ వెళ్లిపోయాడు. "ఈడబ్బుతో నీకిష్టమైనవి కొనుక్కో"అని చెప్పాడు.

ఇంకా ఏమేమో చెప్పాడులే. అతని వూళ్ళో జీవితం ఎంతో మనోహరంగా వుంటుందనీ, నేను ఆవూళ్లో ప్రవేశిస్తే దబ్బపండులాగా తయారై తీసతాననీ చెప్పాడు.

అతను వెళ్ళిపోయినతర్వాత నేను అన్నివిషయాలూ సాకల్యంగా ఆలోచించుకొన్నాను. నిర్ణయానికి వచ్చాను. ఇక నా నిర్ణయానికి తిరుగులేదు. ప్రియమిత్రమా, నేను బైకోవ్ను వివాహ మాడబోతున్నాను. అతను చాచిన

హస్తాన్ని నేను పరిగ్రహించక తప్పదు. నా పరువు నిలపాలన్నా, గౌరవం కాపాడాలన్నా, దారిద్ర్యం, కష్టాలు, దురదృష్టాలనుంచి నన్ను బయట పడవేయాలన్నా, అది ఆ ఒక్క వ్యక్తికే సాధ్యం. ఇంతకన్నా నాకు కావలసిందేముంది చెప్పు? ఈమాత్రం అదృష్టం నాకు చాలదంటావా? చేతికందిన ఆనందాన్ని కాలదన్నరాదని ఫెదోరా సలహా. ఇది ఆనందం కాకపోతే, మరి ఇంక ఆనందమనేది ఎక్కడుంటుంది? నామట్టుకు నాకు మరొకమార్గం కన్పించటంలేదు. బ్రతుకు తెరువుకోసం రేయింబవళ్ళు అల్లికపని చేసిచేసి నేను పూర్తిగా ఆరోగ్యం కోల్పోయాను. ఆయాగానో, పనిమనిషిగానో జీవించటమా? ఆ రెండు పనులూ నాకు చేతకావు. నేను పుటకతోనే రోగిష్టినేమో ననిపిస్తుంది. నేను ఎప్పుడూ పరుల శ్రమపై ఆధారపడి జీవించాల్సిందే, నేను ఇప్పుడు ప్రవేశించబోతున్నది స్వర్గం కాదన్నసంగతి నాకూ తెలుసు. మరి అంతకన్నా నాకు వేరొక గత్యంతరం లేదే? నీవే చెప్పు; నేనేమి చేయాలి? నేను ఎంచుకోవలసిన మార్గం ఏది?

కొంపదీసి నిన్ను నిజంగా సలహా అడుగుతున్నానని అనుకోకు. నామనస్సులో ఆలోచనలనుబయటపెట్టాను. అంతే. నేను ఈలేఖలో వుటంకించిన నిర్ణయమే తుదినిర్ణయం. దానికిక తిరుగులేదు. ఇదేవిషయం బైకోవ్‌కు చెప్పబోతున్నాను. పెళ్ళితంతువు చాలా త్వరగా పూర్తికావాలని అతను వేగిరపడుతున్నాడు. ఎక్కువ రోజులు నగరంలో వుండటానికి తనకు అవకాశం లేదని, వెంటనే స్వగ్రామం వెళ్ళిపోవాలని, అందువల్ల చిల్లరమల్లర కారణాలతో వివాహం వాయిదా

పడటానికి వీల్లేదనీ అతను తొందర పెట్టుతున్నాడు. భవిష్యత్తులో నాజీవితం సుఖప్రదమే అవుతుందో, లేక దుఃఖ భాజనమే అవుతుందో ఆ భగవంతుడికే తెలియాలి. భారమంతా ఆ భగవంతుడిమీదే వేస్తున్నాను. బైకోవ్ కరుణాశీలి అని అంతా అంటున్నారు. అతను నన్ను గౌరవంగా చూస్తాడు. నేనూ అతన్ని గౌరవించటం అలవాటు చేసుకొంటాను. ఈ వివాహంనుంచి అంతకన్నా నేను ఆశించగల్గిందింకేముంది చెప్పు?

చెప్పవలసినదంతా పూస గుచ్చినట్లు చెప్పేశాను. మకార్ అలెక్జెవిచ్, నీవు నన్ను అపార్థం చేసుకోవనే ఆశిస్తాను. నా మనస్సును మార్చడానికి, మళ్లించటానికి ప్రయత్నించకు. ఒకవేళ నీ వా ప్రయత్నంచేసినా ప్రయోజనం వుండబోదు. నీలోనీ వేదీర్ఘంగా ఆలోచించుకో. నేను ఎందుకీ నిర్ణయానికి వచ్చానో నీకే బోధపడుతుంది. మొదట్లో నేనూ ఆందోళన చెందిన మాటనిజం, అయితే ఇప్పుడు నా మనస్సు పూర్తిగా కుదటపడింది. నాగతి ఏమి కానున్నదో తెలియదు. భవిష్యత్తంతా అంధకారబంధురంగా, అయోమయంగా గోచరిస్తోంది. ఏమైనా కానియ్యి; అతన్నే పరిణయమాడతాను.

బైకోవ్ ఇప్పుడే వచ్చాడు. ఈ లేఖను హఠాత్తుగా మధ్యలో ముగించకతప్పదు. చెప్పవలసిన విషయాలింకా ఎన్నో వున్నప్పటికీ, దీనిని చాలించక తప్పదు.

వి. డి.

వర్వారా అలెగ్జైయేవా, నా ముద్దుల మూటా,

ప్రియతమా, నీ జాబుకు హడావిడిగా జవాబు వ్రాస్తున్నాను. నీ లేఖచూసి నిజంగా నిర్విణ్ణుడనై పోయానంటేనమ్మ:. ఎక్కడో ఏదోలోపం వుంది. కాలం పూర్తిగా పాడై పోయింది. నిన్నమట్టుకు నిన్న గోర్ష్కోవ్‌ను సమాధి చేశాం. అవును. బైకోవ్ చాలా ఉదాత్తంగా వ్యవహరించాడు. కావచ్చు. కాని నీవు నిజంగా అందుకు అంగీకరించావా ప్రియతమా? అంతా ఆ పరమాత్ముని మహిమ. ఏమిచేస్తాం? దేవుని కృపాకటాక్షం ఈ దీనునిపై ప్రసరించటంలేదు. అది నా కర్మ. ఎవరేమిచేస్తారు? చివరకు ఫెదోరాకూడా అంగీకరించిన దన్నమాట. ఇక నీ జీవితం సుఖప్రదం అవుతుంది; నిజమే. ఇక నా చిన్నారి వయ్యారి సంతృప్తిగా జీవిస్తుంది. సరేగాని వరెంకా, ఇంతతొందరపాటు ఏలచెప్పు? అవునవును. బైకోవ్ వ్యవహారాలు చాలా జరూరుకదూ. ప్రతివ్యక్తికి ఏదో గొడవలు వుండనే వుంటాయి. సందేహం లేదు. ప్రతివాడూ చూసుకోవలసిన పనులు ఉండకపోతాయా...మీా ఇంట్లో నుంచి అతను బయటకొస్తూంటే చూశాను. చూడటానికి బాగానే వుంటాడు. చాలా పెద్దమనిషిలాగా కన్పిస్తాడు. అతను ఎలా వున్నాడన్నది కాదు అసలు విషయం. ఈ కబురువిని నేను పూర్తిగా తలకిందులైపోయాను. ఇక మనిద్దరం. ఈ ప్రపంచంలో ఉత్తర ప్రత్యుత్తరాలు ఎలా వ్రాసుకోగలం

చెప్పు? ఒంటరిగా నేను ఎలా జీవించను? నీవు చెప్పినట్లు, నీవు పేర్కొన్న కారణా లన్నింటినీ మనసులో గుణిస్తూనే వున్నాను. అన్ని విషయాలు ఆచి, తూచి ఆలోచిస్తున్నాను. కూర్చున్న చోటనుంచి కదలకుండా ఆలోచిస్తున్నాను. నీ ఉత్తరం అందేటప్పటికి, నేను ఆ వ్రాతప్రతిలో 20 వ పేజీని కాపీచేస్తున్నాను; ప్రియతమా, నీవు వెళ్ళిపోతున్నావుగదా! నీ కెన్నో వస్తువులు కొనిపెట్టాలి; దుస్తులు, కాళ్ళజోళ్లు, యిత్యాదులు అనేకం కావాలి. అన్నట్టు నాకు తెలిసినషాపు ఒకటి ఉందిలే. ఆ షాపునుగురించి నీకు ఇంతకుముందు ఒకసారి చెప్పాను, ఆఁ. అదే గుర్తులేదూ? కాని, ఇప్పుడే ఎలా వెళ్ళిపోతావమ్మా? ఆఁ. నా బుర్రకి ఒక మంచి ఐడియా తట్టిందిలే. చెప్పమంటావా? నీవు వెంటనే వెళ్ళలేవు. వెళ్ళటానికి వీల్లేదు. అది అసంభవం. ఎన్ని వస్తువులు కావాలి; చివరకు బండికూడా కావాలిగదా! పైగా వాతావరణం బొత్తిగా బాగాలేదు. చూడు, వర్షం తెరిపిలేకుండా ఎలా కురుస్తోందో? కుండపోతవర్షం! ఇంత చలిగాలిలో, హోరు వానలో నీవు బయలుదేరటమా? అదీకాక...నీకు జలుబు చేస్తుంది. నీ హృదయం చల్లబడిపోతుంది. కొత్త వ్యక్తితో కలసి గుర్రమెక్కి ప్రయాణం చేయడానికి నీవు భయపడటంలా? ఇక ఈ లోకంలో నాకు మిగిలేదేమిటి? నీవు చాలా అదృష్టవంతురాలవని ఫెడోరా అంటోంది. కాని అది వట్టి రాడీవెధవ అయిపోయింది. నన్ను సర్వనాశనం చేయాలని అది చూస్తోంది. అన్నట్టు చర్చికి వస్తావా? అక్కడ నిన్ను ఒకసారి, బహుశా తుదిసారి తనివితీరా చూస్తాను. నిజం,

ప్రియతమా, నిజం. నీవు విద్యావంతురాలివి. యోగ్యురాలివి. లతకన్నా లేతనైనమనస్సుగలదానివి. కాని, అతను ఉన్నాడు చూశావు, బైకోవ్, ఆ వ్యాపారికూతురిని పెళ్ళాడటమే బాగావుంటుంది. ఏమంటావు? చెప్పు ప్రియతమా, అతను ఆ వ్యాపారికూతురిని పెళ్ళాడటమేబాగుంటుందికదూ? బాగా చీకటిపడ్డ తర్వాత ఒక గంటకు నీ గదికి వస్తాను. సూర్యుడస్తమిస్తున్నాడు. చీకటితెరలు కమ్మిన తరువాత తప్పక వస్తాలే. బైకోవ్ వచ్చివెళ్ళిన తర్వాతనే వస్తాలే. అప్పటిదాకా వేచివుండు ప్రియతమా, నేనువస్తాగా.

మకార్ దెవూష్కిన్

సెప్టెంబరు, *27*

*ప్రియమిత్రమా, మకార్ అలెగ్జివిచ్,*

బైకోవ్ అంటున్నారు, కనీసం మూడు పెట్టెల దుస్తులైనా నేను తక్షణం కుట్టించుకోక తప్పదని. అది ఆయన ఆదేశం. సమయమా చూస్తే ఆటే లేదు. త్వరగా కుట్టియివ్వగల దర్జీని వెతకాలి బైకోవ్ వేగిరి పడిపోతున్నాను. ఇక అయిదు రోజులలోనే మా వివాహం. వివాహమైన మరుసటి

రోజునే మా ప్రయాణం. బైకోవ్ చాలా త్వరపడుతున్నారు. కాలయాపన చేయటం సిగ్గుచేటు అంటున్నారు. అందుచేత ఊపిరిపలపటానికి కూడా వీల్లేక నేను చచ్చిపోతున్నానంటే నమ్ము. ఎన్ని పనులు చూసుకోవాలి! నేను చక్కగా అలంకరించుకొని, అతిలోకసుందరంగా తయారుకావాలని బైకోవ్ కోరిక. "నిన్ను చూసి మిగతా వనితలంతా అసూయపడేట్టు సింగారించుకోవాలి" అన్నాడాయన. తనభార్య ఒక పనిమనిషి రూపంలో కన్పించటం తనకు బొత్తిగా నచ్చదని ఆయన హెచ్చరించారు. అందుచేత నా దుస్తుల సేకరణ కార్యక్రమంలో నీవుకూడా నాకు కొంతసహాయం చేసిపెట్టాలి. నా స్థితి యివాళ అంతబాగా లేదు. మేము కొత్తగా ప్రవేశించిన మేడ పైభాగంలో చలి విపరీతంగావుంది. ఎక్కడి సామాన్లు అక్కడే, చిందర వందరగా పడివున్నాయి. బైకోవ్ మేనత్త ఒకతెవుంది. ఆమె పండు ముసల్ది. ఏ క్షణాన రాలిపోతుందో నన్నంత భయంగావుంది. కనీసం మేము వూరుకి ప్రయాణం అయ్యేదాకా బ్రతుకుతుందో లేదోకూడా చెప్పలేను. ఫరవా లేదు! ఆమె మరికొంతకాలంపాటు నిక్షేపంగా బతుకుతుందిలే అని బైకోవ్ ధీమాగా చెప్పుతున్నారు. పరిస్థితంతా అస్తవ్యస్తంగావుంది. బైకోక్ ఇక్కడ వుండటం లేదు; ఇంట్లో పనిమనుష్యులు ఎక్కడికి పోతారోయేమో, ఏ పని మీద పంపిద్దామన్నా ఒక్కరూ కన్పించరు. పనిభారమంతా ఫెడోరా నెత్తినే పడుతోంది. బైకోవ్ నౌకరు వుంటే, ఈ పనులన్నీ అతనే చూసేవాడు. అతను కూడా మూడు రోజులక్రితం మాయమై పోయాడు. బైకోవ్ రోజూ

ఉదయాన ఇక్కడకి వస్తున్నారు. కస్సు బుస్సు మంటూ వస్తున్నారు. నిన్న ఇంటికాపలాదారునిని చావచితక తన్నాడు. దానితో పెద్దగొడవ జరిగింది. ఆ వ్యవహారం పోలీసులదాకా పోయింది. నీకు ఉత్తరాలు పంపుదామంటే, మనుష్యులెవ్వరూ లేరు. అందుచేత ఈ జాబును పోస్టులో వేయబోతున్నాను. అన్నట్టు అసలు విషయం చెప్పటం మర్చిపోయాను. దయచేసి ఒకసారి దర్జీ దగ్గరకు వెళ్ళి ఈ విషయం మర్చిపోకుండా చెప్పు: నిన్న పంపిన నమూనా ప్రకారమే కుట్టమను, తెలిసిందా. రోజురోజుకి ఫాషన్లు మారిపోతున్నాయి. తాజా ఫాషన్ మాత్రమే నాకు నచ్చుతుంది. చేతి రుమాళ్లను సగిషీ అల్లికతో కుట్టమని చెప్పు. మామూలు కుట్టు నాకు నచ్చదు. చెప్పిన సంగతులన్నీ గుర్తుంచుకొంటావుగా? దర్జీకి చెప్పటం మర్చిపోకేం.

నీ

వి. డి.

తాజాకలం: నా షోకుకలంకోసం నిన్ను యిబ్బంది పెట్టుతున్నందుకు మన్నించు. ఇందుకు నేను సిగ్గు పడుతున్నాను. నిన్నగాక మొన్న రోజంతా కాళ్లు బలపాలు కట్టేటట్లు నా పనులకోసం అదేపనిగా తిరిగావు. కాని, నేను ఏమిచేయగలను, చెప్పు? నిస్సహాయస్థితిలో వున్నాను. ఇక్కడ చూదామా అంటే అంతా గొడవగావుంది. కనుక దయచేసి, నాపై కోపగించకు మకార్ అలెక్జేవిచ్. నేను

చాలా విచారంలో వున్నాను. నా గతేమి కానున్నదోగదా? ప్రియతమా, మకార్ అలెగ్జెవిచ్, నాకు భయం భయంగా వుంది. భవిష్యత్తుగురించి తలపోయటమంటేనే మహాభయంగా వుంది. అయోమయావస్థలో జీవిస్తున్నాను.

తాజా తాజా కలం: దయయుంచి నేను చెప్పిన విషయంమాత్రం మరచిపోకు. నీవు మరచిపోతావనీ, ఏదో ఒక పొరపాటు దొర్లుతుందనీ భయపడుతున్నాను. కనుక నా లేఖను మరొకసారి చదువుకొని, సరిగా నేను చెప్పినట్లే దుస్తులు కుట్టమని దర్జీకి మరీ మరీ చెప్పుతావుకదూ? మర్చిపోవుగదా?

వి. డి.

సెప్టెంబరు, 27

*ప్రియమైన వర్వారా అలెగ్జెయేనా,*

నీవు చెప్పినట్లే, అన్నిపనులు పూర్తిచేశాను. నీ అందచందాలకు చక్కగా అతికేటట్లు దుస్తులు కుట్టుతానని దర్జీ చెప్పిన సంగతి నేను ఇందుమూలంగా నీకు తెలియజేస్తున్నాను. ఆ దర్జీ చెప్పిన మాటలు నాకు అసలు ఏమీ అవ

గతం కాలేదు. ఏవేవో మాటలు చెప్పింది. ఆ మాటలు నాకు సరిగా గుర్తుకూడా లేవు. నీకు తగినవిధంగా ఉడుపులు తయారు చేస్తానని చెప్పటం మాత్రం నాకు గుర్తుంది. అంతే. అవసరమనుకొంటే నీవే వెళ్ళి, ఆ వివరాలన్నీ అడిగి తెలుసుకో. ఈవేళ అటు ఇటు పరుగెత్తటంతోనే సగం చచ్చి పోయాను. ఆఫీసుకు కూడా వెళ్లలేక పోయాను. అయితే నన్ను గురించి అంతగా ఆందోళన చెందకు, ప్రియతమా. కావాలంటే నీకోసం ముల్లోకాలు తిరిగి, నీవుకోరిన దానిని తెచ్చి యివ్వటానికి నేను సిద్ధం. భవిష్యత్తును గురించి తలపోయటమే మహాభయంగా వుందని వ్రాశావు. అయితే రేపు ఉదయం 9 గంటలకల్లా అన్ని సంగతులు నీకు తెలుస్తాయి. దిగులు చెందకు, ప్రియతమా, అన్నీ మన మంచికే వచ్చాయనుకొని మనసు దిటవుపరచుకో. సరే నీ యింటికి ఒకసారివచ్చి, నిన్ను చూచి పోతాలే; తప్పకుండా వస్తాగా, నిజానికి రెండుసార్లు మీ యింటి గేటు దాకా వచ్చాను. కాని, బైకోవ్, అంటే శ్రీ బైకోవ్‌గారు అసలే మండిపడి పోతున్నారని జ్ఞప్తికొచ్చి...ఏమిచేస్తాను చెప్పు? తిరుగుముఖం పట్టాను.

మకార్ దెవూష్కిన్.

సెప్టెంబరు, 28

ప్రియమైన మకార్ అలెగ్జివిచ్,

నీకు పుణ్యం వుంటుంది. తక్షణం బంగారపుకోట్టుకు పరుగెత్తు. చెవులకు ముత్యాల లోలుకులు చేయవలసిన అవసరంలేదని చెప్పు. ధర చాలా హెచ్చుగావుందని బైకోవ్ గొడవచేస్తున్నారు. ఆయనగారు మండిపడుతున్నారు. ఇప్పటికే చాల డబ్బు ఖర్చయిపోయిందనీ, నిలువుదోపిడీ జరిగి పోతున్నదనీ కేకలేస్తున్నారు. అంతేకాదు. నిన్న ఆమాట కాస్తా అనేశారు. ఇంత ఖర్చు తగలడుతుందనుకొంటే ఈ తద్దినం అసలు పెట్టుకొనేవాడినేకాదనికూడా చెప్పేశారు. మూడుముళ్ళు పడిన మరుక్షణం ఊరికి వెళ్ళిపోవాల్సిందే ననీ, ఇక ఇక్కడ ఒక రోజుకూడా వుండేందుకు వీల్లేదనీ, ఇక్కడుంటే కొంప గుండమైపోవటమేననీ యిష్టమొచ్చినట్లు మాట్లాడారు. అతిథి మర్యాదలకోసం డబ్బంతా ఖర్చయి పోతున్నదనీ, పెళ్ళయిన తర్వాత నేను విందులకు, వినోదా లకు, నృత్యాలకు పోకూడదని ఆంక్షకూడా పెట్టారు. నేను నలుగురితో తైతక్కలాడటం ఆయనగారికి బొత్తిగా నచ్చ దట. పెళ్లిసందర్భంలోకూడా విందు, నృత్యాలు ఏర్పాటు చేయరట. ఇదీ ఆయన ధోరణి. వాటన్నిటికోసం నే నేమన్నా పరితపిస్తేగదా ? ఈ కోర్కెలన్నీ ఆయనకే కలి గాయి. ఆయన వీటన్నిటికీ ఆర్డరిచ్చారు. ఈ మాట ఆయన మొఖానే అనేద్దామనుకొన్నాను. కాని తమాయించు

కొన్నాను. అంతే మండిపడిపోతున్నారు. అగ్నిలో ఆజ్యం పోస్తే యింకేమన్నా వుందా? కొంపలారిపోవూ! నాగతి ఏమి కానున్నదో ఆ పరమాత్మునికే తెలియాలి.

వి. డి.

సెప్టెంబరు, *28*

*వర్వారా అలెగ్జియేనా, నా చిట్టితల్లీ,*

నేను...అంటే, ఆ బంగారపు కొట్టువాడి దగ్గరికెళ్ళి, ఏ గొడవలేకుండా అన్ని విషయాలు సర్దుబాటుచేసి వచ్చాను. నే నింతకీ మొదట చెప్పవచ్చిందేమంటే, ఆఁ ఏమీ లేదు, నా ఆరోగ్యం బాగా లేదు. పడక బెట్టాను. ఆపాడు జబ్బు యిప్పుడే రావాలా? బోలెడు పనులు చేయవలసిన తరుణం లోనే అది దాపురించాలా? ఏం పాడో, దురదృష్టం అంటే ఇట్లాంటి దేకాబోలు. ఇంతటితో నాకష్టాలగాథ అంతంకాలేదు. ఇంకావిను. హిజ్ఎక్సలెన్సీ ఈమధ్య నాపై గుర్రెర్రచేస్తు న్నారు. ఆయనకు నాపై ఎందుకో అంతకన్నెర్ర? నన్ను గురించి హిజ్ఎక్సలెన్సీ యెమోల్యాన్ ఇవనోవిచ్ వద్ద గొంతుచించుకుంటూ రంకెలువేసి, అలిసి పోయారట. నన్ను గురించి పాపం, ఏ పాప మెరుగని ఆ అభాగ్యుడివద్ద ఎందుకో

ఆ రంకెలు? ఇంతే; నేను చెప్పదల్చుకొన్నదింతే. ఇంకా అనేక విషయాలు వ్రాయాలనే మనస్సులో వుందికాని, ఆ విషయాలన్నీ వ్రాసి నీ మనస్సును క్షోభపెట్టటం నాకు యిష్టం లేదు. నేను నిర్భాగ్యమాటస్థుడిని. మనస్సులో విషయాలు మనస్సులో దాచుకొని, కపట నాటకమాడే తెలివితేటలు నాకు బొత్తిగా లేవు. మనస్సులో మెదిలిన భావాలే కలంలో గుండా కాగితంపైకి ఎక్కుస్తాను. అందుచేతనే నేను వ్రాసిన కొన్ని సంగతులు నీకు రుచించక పోవచ్చు. సరే, ఇదంత ముఖ్యమైన విషయం కాదనుకో.

నీ

మకార్ దెవూష్కిన్.

సెప్టెంబరు, *29*

వర్వారా అలెక్సియేనా, నా చిట్టితల్లి,

ఇవ్వాళ ఫెడోరాను కలుసుకొన్నాను. ఆమె చెప్పగా తెలిసింది. రేపే నీ వివాహమనీ, రేపు లేదు ఎల్లుండే మీ ప్రయాణమనీ, శ్రీ బైకోవ్ అప్పుడే బాడుగబళ్ళు సిద్ధంచేసి వుంచారనీ ఫెడోరా చెప్పగా విన్నాను. నిన్నటి లేఖలోనే

నీకు తెలిపానుకదూ. హిజ్ ఎక్సెలెన్సీ నా విషయంలో శిరమెత్తిన వ్యక్తివలె వ్యవహరిస్తున్నారని నీకు చెప్పాగా. ఇంకా నీకు తెల్పవలసిన సంగతులు ఏమిటబ్బా? ఏమిటో పాడు, చెప్పదల్చుకొన్న విషయాలు అన్నీ మర్చిపోతున్నాను. ఆఁ గుర్తుకొచ్చిందిలే. గోర్ష్కోవ్ నాయాలోని కొట్టువాడు పంపించిన బిల్లులన్నీ చూశాను. కూడికలో ఎలాంటితప్పులు లేవు. పోతే ఖరీదులుః మాత్రం చాలా హెచ్చుగా వున్నాయి లే. అయితే బైకోవ్ నీమీద చిందులు తొక్కటమెందుకు? నీవేముచేశావని? సరే, ఇకనైనా హాయిగాజీవించు. ఓ నా చిట్టితల్లీ, నా ఆఖరికోర్కె యిదే. నీవు సుఖంగాజీవిస్తేచాలు. నాకు అదే పదివేలు. నా నడుంనొప్పి కాస్త నెమ్మదిస్తే, నీ వివాహానికి తప్పకుండా వస్తానమ్మా. పోతే ఇక మన లేఖలను ఇక్కడకు అక్కడకు చేరవేసే దెవరు? ...... ఫెడోరా ఆ పని...నీవు దానిని తల్లికన్నా మిన్నగా చూశావు. నీది నవనీతమైన మనస్సు. నీవు కరుణాశీలివి. ధైర్యశాలివి. సద్గుణాల పోగువి. అందుకే దేవుడు నిన్ను కంటిలో పాపలాగా కాపాడి తీరుతాడు. మంచిపనులు రాణించకపోవు. పుణ్యానికి పరిహారం అందకపోదు. మంచి తనమే జయిస్తుంది. చివరకు దేవలోకాన్నికూడా జయించేది అదేనమ్మా. ఈ లోకంలో నాకు మిగిలిందల్లా నీవే. నా పంచ ప్రాణాలు నీ మీదే వుంటాయి. అనుక్షణం నీకు లేఖలు వ్రాస్తుండటంకన్నా నాకుఆ నందదాయకమైనది మరొకటివుండ బోదు. నీవుపంపిన "ది టేల్స్ ఆఫ్ ఇవాన్ బెల్కిన్" పుస్తకం నా దగ్గరే మిగిలిపోయింది. దయచేసి, అది నా దగ్గరే వుండ

నీయి. దానిని చదవాలన్న తృష్ణ నాకు లేదు. నీ స్మృతి చిహ్నంగా అది నా దగ్గర వుంటుంది. వస్తున్నది చలికాలం. చలికాలం రాత్రులు పొద్దుపోవటం చాలా కష్టం. అప్పుడు నీ పుస్తకం చూసుకొంటూ లేదా చదువుకొంటూ కాలక్షేపం చేస్తాను. నేను ఇప్పుడు ఉంటున్న ఇంటిని వెంటనే ఖాళీ చేసి, ప్రస్తుతం ఫెడోరా వుంటున్న కొంపకు అంటే యింతకుపూర్వం నీవు వుండి వెళ్ళిన యింటికి మారుతాను. నిజాయితీపరురాలైన ఆమెను నే నెన్నటికీ దూరం చేయ బోను. అంతేనా, ఆమె ఎంతో కష్టపడి పని చేసేమనిషి. ఇంతకుపూర్వం నీవు నివసించిన గదిని నిన్న నేను సందర్శించాను. గది ఖాళీగావుంది. గదిలో ఇటు అటూ నాలుగు సార్లు పచార్లు చేస్తుంటే పూర్వ స్మృతులు నా మదిలో మెదిలాయి. గదిలోని ప్రతి వస్తువూ నిన్నే స్ఫురింప జేస్తున్నది. ఒకమూల నీ అల్లిక పనిముట్లు పడివున్నాయి. ఆ వస్తువు లన్నింటినీ పరిశీలనగా పరికించాను. నేను వ్రాసిన లేఖలలో ఒకదానిని మడచి, సిల్కుదారం, ఉండగాచుట్టి నందుకు నే నెంతో సంతసించాను. టేబుల్ మీద ఒక కాగితపుముక్క కన్పించింది. "ప్రియమైన మకార్ అలెక్జ విచ్, నేను నీకీ విషయం వెంటనే......" అని వ్రాసి అంతలోనే ఆపేశావు. బహుశా ఎవరో వచ్చి, నీకు విఘాతం కల్గించివుంటారు. పోతే, తెర వెనుకనే నా చిన్నారి వయ్యారి పడకవుంది. చిట్టితల్లి, సెలవు. సెలవు, ప్రియతమా. వెంటనే ఈజాబుకు జవాబు వ్రాస్తావుగదూ!

మకార్ దెవూష్కిన్.

*మకార్ అలెగ్జెవిచ్, నా నిరంతర ఆప్తమిత్రమా,*

జరగవలసింది జరిగిపోయింది. మూడుముళ్లు పడిపోయాయి. ముందు నాగతేమి కానున్నదో తెలియదు. ఆయన గారి అభీష్టం ప్రకారం నడుచుకొంటాను. తర్వాత పైన ఆ పరమాత్ముడే వున్నాడు. రేపే మా ప్రయాణం. బహుశా ఇదే తుదిలేఖ కావచ్చు; ఆప్తమిత్రమా, ఆపత్కాలంలో నన్ను ఆదుకొన్నావు. అన్నివిధాలా అండగా నిలిచావు. నాకోసం కుమిలిపోకు. ఆనందంగా కాలం గడుపుకో. నన్ను మర్చిపోకు. భగవంతుడు సదా నీకు మేలు చేకూర్చుగాక. ప్రతిరోజూ నేను ఇదే ప్రార్థన చేస్తుంటాను. నేనిక్కడగడిపిన జీవితం ఈ విధంగా అంతమవుతున్నది. ఇక్కడ నా జీవితం అత్యంతం కష్టాల మయమేగదా? భవిష్యత్తులో ఈ జీవితాన్ని తల్చుకొని, నేను పొందగల ఆనందం ఏముంటుంది? కాని నీ స్మృతిమాత్రం నా హృదయాన్ని సంతోషపుటుయ్యాలలో ఊగిస్తుంది. నా ఏకైక మిత్రుడివి నీవే, నన్ను ప్రేమించిన ఏకైక వ్యక్తివి నీవే. నేను చిరునవ్వు నవ్వితే చాలు, ఒక ముక్క వ్రాస్తేచాలు నీముఖం చాటంతఅయ్యేది; నీ హృదయం ఉప్పొంగేది. ఇక నీవు నన్ను మర్చిపోవాలి. ఇక నీవు ఏకాకిగా బ్రతకాలి కాబోలు. నిన్ను సముదాయించేవారు, ఊరటకల్గించేవారు యింకెవ్వరున్నారు? ఓ దయామయా, నా ఏకైక మిత్రమా, నీవు కోరినట్లు నా

పుస్తకం నీ దగ్గరేవుంచుకో. ఇంతకుపూర్వం నేను జీవించిన గదిలో వదిలివచ్చిన నా వస్తువులలో నీకు నచ్చినవాటిని తీసుకో. మొదలుపెట్టి, మధ్యలో ఆపివేసిన ఆ లేఖను కూడా, అవసరమనుకొంటే దాచుకో. ఆ లేఖను పదేపదే చూసుకో. దానిలో నేను వ్రాయాలనుకొన్న దేమిటో? ఏమీ గుర్తు లేదు. నిన్ను అమితంగా ప్రేమించిన ఈ అభాగ్య దీనురాలు వరెంకాను మాత్రం మరచిపోకు. నీవు వ్రాసిన లేఖలన్ని ఫెడోరాకు అప్పగించాను. అవ్వన్నీ ఫెడోరావద్దనే భద్రంగా వున్నాయి. నీకు సుస్తీచేసిందని వ్రాశావు. కాని, బైకోవ్ ఇవాళ నన్ను గడపదాటి, బయటకు పోనివ్వటంలేదు. ఆ శిక్ష విధించాడు. అగ్నిసాక్షిగా వివాహమాడిన భర్త ఆనతి మీరటం వనిత తరమా చెప్పు? నీకు ఉత్తరాలు వ్రాస్తుంటా ననుకో. కాని, ఏది ఎలా జరుగుతుందో ఎవరు చెప్పగలరు? అందుచేత మనం వీడ్కోలు యిచ్చుకోటం మంచిదికాదా? ఓ నా ప్రియతమా, నా నిక్షేపమా, నిన్ను కౌగలించుకోవా లని బుద్ధిపుడుతోంది. సెలవు, మిత్రమా, సెలవు. సుఖంగా, సంతోషంగా జీవించు. నీకోసం నేను దైవాన్ని ప్రార్థిస్తాను. నా హృదయం చాలా భారంగావుంది. బైకోవ్ పిలుస్తున్నారు. వెంటనే ఆయనగారిదగ్గరకు పోవాలి.

నీ నిరంతర అనురాగ మాలిక,

వి. డి.

తాజాకాలం: నా హృది పరితప్తమైవుంది. నా నేత్రాలు సజల పూరితాలైనవి. ఊపిరి సలపటంలేదు. సెలవు, ఆరి భగవంతుడా! ఈ పేదగుండె వరెంకాను మాత్రం గుర్తుంచుకో.

వరెంకా, ప్రియతమా, నా ప్రేమ పతంగమా, నా చిట్టితల్లీ,

నానుంచి నిన్ను దూరంచేసేస్తున్నారు. నీవు నన్ను విడిచి వెళ్ళిపోతున్నావు. ఇంతకన్నా నాహృదయాన్ని చీల్చితే, నా గుండెలను పగిల్చితే ఎంతో సంతసించే వాడిని. ఈ పనికి నీవు ఎలా సమ్మతించావమ్మా? నీవు దుఃఖిస్తున్నావు. దుఃఖంతోనే వెడలిపోతున్నావు. నాకు తెలుసు. నీ కన్నీటి ధారలతో తడిచిన నా లేఖ తడి యింకా ఆరనే లేదు. ఇక్కడి నుంచి వెళ్ళిపోవటం నీకిష్టంలేదని దీనినిబట్టేస్పష్టమవుతున్నది. ఇతరులు నిన్ను బలవంతాన...అందుచేత నీవు నాస్థితినిగాంచి చింతిస్తున్నావన్నమాట......నన్ను ప్రేమిస్తున్నావన్నమాట. ఇక నీ మంచిచెడ్డలు చూసేదెవ్వరు? నీ చిన్నారి హృదయం విచారంతో, దిగులుతో కుమిలిపోతుంది కాబోలు. విచారం నీ హృదయాన్ని మింగేస్తుంది; దిగులు నీ గుండెలను చీల్చివేస్తుంది. అక్కడ నీవు కన్ను మూస్తావు. నీ కళేబరాన్ని తీసుకుపోయి స్మశానంలో పాతేస్తారు. నీ కోసం పరితపించేవాడు, దుఃఖించేవాడు, కంట తడిపెట్టేవాడు ఒక్కడూ వుండడు. శ్రీ బైకోవ్ వేటలో మునిగి తేలుతుంటాడు. అవును ప్రియతమా, నీ వింత అనాలోచితమైన పని ఎలా చేశావంట? ఎంత పనిచేశావు! చేజేతులా చేటు తెచ్చుకొన్నావుకదా? వాళ్ళంతా నిన్ను స్మశానానికి పంపిస్తారు. ఈ లోకంలోనుంచి నిన్ను సాగనంపకమానరు. నీవు నెమలి ఈకవంటిదానివి, నిజం. నా చిన్నారీ వయ్యారీ, నిజం. నే నెక్కడున్నట్టు? నేనేం చేస్తున్నట్టు? చిన్నపిల్ల మోజు పడిందని నాకు తెలుసు. చిట్టితల్లికి జబ్బుగావుందనీ తెలుసు.

నేను ఒకపని చేసివుంటే...... ఆ పని నేను చేయలేదు. పరమ మూర్ఖునివలె వ్యవహరించాను, ఆలోచించలేదు. కాన లేదు. అసలు పట్టీపట్టనట్లు, అంటీఅంటనట్లు వ్యవహరించాను. ఆరి భగవంతుడా, ఎన్ని తిప్పలు తెచ్చిపెట్టావురా! నిన్నా, మొన్నా బజార్లంటపడి అరికాళ్ళు బలపాలు కట్టేటట్లు తిరిగాను. ఇవాళ పడకబెట్టాను. ఫరవాలేదులే. వరెంకా, రేపు మళ్ళీ మామూలుగానే తిరుగుతాను. జబ్బు నయమైపోతుంది. జబ్బు మంచంపైనుంచి లేచి, సరాసరి నీ దగ్గరకే వచ్చి, నీవు ప్రయాణం చేస్తున్న బండి చక్రాలక్రింద పడిపోతాలే. నిన్ను చస్తే పోనివ్వను. ఇంత దారుణమా! నిన్ను బలాత్కరించి తీసుకుపోయే అధికారం వాళ్ళ కెవ్వరిచ్చారు? సహించను; నేనూ నీ వెంటనే బయలుదేరుతాను. నీవు ప్రయాణంచేసేబండి కమ్ములు పట్టుకొని, పరుగెత్తుతాను. అలుపువచ్చి, నేలకూలిపోయేదాకా పరుగెత్తుతాను. నీవు ఎక్కడికి వెళ్ళిపోతున్నావో తెలుసా? తెలియకపోతే నేను చెప్పుతాను విను. స్టెప్పీలలోకి నీవు వెళ్ళిపోతున్నావు. అక్కడ చెట్లూ, చేమలూ మచ్చుకైనా కానరావు. అదంతా కటికిఎడారిలా వుంటుంది. అక్కడ నీ కంట పడేదృశ్యాలు ఎలాంటివి? కాయకష్టం చేస్తూ, కడుపునిండా తిండిలేక, శల్యావశిష్టంగా తయారైన రైతుల భార్యలు, తప్పత్రాగి మొరటుగా ప్రవర్తించే వాళ్ళ భర్తలు నీకు అగుపిస్తారు. వానలతో చలిగాలులతో చివరకుఅక్కడి చెట్లన్నీ కుప్పకూలివుంటాయి. అలాంటి చోటికి నీవు వెళ్ళుతున్నావు. శ్రీ బైకోవ్ వేటలో మునిగి తేలుతూంటాడు. ఇక నీవో? భూస్వామి భార్యగా

వుండాలని నీవు కోరుకొంటున్నావా, ప్రియతమా ? అసంభవం వరెంకా, ఇక నేను ఎవరికి ఉత్తరాలు రాసేది ? కాసేపుఆగి ఈ విషయం ఆలోచించు. నేనెవరికి ఉత్తరాలు రాయను ! "వరెంకా" అని ఇంక నే నెవరిని పిలవను ? ఆముద్దు పేరుతో నే నింకా ఎవరిని పిలవాలి ? నా చిన్నారి దేవకన్యా, ఇక నీవు నాకు ఎక్కడ కనిపిస్తావ్ ? నేను ఎటు తిరిగి చచ్చిపో తాలే, వరెంకా ఈ ఎడబాటు సహించలేను. ఈ దురదృష్టం గడిచి గట్టెక్కలేను. అంతవరకు ఖాయం. నిన్ను అమితంగా ప్రేమించాను. సొంత కూతురు లాగా నే భావించాను. నీకోసమే జీవించాను. నీవు నాకు అందుబాటులో వున్నందునే నేను పని చేయ గలిగాను. కాపీలు తీయగలిగాను. ప్రేమలేఖల రూపంలో నా మనస్సు నీకు విప్పి చెప్ప గలిగాను. బహుశా ఈ సంగతి నీవు గమ నించి వుండవు. అయినా ఇది వాస్తవం. మరొక సారి నిన్నుసూటిగా ప్రశ్నిస్తున్నాను: నన్ను విడిచి, నీవు ఎలా వెడలి పోగల్గుతున్నావు ? అక్కడ నీకు ఎలా గడుస్తుంది ? నీవు పోవటానికి వీల్లేదు. అసంభవం; పూర్తిగా అసంబద్ధం ! జోరున వాన కురుస్తోంది. ముసురు పట్టింది. ఈ ముసురులో నీవు ప్రయాణించేస్తే, ఎటుతిరిగి నీకు జలుబు చేయక మానదు. అసలే నీవు బలహీనంగా వున్నావు. గాలి వేస్తే తూలిపోయేంత సన్నగా, దుర్బలంగా వున్నావు. ఆ బండి ముక్క చెక్కలైపోను. అది బద్దలుకాక మానదులే. ఈ ఊరువిడిచి, బయటకు వెళ్ళగానే ఆబండి ఇరుసు విరిగిపోతుంది. అప్పుడు ఏమనుకొన్నాలాభంలేదు: ఈ పీటర్స్బర్గు వడ్రంగులు

వట్టినీచులు అని తిట్టుకున్నా ప్రయోజనం వుండదు. నగరం లోని వ్యడంగులకు కావలసింది కేవలం అందచందాలు మాత్రమే. మనుగడ వారికి అవసరం లేదు. గట్టిబళ్లు వారు తయారు చేయరు. అది వారికి చేతకాదు. కావాలంటే పందెం కూడా వేస్తాను. నేనువచ్చి కావాలంటే బైకోవ్ కాళ్ళమీద పడతాను. దీనిని వారందరి ముందు రుజువు చేస్తాను. నా అను రాగమాలికా, నీవన్నా చెప్పిచూడు బైకోవ్‌ను ఒప్పించు. నీవు ఇక్కడేవుండి పోవాలనీ, వెడల పోవటానికి వీల్లేదనీ చెప్పు. ఆయన మాస్కోలోని ఆ వ్యాపారి కూతురుని ఎందుకు పెళ్ళాడలేదు? ఆ వ్యాపారి కూతురిని పెళ్ళాడినా ఎంత బాగుండును! అది చాలా బాగుండేది. వాళ్ళిద్దరికీ వయసూ, మనసు, అన్నీ చక్కగా అతికిపోయేవి! అప్పుడు నీవు ఇక్కడే నాతోనే వుండిపోవటానికి వీలు చిక్కేది. అయినా బైకోవ్‌తో నా కేమిటి అవసరం చెప్పు? అతగాడి సిరిసంపదలు చూసి మురిసి పోతున్నావా? సిరిచూసి మురిసిపోవలసిన సమయం కాదిది. ఇది జీవన్మరణ తరుణం. కలిమి లేములు కావటి కుండలు కాని ప్రేమ అన్నది ఉన్నది చూశావు, అది శాశ్వత మైనది. కాస్త ఓపికపట్టు. నా జీతం చేతికందేదాకా ఆగు. నీకు కావలసిన దుస్తులన్నీ నేనే కొనిపెట్టగలను. నీవు కోరు కొన్న దుస్తులు కొనిపెడతాను. కాస్త ఓపికపట్టాలి. అంతే జీతం వచ్చేదాకా ఆగు. నాముద్దులకూనా, ఇవాళ కాకపోతే రేపైనా నాజీతం నాచేతిక రాకమానదు. అయ్యో, వరెంకా, బైకోవ్‌తో కలిసి నీవు వెళ్ళిపోక తప్పదంటావా? ఇక నిన్ను చూడగల్గిన భాగ్యమే నాకు దక్కదంటావా? ఓ, వరెంకా

కనీసం మరొక లేఖ అయినా వ్రాసి వెళ్ళిపో. తప్పకుండా వ్రాయాలి. స్టెప్పీలలోనుంచికూడా మళ్ళీ ఉత్తరం వ్రాయి. నీవు ఇక ఉత్తరాలు రాయకపోతే, ఇదే తుది లేఖ. ఇదే తుది లేఖ కానటమా? అసంభవం. అదెలా జరుగుతుంది? అకస్మాత్తుగా ఆఖరి లేఖ అంటే నే నొల్లను. నేను మాత్రం నీకు ఉత్తరాలు వ్రాస్తూనేవుంటాను. నీవుకూడ జవాబులు వ్రాస్తుండు. నా శైలి ఇప్పుడిప్పుడే నిర్దిష్ట రూపం పొందుతోంది...... ఏమి శైలి. నేనేమి వ్రాస్తున్నానో, నేనేమి వాగుతున్నానోకూడా నాకు తెలియకుండా వున్నది. ఫరవా లేదు; నీకు ఉత్తరాలు వ్రాస్తునంతకాలం ఏమి వ్రాసినా ఫరవా లేదు...... నా చిన్నారీ వయ్యారీ. అనురాగమాలికా, మురిపాలనావా, ముద్దులకూనా!



## Check List

| Book Number | AA/OL/B/94 | Date | 23/9/2021 |
|---|---|---|---|
| Front Cover | YES | Back Cover | YES |
| Blank Pages | CI, 8, 1, 260, 261 | | |
| Missing Pages | NO | | |
| Prepared | K. Amrutha | Scanned | Sandhya |
| BOOK SIZE | H 7.1 W 4.8 | Pages | 266 |

